# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




ఏప్రెల్ 1955


సంపుటము 32 : : సంచిక 4


విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఏప్రైల్ 1955



త్రివర్ణ చిత్రము: గాలిపడగ—చిత్రకారుడు: శ్రీ హెచ్. వి. రామగోపాల్.

# ఆమని పాట

శ్రీ బొడ్డు బాపిరాజు

ఎలమావిపవడంపు తలిరాకు వేబోక
తళుకొత్త మీనకేతనమువోలె
కొనరుపూతల వేపకొమ్మగాలికి తూగి
యూరింప రాచిల్క తేరువోలె
క్రొందేనె కడుపార గ్రోలు తుమ్మెదమ్రోత
తవుల చక్కెరవింటి రవళివోలె
తొలిమొగ్గసింగార మొలుకుమల్లియప్రాలి
వలపింప పూవుచాపమ్మువోలె
ప్రియసఖుని పేరి నవశరద్విభు నిరీక్ష
మొదటిసామంతుడు వసంతు డెద భ్రమింప
అభినవాకృతి రమణీయ మాంధ్రభూమి
ఒరపారసె మన్మథ శుభావతరణవేళ.

మన్మథస్వాగతోత్సవ మధురగీతి,
నవవసంతపదార్పణా నంద రేఖ,
పలికె;– చిలికె క్రొంబసిడిప్రొద్దు
తియ్యనిడుగాది వేకువ తెనుగుజగతి.

పాయనికల్మి చెల్మి పరిపాలినకేమి; విచిత్రఖేల నీ
పోయినపోకడల్ మరిచిపోము! ప్రభుత్వమె యొడ్డిగిల్ల 'నో
రా!' యనునాటకమ్మనె సుఖాంత మొనర్చితిమేలు! పోయిరా
వోయి జయా! ప్రియాతిథిమహోదయ! వెచ్చనివీడుకొల్పులన్.

జయవిజయుల్ ప్రసన్నగతి సాగినచల్లనిత్రోవ, లీశుభో
దయమున వెల్గు మా జనపదమ్ములు కమ్మనిపూలదోసిళుల్
గయికొని నిల్పెస్వాగతముగా; కుడికాలునుపెట్టిరమ్మ! అ
క్షయమగుపాడిపంటల జగమ్ముసుభిక్షముగాగ మన్మథా!

ప్రాణములూదిమేలుకొలుపంగ వసంతుడువచ్చిరాక పా
షాణములుంజివిర్చినవిచక్కగ. నీదగురాక నిత్యక

శ్యాణము పచ్చతోరణములైనవి మా మొగసాల, లందు వి
న్నాణముగాగ మ్రోగుసహానాయిపయిన్ ప్రభుకీర్తికింకిణుల్
అరువదివత్సరమ్ములవి యద్భుత కాల మహావిపంచికన్
పరచినతంత్రు, లొక్కొకటివంతున మ్రోగు. తదీయగాత్ర వి
స్ఫురణ విచిత్ర నామములుపొందెనటే — ఎటులైననీవు సుం
దరతరమూర్తి వే మధురనాదము మాకయిదాచియుంచితో?

పచ్చలపందిళ్లు పరపించియామని
        పుడమిబీటలు వార పొడిచి యెండ.
దోసిళ్ళ ముత్యాలు పోసి మేల్తాలకరి
        కోరినప్పుడువచ్చి కురిసి వాన
చల్లించి పన్నీటి జల్లులు వెన్నెల
        పురిటిపంటలవలంతి నరసి మంచు
పాలిపోనిపంటలగాలిచి 'సంకురుమయ్య'
        చివురుప్రోదియొనర్చి శిశిరబాల
ఎల్ల ఋతువులు నీవుగా నేలుకొనుచు
అన్నదమ్ములలోన నీయంత వాని
కనమనంగ ముక్కారు ముద్దిసునుపండి
ఆడుకొను తెన్గునేల కన్నాకువోలె.

అరవిరిమల్లె మొగ్గ తడియారని క్రొమ్ముడినందగింపగా
నరయుము పూజసేయు తులసమ్మకదే తెనుగింటికోడ; లే
త్తైరపరిచర్య నిన్నతిథి దేవునిగొల్చెడు కొంచమోగు; మ
చ్చొరయ నుగాది పచ్చిపులుసుల్ రుచిచూచెదుగాని మన్మథా!

ప్రానుకుమీ నియంతృపరిపాలన మించుకమాపయిన్; ప్రజా
స్వామికమే సమాదృతము స్వామిశరత్ప్రభు! దుర్జనక్రియా
గామివిగాక, ఏకరవుకాటకముల్ గొనిరాక మానవ
క్షేమమె మానసమ్మునభజింపుము, నింపుముకీర్తిసంపదన్
కడపిలివిన్ని నాళ్లు కలకంఠము విప్పక మూగనోములం
బడలుచు; నేటికిం దపముపండిన- దామని రేడు వచ్చె; నిం
పడరగ కెంజిపుళ్ళమొలమావుల తావులనాటకూట మే
ర్పడగ నుగాదిపాటలిక పాడుమురా! పికరాజవల్లభా!
సామంతు లారుఋతువులు సీమంతము లడుగు లొరయసేవింపగ మా
సీమల వరాలమానిక స్వామీ! కొలిపింపు పంటబంగారమ్ముల్!

# మాయదారి చిత్రాలు!

జర్మను కథానిక

రచయిత:
స్టీఫాన్ చ్వాయిగ్

అనువాదకుడు:
డాక్టరు వి. ఎస్. శర్మ

ఈ కథ శోభాయమానంగా చిత్రించిన రచయిత స్టీఫాన్ చ్వాయిగ్ (*Stefan Zweig*) 1881 సంవత్సరంలో వియన్నానగరంలో జన్మించాడు. వియన్నానగరం సాహిత్యనికేతనం. కళానిలయం. చిన్ననాటినుంచి చ్వాయిగ్‌కు ఈ వాతావరణం బాగా అలవడ్డది. ఇతడు తన నివాసస్థలాన్నీ, తన మాతృదేశాన్నీ, అందల్ని కళాపీఠుల్నీ విశ్వదృష్టితో చూచి ధన్యుడయ్యాడు. రోమారోలా ఆప్తమిత్రుడు. అంతే వాసి. ప్రపంచంలోని కళావేత్తలతో పరిచయ భాగ్యంకూడా లభించింది. చిన్ననాటి నుంచీ సాహిత్యసేవ ప్రారంభించి, ఎన్నో కథలు, నవలలు, నాటకాలు, చరిత్రలు రచియించి జర్మను సాహిత్యరంగంలో నూతన మార్గాలు సృష్టించాడు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ప్రజాకోటి ఎదుర్కొంటూ వస్తూన్న ఘట్టాలే ఈయన తన రచనల కుపయోగించాడు. హిట్లరు ఆస్ట్రియా మీద దాడి వెడలినంతవరకు, చ్వాయిగ్ ఆస్ట్రియాలోనే నిర్విఘ్నంగా తన రచనలు కొనసాగించాడు. హిట్లరు మూలకంగా ఆ చిన్న దేశం తారుమారయ్యాక 1938 లో మాతృదేశం వదలిపెట్టి కొంతకాలం స్విడ్జరులాండ్‌లో నివసించాడు. తరువాత అచ్చటి వాతావరణం తన మనశ్శాంతికి అనుకూలపడనందున, మెక్సికో దేశానికి వలసపోయాడు. అక్కడే 1942 లో మరణించాడు. సమ ఈయన వ్రాసిన రచనలకు ఈకథ మచ్చుతునకగా ఆంధ్రపాఠక లోకానికి ర్పించుకొంటున్నాను.

డ్రెస్ డెన్ నగరంవైపు వెళ్లుతున్న రైలుబండి దోవలో ఒక చిన్న స్టేషను దగ్గర నిలిచింది. బండి ఆగిందో లేదో ఒకాయన ఏదో పుట్టి మునిగి పోతున్నట్లు, మా పెట్టెతలుపులుఅమాంతంగా తెరిచి లోనికి గబగబ వచ్చాడు. నా ప్రక్కనే ఖాళీగా నున్న స్థలంలో కూర్చున్నాడు. ఎంతో పరిచయం ఉన్నవాడివలె, నా వంకే చూస్తూ మందహాసం చేశాడు. ఆయన వయస్సులో నా కన్న పెద్దవాడు. ఆయన వైఖరి చూస్తే పెద్ద వర్తకుడుగా వున్నాడు. వర్తకులు సామాన్యంగా మితభాషులు. కొట్టుసరి మనుష్యులు. కానీ ఈయనో?...ఆలా మందహాసంచేస్తూ వూరకున్నాడా మరి? నాతోనే కబుర్లు చెప్పడానికి ఆరంభించాడు. ఈయన ఎవరైవుండాలి? ఇంత చనువుగా మాట్లాడుతున్నాడే? ఇదే నా సందేహం. ఆ సందేహమే నన్ను పీల్చి పిప్పిచేస్తున్నది!...ఆయనవంకే నేనూ చూస్తూ స్తంభించి పోయాను. నా యీ అయోమయావస్థ ఆయనే గుర్తించాడు కాబోలు! చిరునవ్వు నవ్వుతూ తన పేరు చెప్పేశాడు...మా ప్రాంతాల్లో ఈ పేరు విననివా రున్నారా మరి? మామూలు వ్యాపారాల్లో

నిమగ్నులై వున్న వారి సంగతి అయితే మరచి పోవచ్చు. కాని యీయన చేసే వ్యాపారం సామాన్య మయిందా మరి?

శిల్పకళావేత్త. ప్రాతచిత్రాల రహస్యం ఈయనకు బాగా తెలుసు. శిల్పకళల్లో అభిరుచి గల వారు ఈయనసలహాలు తీసుకోక ఏపనీ చేయరు. సామాన్యులకు లభించజాలని ప్రాత చిత్రాలు ఈయన అవలీలగా సంపాదిస్తాడు. వాటికి ఇయ్యవ లసిన మూల్యంవిషయాన ఏమాత్రం వెనుదీసేమనిషి కాడు. ఈయన ఈసందర్భాన నడిపే కార్యాలయం బర్లిన్‌నగరంలోవున్నా, దానిశాఖలు చిత్రకళలకు మూలస్థానాలైన ప్రతినగరంలో వున్నాయి. మ్యూజి యాలు ఈయనతో సంప్రదించక చిత్రాలు కొనవు. విశ్వవిద్యాలయాల్లో పండితులకూ, విద్యార్థులకు ఈయన అంటే ఎంతో మర్యాద. తాను కొత్తగా సేకరించిన చిత్రాలు వారికి చూపాలి. అందలి కళాసౌందర్యాన్ని వారికి వర్ణించి తీరాలి. ఆ పని చేయకపోయాడా ఆయనకు మనశ్శాంతి యెలా వుంటుంది మరి?...

యుద్ధం వచ్చింది. చేయాలసిన రభసనంతా చేసి జీవాన్ని తారుమారుచేసింది. దాంతో ఆయన వ్యాపారం పెద్ద దెబ్బ తిన్నది. ఈ సంగతే ఆయన చెప్పడానికి మొదలు పెట్టాడు.

"నే నిప్పుడు ఇంత గాభరాగా ఎక్కడినుండి వస్తున్నానో మీకు చెప్పాలి. అలా చెప్పకపోతినా దీన్నంతా ఏలా మరచిపోగల్గుతాను మరి?.........

...ఇన్నాళ్ళనుండి, ముప్పయి అయిదేండ్లనుండి ఈపనిలో ఎన్నో ఎగుడుదిగుళ్ళు దాటుతూ వచ్చాను. కాని ఈరోజున నే నెదుర్కొ పలసివచ్చిన దుర్భరావస్థ నా జన్మలో ఇంత వరకూ ఎప్పుడూ చూచినవాడిని కాను. శిల్పకళ అసమాన్యమైంది. అందులో వ్యాపారం చేసేవారి అవస్థ ఇక చెప్పాలా మరి? ఆ కళ ఈలోకానికి సంబంధించింది కాదు. ఈ రహస్యాన్ని అర్థం చేసు కోడానికి ఈలోకాన్ని కొంతకాలం పూర్తిగా మరచి పోవాలి. దాన్నే మనం తెలుసుకొన్నామా, శిల్పి సృష్టించే ప్రతి వస్తువూ అమూల్యం. దాన్ని సేకరించ డానికి ఎంత ధనం వ్యయం చేయాలసివచ్చినా— ఆవిషయంలో మనమేమాత్రం వెనుకంజ వేస్తామా?

కాని చిత్ర ధనం సంపాదించుకొన్నవారూ ఈ రహస్యాన్నే గ్రహించాలి. ఆ భాగ్యాన్ని సంపాదించు కొన్నారా, ఆ వస్తువును సృష్టించిన చిత్రకారుని కళ చిరస్థాయిగా నిలువబెట్టుకోగల్గుతారు... కాని యీ యుద్ధంమూలంగా ఆ కళ నశించిపోతున్నది. దాన్ని సృష్టించిన కళోపాసకుల పేరుప్రతిష్ఠలు నిర్మూలమై పోతున్నాయి. ఇప్పుడు క్రొత్తరకపు కోటీశ్వర్లు బయలుదేరుతున్నారు. చేతినిండా ధనం. వీరికి దాన్ని సద్వినియోగం చేసే సామర్థ్యం బొత్తుగా లేదు. వాళ్ళకు చిత్రాలు సంపాదించి తామూ రసికుల మనిపించుకోడానికి శ్రద్ధ ఎక్కువైపోతున్నది. దాంతో వాళ్లు చేసే ఆట్టహాసం ఇక చెప్పాలా?... ఒక చిత్రాలేనా మరి? పూర్వకాలంలో పెద్దలు సొంతంగా వ్రాసుకొన్న పుస్తకాలు కావాలి. ప్రాత శిల్పాలు కావాలి. తివాసీలు కావాలి. ఆ కాలంలో మనవారు ధరించే దుస్తులూ, ఆభరణాలూ కావాలి. అప్పటి గృహాల్లో అమర్చబడ్డ మేజాలూ, కుర్చీలూ, బల్లలూ వగైరాలు కావాలి...భాగ్యవంతులు ఈ యుద్ధపిశాచం వాతవల్ల గర్భదరిద్రులయ్యారు. ఫలాని చోట, ఫలాని ఇంట్లో అమూల్య వస్తువు వుంది అని తెలుసుకొన్నారా ఇక మనశ్శాంతి వుంటుందా ఈ ఘటాలకు? సామదాన భేదాదులతో ఆ ఇండ్లు ఖాళీ చేయాలి. వాటిని తమ గృహాల్లోకి తెచ్చుకోవాలి... అంతేనా మరి? ఆ తెచ్చుకొన్న వస్తువులు ఆ పూర్వకాలం పంథాల్లో నే ఆ గదిలో ఈ గదిలో, ఆ మన్యహాలులో చక్కగా అమర్చాలి. తమ బంధుమిత్రాదుల్ని విందులకు పిలవాలి. వాటిని వారికి చూపెట్టి తమ రసికత్వాన్ని వారి ముందర ప్రకటించాలి....ఈ పనికి డబ్బు ఖర్చుపెట్టడానికి వెను కంజ వేస్తారా మరి? అడిగిన సొమ్ము అప్పుడే ఇచ్చి వేస్తారు. అసలుదార్లు వీటిని సేకరించడానికి ఎంత త్యాగం చేయాలసివచ్చిందో వీళ్లకేం తెలుసు? ఈ విషమావస్థలో, పాపం, వారు సంసారాన్ని యీడ డానికి అష్టకష్టాలు పడుతున్నారు. దీన్నే పూర్తిగా దీసుకొని యీ క్రొత్తరసికులు వారిముందర చేసే తాండవాలు చూస్తే నాగుండెలు గభిలున పగిలిపో తాయి. వారికి వీటి విలువ తెలిస్తే కదూ? ఇచ్చిన దాంతోనే తృప్తిపడిపోతారు. ఆలా తృప్తిపడక పోతేనా వారెలా జీవించగల్గుతారు, పాపం?......

* * *

ఈ సంగతి మీకు చెప్పుతూ విసికించడం నాకూ ఇష్టంలేదు. కాని యీ రహస్య ఇతర్లకు చెప్పకపోతే ఈ భారం ఎలా తగ్గుతుంది? మిమ్మల్ని చూచాక,—మీరు ఎవరో తెలియకపోయినా— ఇంత సాహసం చేశాను. దానికి నన్ను క్షమించాలి. అప్పుడే నా గుండె కుదుటపడుతుంది...ఆ కాలంలో ఈ రత్నాలు తయారుచేయడానికి వారు ఎంతో కష్టపడివుండాలి. ఒక వస్తువును తీసుకోండి. అది చూడడానికి చిన్నదిగానే కనబడుతుంది. కాని దాన్ని సృష్టించడానికి ఎంతకాలాన్ని వినియోగించారో? ఒక తరంలో అది పూర్తిఅవుతుందా మరి? శ్రద్ధాభక్తుల్తో తండ్రి ప్రారంభించినదాన్ని కొడుకు కొంత పూర్తిచేస్తాడు. మనమడు, మునిమనమడు ఆ పనిలోనే తదేకదృష్టితో నిమగ్నులై పూర్తిచేసి ధన్యులవుతారు. అంతేనా? ఆ పనులు నిర్విఘ్నంగా కొనసాగించడానికి ధనాన్ని వాంఛించరు. కీర్తి ప్రతిష్ఠలు కోరరు. ఆ కళను నిలవబెట్టడం, తద్వారా వంశమర్యాదను నిలుపుకోవడం తప్ప మరే భావాలు వారికుండవు. ఈ విద్య ఈశ్వరప్రసాదం. తాము పెద్దలనుండి నేర్చుకొన్న కళా నైపుణ్యాన్ని, తాము చిత్రించే చిత్రాల్లో, చెక్కేశిల్పాల్లో, నేసే బట్టల్లో, చేసే కలపసామాన్లో చూపాలి. వాటిని భగవానుని పాదపద్మాలకు సమర్పించాలి. వారి ప్రపంచమే వేరు. వాటిని వుపయోగించుకొన్నవారి లోకమే వేరు......ఇదే వారి తాపత్రయం. వారి ధ్యానమూ ఇదే. ఆ దివ్యశక్తిప్రసాదంవల్లే మనం కలల్లోకూడా కనివినని చిత్రాలు అనేకకోవల్లో సృష్టించి ధన్యులయ్యారు. కళారాధకులు ఇట్టి చిత్రకారులకు శాయశక్తులాతోడ్పడి ఈ కళాలక్ష్మిని అహోరాత్రాలు సేవించారు. వాటిని చిరస్థాయిగా నిలువబెట్టడానికి తమ సర్వస్వాన్ని సమర్పించారు...అది ఆకాలం. ఇక ఈకాలపు పెద్దల మనోభావాలో? చిత్రాలు ప్రశాంతంగాచూచి ఆనందించడానికి వారికి వ్యవధి వుంటుందా మరి? ఐవిసునగరంలో పూర్వకాలాన శిల్పి సృష్టించిన పుష్పాలతొట్టి చూచారనుకోండి! దాన్నిచూచాక వారి బుర్రల్లో తట్టే ఆలోచన-దీనివెల యెంతవుంటుంది? దీన్ని సేకరించి తమ ఇంట్లోకి తెచ్చుకొంటే ఘరానాగా ఉంటుంది... అవసరమైతే రెట్టింపువెలకు దాన్ని సంపాదించుకోవాలి....ఆదేశంలోనే మరో చిత్రకారుడు, జీవాత్మ ఇహలోకంపడే అష్టకష్టాలు కండ్లకద్దినట్లు చూపుతూ, పరలోకాన్ని చేరడానికి పడే తాపత్రయాన్ని శోభాయమానంగా చిత్రించాడు. ఆ పని పూర్తిచేయడానికి ఎంతకాలం ఈయన తన జీవితాన్నే సమర్పించాడో మనకేం తెలుస్తుంది మరి?... మనవారు దాన్ని చూడడానికి అవకాశం దొరికిందా, ఏ వందకో, వేయికో ఆ చిత్రాన్ని సంపాదించుకోడానికి భగీరథప్రయత్నాలు చేస్తారు. ఇదే, ఇదే ఈకాలపు లక్ష్మీపుత్రుల జీవితమార్గం! ఈ భాగ్యవంతుల ఆశాపిశాచాన్ని ప్రతిఘటించడానికి మనకు ధైర్యంవుందా? మన సమాజధైర్యం, సాహసం ఈ యుద్ధం మూలకంగా గొడ్డుపోయింది.

* * * *

ఇట్టి పంథాలోవున్న ఒకాయన కొన్ని ప్రాత చిత్రాలు సంపాదించిపెట్టాలని నన్నెంతో ప్రాధేయపడ్డాడు. దానిమూలకంగా నాకూ చేతినిండా సొమ్ము లభిస్తుంది. ఈ పని చేయడం సబబా అనే ప్రశ్న నన్నెంతో బాధించింది. దాన్నే దక్కబెట్టకవుంటేనో? మా సంస్థ భవిష్యత్తు మన్నుపాలయిపోతుంది. మా తాత ఈ సంస్థ ప్రారంభించాడు. ఆయన పోయాక మా నాన్నపై దాని పెత్తనమంతా పడిపోయింది. ఆయనా దాన్ని ఎంతో చాకచక్యంతో నడుపుకొనివచ్చాడు......ఇప్పుడాబాధ్యత నామీదికి వచ్చింది. దీన్ని ఈ ఉదారభావాల్తో వదులుకొంటినా...అసలే నిరుద్యోగ సమస్యతో తేలుకోజాలకవున్న ఈ దేశంలో దేశదిమ్మరిగా తిరగాలసిందే. మరో తరుణోపాయం వుంటేకదూ?

ఈ విషమావస్థలో పడిపోయాను. మా నాన్న, మా తాతలకాలంలో వారి సంస్థ ఏలా నడిపారో తెలుసుకోవాలని ఉబలాటం ఎక్కువైంది. ఒకనాడు ప్రాత రికార్డులు చూడడానికి మొదలుపెట్టాను. వాటిలో వారు ఎంతో జాగరూకతతో తయారుచేసి వుంచిన మా ఖాతాదార్ల పేర్లు చదివాను. ఆ జాబితా చాలా పెద్దది. వీరిలో కొందరు తమదగ్గరవున్న అమూల్యమైన విగ్రహాలు, చిత్రాలు మాకు అమ్మారు. మరికొందరు—వీరిజాబితా అంతచిన్నదా మరి?—మాదగ్గర నుంచి ఎన్నో వస్తువుల్ని కొన్నారు. ఇప్పుడెక్కడ వున్నారు? ఆ సంజాయిషీ యీ కాలంలో సంపాదించడం అంత సులభసాధ్య మనుకొన్నారా మరి?

యుద్ధం ప్రారంభం కాకముందే భాగ్యలక్ష్మి మనదేశం నుండి అదృశ్యరాలవడానికి కార్యకలాపాలు ప్రారంభించింది. యుద్ధం రానేవచ్చింది. ఆ పెనుభూతం ఇంత త్వరలోనే ఈ లోకంలో ప్రత్యక్షమై ఈ తాండవాన్నంతా చేస్తుందని ఎవరు అనుకున్నారు మరి? దాని మూలకంగా ప్రజాకోటి పడ్డబాధ ఇంతింతని చెప్పాలా? బీదసాదలు హతమయ్యారు. మధ్యతరగతివారు నామావశిష్టమయ్యారు. ప్రాతరోజులే తలంచుకొంటూ వున్న భాగ్యవంతులూ ఆ దోవనే వెళ్లారు. అట్టి స్థితిలో మా ఖాతాదారుల క్లిష్టావస్థ ఇక తలంచుకొంటేనా? కొందరు కాలంచేశారు. మరి కొందరు ఇతర గ్రామాలకు ఇతరదేశాలకు వలసపోయారు. ఇక మిగిలినవారి సంగతి తలచుకొంటేనా? ఈ కష్టకాలంలో జీవితరథాన్ని నడుపుకోడానికి అష్టకష్టాలు పడుతూవుండాలి...వీరందరూ సుదినాలు, దివ్యతేజోకాంతులు తిరిగి చిరా చూస్తూన్నప్పుడు మాకు ఎన్నో వుత్తరాలు వ్రాసేవారు. ఆ వుత్తరాల కట్టలు ఎన్నో మా బీరువాల్లో భద్రం చేయబడి వున్నాయి. వాటిని ఈ మధ్యచూచే అదృష్టం నాకు లభించింది. ఒకవుత్తరం నా దృష్టి నాకర్షించింది. దీన్ని వ్రాసిన ఆయన ఈసంప్రదాయ పరంపరల్లో పుట్టి పెరిగిన ఆయనే. అరవైయేండ్లనుంచి ఈయనతో మా తాత, మానాన్నా వుత్తరప్రత్యుత్తరాలు జరుపుకొన్నారు. ఆయన మనోవాంఛలు మావారు నిర్విఘ్నంగా కొనసాగించారు. ఆయనకుగాను సేకరించిన చిత్రాలు తలంచుకొంటేనా?... అన్నీ అమూల్య రత్నాలు. చిత్ర రచనంటే చెవికోసుకొనే వాడు. ఒక పురాతనచిత్రానికేనా? మధ్యయుగాల్లో పేరు ప్రఖ్యాతులు గాంచిన చిత్రకారుల చిత్రాలు ఎన్నింటినో ఆయనకు ఆ రోజుల్లో సంపాదించి యిచ్చాం...యుద్ధం ప్రారంభమయ్యేవరకూ, మా నాయన కాలగతుడైయినా, మమ్మల్ని మరచిపోయిన వాడు కాదు. నా పెత్తనంలో కూడా ఆ ఆర్డరు, ఈ ఆర్డరు ఇస్తూ మాకు చేతులనిండా పని కల్పించాడు. కాని యుద్ధం ఆరంభమయ్యాక ఆయన దగ్గర నుండి వుత్తరాలు రావడంలేదు. అంచేత నా బాదర బందిలో చాలాకాలం ఆయన సంగతే పూర్తిగా మరచిపోయాను...ఈ కాలంవారివలె వుత్తరాలు ఇతర్లచేత వ్రాయించి సంతకంపెట్టే మనిషికాదు. ఆయన దస్తూరీ ముత్యాలకోవ...తనకు కావలసినవి ఫలాని ఫలాని చిత్రాలనీ, వాటిని చిత్రించినవారు ఎవరో, వాటిలో ఏవి నాణ్యమైనవో...ఎన్నో వివరాలు వ్రాసేవాడు. ఈయన వ్రాసిన ప్రతి వుత్తరం చాలా పెద్దది. దాన్ని చదవటంలో,—మా పని తొందర్లో—తనకు కావాలిసిన వస్తువులు మరచిపోతామనే భావంతో కాబోలు వుత్తరం చివరలో, తిరిగీ తన జాబితా ఇచ్చేవాడు. వాటి వివరాలు ఫలాని పుటలో, ఫలాని పంక్తిలో చూడమని ఎర్రగీతల్తో సూచించేవాడు. ఆకాలపు మనుషులకు వుత్తరాలు వ్రాయడంలో వోపిక చూస్తే మనమే స్తంభించిపోతాం. వుత్తరాన్ని పూర్తిచేశాక పూరికే సంతకంతో ముగించే ఘటమా ఇది? తన సంతకం క్రింద తన డిగ్రీలు, బిరుదులూ...అంతేనా తన వుద్యోగపు హోదా వగైరాలు స్పష్టంగా వ్రాసేవాడు......ఈయన మిలిటరీ శాఖలో పెద్దవుద్యోగి. ఆ వృత్తి రీత్యా ఎన్నో దేశాలు చూచివుంటాడు. నగరాల్లోని చిత్రప్రదర్శనశాలలు నిరంతరంగా దర్శించివుంటాడు. ఆయనకు రంగుల చిత్రాలకన్నా, చిత్రకారులు వాటిని చిత్రించేముందు వ్రాసే చిత్తురూపాలంటే ఎంతో ప్రాణం. చిత్రకారుని కళానైపుణ్యమంతా ఇట్టి చిత్తు ప్రతుల్లోనే బాగా చూడవచ్చును. వీటిని అర్థంచేసుకోడానికి చిత్రకళ అంటే ఏమిటో, దాన్ని సృష్టించడానికి చిత్రకారుడు చేస్తూవుండే కార్యకలాపాన్నంతా ఆ మూలాగ్రంగా తెలుసుకోవాలి. ఇట్టి పంథాల్లోనే ప్రఖ్యాత కళోపాసకులు చెక్కే తామ్రచిత్ర ఫలకాలూ వుంటాయి. చిత్రకారుడే వీటిని ఎంతో చాకచక్యంతో కాగితాలమీద ముద్రించుతాడు. మచ్చు ఒకటే అయినా, కాగితంమీదికి వచ్చేటప్పటికి రూపం మారిపోతూ వుంటుంది. ఒక కాగితానికన్నా మరో కాగితం మేలు. (దీన్నే ఇంగ్లీషులో చిత్రకారులు ఎచ్చింగ్ అంటారు). ఆ రహస్యాన్ని గుర్తించడానికి కళాసాధన సంపత్తి యెంతోవుండాలి. దీన్ని తెలుసుకొన్నవారికి ఇట్టి చిత్రాలంటే యెంతో ఇష్టం. అట్టివారు మనదేశంలో కొద్దిమందే. వారూ నిరంతరంగా చిత్రశాలలు దర్శించాలి. అప్పుడే వాటి మూల్యం వారికి బాగా అర్థమవుతుంది...ఇతర కళోపాసకుల రుచి ఇట్టివాటిమీదకు పోదు. ఇంద్రజాలంవలె కండ్లకు విభ్రాంతి కలిగించే రంగు

చిత్రాలే వీటికి కావలసింది. మానవులరుచి పలు పోకల్లో పోతూవుంటుంది ... ఈ చిత్తు చిత్రాలు, కాగితాలమీద చిత్రకారుడే స్వయంగా దిద్దిపెట్టిన చిత్రాలు సామాన్యంగా లభిస్తాయా? అథవా అవే లభించాయా, రంగుచిత్రాలకన్నా ఎక్కువ ధనాన్ని ఖర్చుపెట్టితేనేగాని వాటిని కొనడానికి అవకాశం వుండదు. ఈయన ఈ అరవైయేండ్లలో తను ఆర్జించిన సంపాదనంతా ఇట్టివాటికే సమర్పించాడు. వీటిలో చాలాభాగం మా మూలకంగానే సేకరించుకొన్నాడు. అంతేనా మరి? ఏ నగరంలోనో ఇట్టివి లానికివచ్చాయని తెలుసుకొన్నాడా, ఈయన్ని ఆ వేలంకార్యాలయంలోనే చూడవచ్చు. వేలంలో పాట ప్రారంభించేది ఈయనే. తనను కొన్న మొత్తానికన్నా హెచ్చుగాపోయినా, ఏమాత్రం జంకేవాడుకాదు. ఆ మొత్తాన్నే ఇచ్చి పాటన్నీ తనపక్షానికే కొట్టివేయించుకొనేవాడు. ఆరోజుల్లో ఆయనవల్ల లాభంపొందినసంస్థలూ, వ్యక్తులూ ఎంతోమంది వుండేవారు. ...

యుద్ధంవచ్చాక ఆయన ఈపనిమీద అంత వుత్సాహం చూపెట్టినట్లు కనబడడంలేదు. బహుశః ఆయనకు దుర్దినాలు దాపరించి వుంటాయి. ఫింఛను పుచ్చుకొని ఏవూళ్లోనో అజ్ఞాతవాసాన వుండివుండవచ్చు... లేదా ఆయనసేకరించిన అమూల్యరత్నాలు మరొకరు కబళించి వుండవచ్చు. లేదా ఆయనవలె, అవీ కాలవాహినిలోపడిపోయినామావశిష్టాలైవుండాలి....

* * * *

ఈయన మాకు వ్రాసిన వుత్తరాలు పూర్తిగా చదివేశాక......ఇక నాకు ఆయన ప్రస్తుత పరిస్థితులు తెలుసుకోవాలని వుబలాటం ఎక్కువైపోయింది. ఇట్టి వుబలాటం కలిగిందా దాన్ని కట్టడానికి పగ్గాలు ఎన్నివున్నా లాభమేం మరి? కార్యకలాపాన్ని వెంటనే ప్రారంభించకపోతే ప్రశాంతంగా వుండే ఘటమా నాదీ...ఆయన వ్రాసిన వుత్తరాల్లోవున్న విలాసానికే వెంటనే బయలుదేరాను. ఆయన అప్పుడువున్న వూరు అంత పెద్దపట్నం కాదు. గ్రామంకాదు. సామాన్యమైన ఒక పట్నం. అక్కడికే వెళ్లి కనుగొంటే ఆ విషయం బాగా తెలుస్తుంది......రైలుబండినుంచి దిగానో లేదో, తిన్నగా ఆ వూరి పెద్దబజారులోకే వచ్చాను. వీధి చూడడానికి కన్నుల పండువగానేవుంది. రోడ్డుకు ఇరుప్రక్కలా చెట్లు. పెద్దచెట్లు. అన్ని వాతావరణాల్లోను చక్కని నీడనిచ్చే శ్యామలాలు. వాటివెనకనే దాగిపోయి, ఆ ప్రశాంతతనే తనివితీర తృప్తిలో ఆనందించే భవనాలు. ఇక ఆమార్గంలో నడిచేవారి ప్రశాంతత చూస్తూవుంటే—ఇట్టి దృశ్యాల్ని శోభయమానంగా చిత్రించిన రెంబ్రాంట్, డ్యూరర్, మాంటెగ్న చిత్రకారుల పట్టణాల చిత్రాలు జ్ఞాపకానికి వచ్చాయి. ఆధునిక నాగరికతా ప్రవాహం దేశం మీదికివచ్చి మన జీవితపంథాలే తారుమారుచేస్తున్నా ఈ పట్నం మీదికి మాత్రం ఇంతవరకు రాలేదు. ఈ మనుష్యులు నిజంగా అదృష్టవంతులు. వారి నివాస స్థలాలు ఎంతో పుణ్యం చేసుకొనివుండాలి...

తిన్నగా నడిచి, నడిచి వూరిమధ్యలో వున్న పోస్టాఫీసుకు చేరుకొన్నాను. అక్కడివారిని ఆయన భోగట్టా అడిగాను. ఇక్కడే వున్నాడట. ఫలాని వీధిలో, ఫలాని సంఖ్య ఇంట్లో ఆయన వున్నాడని తెలుసుకొన్నాక నా వుత్సాహాన్ని, ఆనందాన్ని పట్టి బంధించడానికి పగ్గాలు అవసరమా మరి?......మనస్సు స్తిమితపడ్డది. పూర్తిగా స్తిమితపడ్డది. అదే చాలు. ఇక దక్కబెట్టుకోవాలసిన కార్యకలాపం విషయాన అంత వుద్రేకం వుండకూడదు. కొంచెం తొందరపడ్డానా నా అన్వేషణ మన్నుపాలయిపోతుంది......... అప్పటికి ఎంతో కాలేదు. పది గంటలే. ఆ వయస్సులో వున్నవారు ప్రాతఃకాలాన ఎక్కడికి వెళ్లరు. ఆయన తప్పక ఇంట్లోనే వుండవచ్చు.

* * * *

ఆయన ఇల్లు కనుగోవడం అంతకష్టంగా కన్పించలేదు. చాలా పాతఇల్లు. బహుశా దీన్ని అరవై డెబ్బయి ఏండ్లక్రిందట యజమానే తన కాలంనాటి సాంప్రదాయాల ననుసరించి ప్లాను తయారుచేసి, కట్టించి వుండాలి. ఆయన కాపురం చేసేది రెండో అంతస్థులో. క్రిందిభాగంలో మరొకాయన బసచేస్తున్నాడు. మెట్లు గబగబ యెక్కి, మేడ మీదికి వచ్చాను. పోర్సిలిన్ పలకమీద ఆయన పేరు రాయబడివుంది. ఆ పాతపేరూ, ఆయన బిరుదాలు, నేను వుత్తరంలో చూచిన మాదిరే వుండడం చూచి, ఆయనే ఈయనై వుండాలని నిశ్చయం చేసుకొన్నాను. తలుపు తట్టాను. తట్టానో లేదో, ఆక్షణంలోనే ఒక ముసలావిడ తలుపు తెరిచింది. తెరిచిన

వెంట్రుకలు. నీలమేఘచ్ఛాయ దుస్తులు. తలమీద పూర్వకాలంవారు ధరించే టోపీ. నా విజిటింగ్ కార్డు ఆవిడకిచ్చి, ఆయన్ని చూడడానికి వచ్చానని చెప్పాను. ఆయన పేరు చెప్పగానే, ఆవిడ ఆశ్చర్యపడ్డది. నా కార్డువంక ఎగా దిగా చూచింది. అదా ఈ లోకంలో చిన్నవూరు. ఆ ఇంటికి పరాయి వాడు రావడం, అందు ముఖ్యంగా బెర్లిన్ నగరాన్నించి ఒక పాతచిత్రాలు విక్రయంచేసే కంపెనీ యజమానే స్వయంగా ఆ చిన్నవూరికి, తన ఇంటికి రావడం ఎందుకా అనుకొన్నది కాబోలు, కొంచెం సేపు మాట్లాడలేదు. ఆవిడ మనోభావాలేమో నాకేం తెలుసు మరి? నావంక మరొకసారి చూచి, మంద హాసం చేస్తూ, లోపలికి వెళ్లింది. ఏవో గుసగుసలు లోపలినుండి వినబడుతూనే వున్నాయి..కొంత సేపటికి ఒక ముసలాయన గొంతు చక్కగా వినవచ్చింది "బర్లిన్నుంచేనా వచ్చింది? ఆ పాతచిత్రాలు అమ్మే కంపెనీ మనిషా?....ఆయన్ని చూడడం నాకూ ఇష్టమే" అని ఆయనే అనివుండాలి....ఆవిడా గబ గబ నడిచి నా దగ్గిరికి వచ్చింది. లోనికి తీసుకొని వెళ్లింది.

ఆయన కూర్చున్న గది చిన్నదే. గోడమీద చిత్రపటాలు. బల్లా, కుర్చీలు, సోఫాలూ వగైరా పాతకాలం నాటివే. ఆయనిది పెద్దవిగ్రహం. పెద్ద గడ్డం. కుర్చీమీదే కూర్చున్నాడు. నేను ఆ గదిలో అడుగుపెట్టడం చూచి, చిరునవ్వు నవ్వాడు. మర్యాద చేయడానికి కాబోలు చేతులు జాచాడు. కుర్చీమీది నుండి లేవడు. వృద్ధుడు. నేనే తిన్నగా ఆయన దగ్గిర నిలుచుండి చేతులు గట్టిగా పట్టుకొని కుశల ప్రశ్నలు అడిగాను. చేతులు కదలవు. నన్ను గుర్తించాడో లేదో పాపం! ఈలా అపురూపమైన అతిథులు తన్ను చూడడానికి రావటం ఆయన కలలోనైనా తలంచాడు కాదు కాబోలు...ఆయన ముఖం తదేకదృష్టితో చూచేటప్పటికి, నా సందేహం అతి సులభంగానే నివారణైపోయింది...... ఆయన కబోది!

గుడ్డివాళ్లను చిన్నప్పటినుండి చూడడం నాకూ అలవాటు. వారిని చూస్తూవుంటే ఎంతో జాలి వేసేది. వాళ్ల ప్రపంచం వేరు. మన ప్రపంచం మరొకటి. ఆ ప్రపంచంలో వారేం చూస్తూవుంటారో, ఆ సంగతి తెలుసుకోవడం మనకు అంత సులభమా? ఇతర మనోభావాలు వారెలాగు అర్థం చేసుకొంటారో మరి? ఎప్పుడు అంధుల్ని చూడడానికి అవకాశం దొరికినా, ఇదే నన్ను బాధించే ప్రశ్న... తిరిగీ మరొక కబోదిని ప్రత్యక్షంగా చూస్తున్నాను!' ఆ కండ్లు కదలవు, మెదలవు...ఆలా వింతగా ఆయన కండ్లవంక చూడడం నాకే ఎంతో బాధగావుంది. అయినా నేను తన దగ్గిరకు రావడం, తన చేతులు గట్టిగా నొక్కడం, అభినందించడం తెలుసుకొన్నారు!

"మీరు నన్ను చూడడం నా అదృష్టం. బర్లిన్ నుండి ఎవరైనా వచ్చారా? ఇక నా సంతోషం చెప్పాలా? మీవంటివారు మా ఇంటికి రావడం, మా భాగ్యంకాక, దీన్ని మరేమని అనాలి ?...కాని మీరే స్వయంగా నన్ను చూడడానికి రావడం! ఏదో కారణం తప్పకవుండాలి. అదేమైవుంటుంది?...మన దేశం ఆర్థికంగా ఈ యుద్ధంవల్ల సన్నగిలిపోతున్నది. పెద్ద పెద్దవారే దారిద్ర్యంలో మునిగి తేలుతున్నారు. మీ వ్యాపారం పెద్ద దెబ్బతిన్నదనే అనుకొంటాను. ఈ రోజుల్లో పాతవస్తువులు కొంటానికి ఎవరికి శక్తివుంటుంది ? ధైర్యం వుంటుంది ?......కాని ఇంత సాహసం చేసి అంతదూరాన్నుంచి మీ పాతమనుషుల్ని చూడడానికి రావడం నాకూ ఆశ్చర్యంగా వుంది... ...ఇక్కడ మీ పని చక్కబెట్టుకోడానికి అదృష్టంలేదనిమాత్రం చెప్పాలి. వేమూ బీదల మయ్యాం. మాకు పెన్షనువస్తున్నా, ఈకాలపు విపరీతపు కరువులో అది ఏమాత్రం సహాయం పడడంలేదు. దాంతో ఇకముందు ఏలా జీవయాత్రను నడుపుకోగల్గుతామో మరి?...ఆ కాలం వేరు. ఈ కాలంలో మా అవస్థ చెప్పదలంచుకొంటేనా గుండెలు గబ్బిలుమని పోతాయి?...."ఇంకా ఏమో పాపం, ఆయన చెప్పదలచాడు. నోటినుండి మాట రావడంలేదు. ఆ దృశ్యాన్ని చూచేటప్పటికి నాకే చెప్పరానంత దుఃఖం వచ్చింది. ఆయన ఇంత గాభరాపడుతూ వుండటం నాకూ ఎంతో కష్టంగా వుంది. సామాన్లు విక్రయించడానికి రాలేదని, ఈప్రాంతాల్లో పనివుండి వచ్చానని, ఈవూరి మీదుగానే ప్రయాణంచేస్తూవుంటే, నా పాత ఖాతాదారుని క్షేమసమాచారాలు కనుక్కోడం నావిధ్యుక్తధర్మమనితలంచి ఆయన్ని చూచి వెళ్లడానికి వచ్చానని

అన్నాను. ఆ మాట వినేసరికి ఆయన మనస్సు స్థిమిత పడ్డది. ఆ అనారోగ్యమూ మాటుమాయ మైపోయిం దని ఇక వివరించాలా? ఆవిడ మా సంభాషణను వింటూ ఆయన వెనకనే నిలుచున్నది. చిరునవ్వు నవ్వుతూ "విన్నావు కాదూ ఆయన చెప్పేది?" అంటూ ఆవిడ వీపు తట్టాడు......

"నన్ను ఈ కష్టకాలంలో జ్ఞాపకం వుంచుకొని మా ఇంటికి రావడం చూస్తే పాతరోజులు ఎలా మరిచిపోగల్గుతాను?"

వీటి మూలకంగా కొన్ని వస్తువులే ఈ కాలంలో కూడా ఎంత మనశ్శాంతి ప్రసాదించుకున్నానో చెప్పడం అనవసరం. అరవై ఏండ్లకాలంలో వీటిని సంపాదించుకొన్నాను. వీటిని చూస్తూ ఆనందిం చుకూవుంటే ఇక మా దారిద్ర్యాన్ని గురించి తలం చటం ఎందుకు? ఇవే నా ప్రాణం. నా స్నేహితులు. వారే లేకపోయూరా, వీధుల్లో భిక్షాటనం చేస్తూ వుండాలసిందే? ...టాసీ, ఆ తాళపుచేతులు తీసు కొనిరా. గీరువాలు తెరిచి వాటినే ఈయనకు చూపెట్టాలి?" అని భార్యతో అన్నాడు.

ఆవిడ ఆయన చెప్పుతున్నదే వింటూ కదలక, మెదలక, అక్కడే నిలిచిపోయింది. కాని ఆ తాళపు సత్తిప్రస్తావన వచ్చేటప్పటికి పూర్తిగా మారి పోయింది. ఆయన కోరిన ఈ కోరిక చెల్లించడం ఇష్టం లేదు కాబోలు! ఆ వైఖరి చూస్తే ఈ సంగతిని తెలుసు కోడం అంత కష్టమైనపనా?...కాని కొంతసేపటికి చెవిలో ఏదో అంది. ఆవిడను ఏం అనుకొన్నదో కాని...ఆయన చేతులుతట్టుతూ.

"మధ్యాహ్నం భోజనంవేళఅయింది. ఇప్పుడు వాటిని చూడడమెందుకు? భోజనా లయ్యాక, విశ్రాంతి అవసరం. డాక్టరు అన్నమాట తెలుసు కాదూ? అలా కొంచెం విశ్రాంతి తీసుకోకపోతే, నీ ఆరోగ్యం ఏలా బాగుపడుతుంది? ఆ పని పూర్తి చేశాక, బీరువాలు తెరిచి వాటిని ఈయనకు చూ పెట్టవచ్చును. ఆయన ఆ పరిక్షివచ్చే టప్పటికి మనతో కలిసి కాఫీని పుచ్చుకోవచ్చును. అమ్మాయి అప్పటికి ఇంట్లోనే వుంటుంది. అది ఈపనికి సహాయపడు తుంది." అని ఒగ్గరగా అనడం నన్ను వుద్దేశించే అని చెప్పడం అనవసరం కాదూ మరి? నా వంక ఒకసారి చూచింది. "మధ్యాహ్నం మూడుగంటలకు తప్పక రావాలి. అప్పుడు ఆయన ఆ వస్తువులు చూపెడతాడు. వాటిని చూచి మీరు తప్పక సంతోషించగలరు" అని అన్నది.

ఆ ముసలాయన, పాపం, ఇంకేం జవాబీయ గల్గుతాడు? ఆవిడ చేతిలో ఆయన ఒక బొమ్మ! బొమ్మలు, వాటిని ఆడించేవారు ఆడే శంధాల్లోనే నడవాలి. ఆయన వొప్పుకున్నాడు. దాన్నేమాత్రం కనబడనీయకుండా, నిట్టూర్పును విడుస్తూ—

"మధ్యాహ్నం తప్పక రావాలి. మీ కాలం చాల అమూల్యమైవుంటుంది. కాని ఇంతదూరం నన్ను చూడడానికి వచ్చారు. వాటిని మీరు తప్పక చూడాలి. ఇరవైమూడు ఆల్బముల్లో వాటిని జాగ్రత్త పరిచాను. ఈ ఖండంలో పేరు ప్రసిద్ధిగాంచిన చిత్ర కారుల చిత్రాలన్నీ వాటిలో వున్నాయి. అవి ఈ కాలంలో దొరకడం కష్టసాధ్యం...మూడు గంటలకు తప్పక రావాలి. ఆలస్యంగా వచ్చారా, అన్నింటినీ ఇవ్వాళ చూడడానికి అవకాశం వుండదు మరి?" అంటూ చేతులు చాచాడు.

"మీకూ ఈ చిత్రాలు సంపాదించటంలో వున్న సాధకబాధకాలు బాగా తెలుసు. ఆ సంగతి నేను చెప్పడం అనవసరం. కాని ఇంత వోపికతో నన్ను జ్ఞప్తి వుంచుకొని ఇతర పనులు సర్దుకోకుం డానే వచ్చారు. మీరు వీటిని తప్పక చూడాలి. సరిగా మూడుగంటలకు వస్తారు కాదూ" అంటూ చెయ్యి గట్టిగా నొక్కాడు.

ఆయనదగ్గిర సెలవు పుచ్చుకొని వెలుపలికి వచ్చాను. ఆవిడా నావెంటే తలుపుదగ్గిరకు వచ్చింది. నన్ను మొదట చూచినప్పుడు ఆవిడ ఆశ్చర్య పడ్డది. ఆయన తన చిత్రపటాల్ని గురించి చెప్పు తున్నప్పుడు ఆ ముఖం విలవిల వాడిపోతున్నది. ఇదంతా భయంవల్లనా? కాకపోతే మరెందుకు? నేను పరాయివాణ్ణి. ఆవిడతో రాద్ధాంతం పెట్టు కోడం సవ్యంకాదు...తలుపు దగ్గిరకు వచ్చాక, నా దగ్గిర సెలవు పుచ్చుకొంటూ, తన ధోరణిలోనే "మా అమ్మాయి...మా అమ్మాయి మిమ్మల్ని కలుసుకోవచ్చు కాదూ?....అదే మిమ్మల్ని ఇక్కడికి పిలుచుకొని వస్తుంది. దానికీ కారణంవుంది.... అదంతా చెప్పి మిమ్మల్ని అనవసరంగా బాధ పెట్టాలి....మీరు హోటల్లోనే భోంచేస్తారు కాదూ?"

అని ఆవిడ అన్నది.

"తప్పక. ఆమె వచ్చి నన్ను కలుసుకొన్నంత వరకూ హోటల్లోనే వుంటాను." అని నేనూ జవాబిచ్చి అక్కడినుండి బయటపడ్డాను.

* * *

ఆ వూళ్లో వున్నది ఒక్కటే హోటలు. అక్కడికే తిన్నగా నడిచాను. భోజనం ఇంకా పూర్తి చేశానో లేదో, ఒక అమ్మాయి లోనికి ప్రవేశించింది వయస్సులో పెద్దపిల్లే. ఆ అమ్మాయి వేసుకొన్న దుస్తులు సామాన్యమైనవే. లోపలికి వచ్చాక గది నలువంకలా చూడడం మొదలు పెట్టింది. బహుశా ఈ అమ్మాయి నాకోసమే వచ్చి వుంటుందనుకొని, కుర్చీనుండి లేచి, ఆ అమ్మాయి నిలుచున్న స్థలంవంకకే వచ్చాను. నేను లేచి ఆ పిల్ల వంకకే రావడం ఆమె చూచింది. నేనెవరో ఆమెకు చెప్పాను. 'నన్ను చూచాక, ఈ అమ్మాయి కళలా పూర్తిగా మారిపోయాయి. ఏదో చెప్పదలచింది. ఇటూ అటూ చూచింది. చుట్టుప్రక్కలనున్నవారు తమ భోజనాల్లో నిమగ్నులైవుండటం బాగా చూచింది. అదురుత్తూ, బెదురుత్తూ వుండడం చూచాను. ముఖం వాడిపోతున్నది. ఎందుకోసంవచ్చింది ఈవైపుకి అకస్మాత్తుగా! లోపలికివస్తున్నప్పుడు ఎంతో చెట్టుగా, శాంతంగా వుంది. నేను పలకరించానో లేదో, అంతా మారిపోయింది. అయితేనేం, కొంచెం ధైర్యం తెచ్చుకొని—

"మాఅమ్మ మీ దగ్గిరికి పంపింది ... ఇంట్లో జరిగిందంతా చెప్పింది...మిమ్మల్ని ఒకటి కోరుకొంటున్నాం దీన్ని మీరు మా నాన్నను తిరిగి చూడడానికిముందే చెప్పుకోడం చాలా అవసరం. అలా అంటానికి సాహసించినందుకు మీరు మమ్మల్ని క్షమించాలి ... మానాన్న మీకు తను సంపాదించిన చిత్రాలన్నిటినీ చూపాలని ఆశపడుతున్నాడు ... ఇక ఆచిత్రాలసంగతో?...ఆయన ఉన్నవని అనుకొన్నవి ...చాలామట్టుకుపోయావి ... ఎంతో అమూల్యవస్తువులే..." అంటూ ఒక నిట్టూర్పు విడిచింది...ఏమనుకొన్నదో పాపం! ... అతక్షణంలోనే పిచ్చిధైర్యం వచ్చింది.

"మీకు ఉన్నసంగతంతా స్పష్టంగా చెప్పివేయడం మంచిదే!...ఇప్పటిపరిస్థితులు మీకూ బాగా తెలుసుకోదూ. అంచేత మమ్మల్ని అర్థంచేసుకొంటారనే తలుస్తాను. యుద్ధం ప్రారంభమైంది. వాటి విషవాయువులు జనాన్నందరినీ తారుమారుచేశాయి. మా నాన్న వాటిని కాగలేకపోయాడు. దాంతో అంధత్వం ఆయనావరించింది. అంతకుముందే కండ్లజబ్బుతో బాధపడేవాడు. యుద్ధంవచ్చిఅందర్నీ కలవరపెడుతుందని నాన్న కలలోకూడా అనుకొన్నవాడుకాదు. వృద్ధుడు. జబ్బుమనిషి. ఈ తారుమారుతో ఆయన జబ్బు ఎక్కువయింది. అహోరాత్రాలు ఇక విశ్రాంతి ఆయన కెలావుంటుంది. ఆ శాంఖుల రణఘోషధ్వని వింటూవుంటే నోడలు కంపించిపోయేది. ఆయన వయస్సులోవున్నవారందరూ ఈ పెనుభూతంవాతపడ్డారు...1870 లో యుద్ధం ఎలా జరిగిపోతున్నదో చూచాడు. అందులో పాల్గొనాలని వచ్చింది ఆయన మధ్యవయస్సులో వున్నప్పుడే. ఆ దెబ్బకే ఈకండ్లజబ్బు ప్రారంభమయింది. ఆకాలంలో ఆయనకున్న ఓపికతో, ఇది ఎవరికీ చెప్పినవాడుకాదు. అంతకు పూర్వం వేట అంటే పంచప్రాణాలూ లేచివచ్చేవి. ఆ కండ్లజబ్బు నయం చేసుకోలేదు. ఆయన చేసేపని మిలిటరీ వుద్యోగం. లెఫ్టినెంటు. తన పని దక్కబెట్టుకోడం,—తీరుబడివుంటే వేటకు వెళ్ళడం, లేదా షికారుకు వెళ్ళడం—ఇదే పింఛను పుచ్చుకొన్నంతవరకూ నాన్న దినచర్య...ఈ అంధత్వం ప్రాప్తమయ్యాక అన్నీ మాయమైపోయాయి. కాని ఇంతవరకూ, తను ఎంతో డబ్బు, నీళ్ళవలెమాస్తూ, ఏమాత్రం వెనుదీయక, కొన్న చిత్రాల్ని అనుదినం చూచుకోవడం—దాంతో తృప్తిపడడం... అంటే నాన్న వాటిని చక్కగా చూస్తున్నాడని కాదు. వాటిని కన్నులారచూచి ఆనందించే అదృష్టం వుంటే గదా!...బీరువాల్లోనుండి ఎంతో జాగ్రత్తతో తన కాలంలోనే బైండు చేయించుకొన్న చిత్రాలను—ఆ ఆల్బాల సంఖ్యను మీకు ఆయనే చెప్పాడుకాదు!—తీయడం వాటిని తాకటం,...ఫలాని ఆల్బంలో ఫలాని చిత్రాలు వున్నాయని తెలుసును. ఒక్కొక్క పుస్తకాన్ని ముట్టుకొన్నాడా, ఆ పుస్తకంలో తను భద్రంచేసిన చిత్రాలు ఇవి అవి అని కంఠస్థంగా వాటిని చెప్పివేస్తాడు...ఇతర పనులమీద ఆయనకేం ఆసక్తి వుండేదికాదు. వార్తాపత్రికల్లో పాత చిత్రాల్ని గురించి ఏదైనా వ్రాయబడివుంటే దాన్ని

చదవమంటాడు. ఆ చిత్రాల ధరల్ని గురించి పత్రికల్లో ప్రతిరోజూ ఈయబడే వివరాలన్నీ ఎంతో శ్రద్ధగా వినేవాడు. ఆయన కాలాన వీటికివున్న ధరలు వేరు. ఈ కాలపు ధరలు వేరు. ఈ కాలపు ధరలు మరో మార్గాన నడుస్తూ వున్నాయి...కాలం ఈలా మారిపోతున్నదనీ, విలువలూ కాలం వెంటనే నడుస్తున్నవనీ, ఆయన కేం తెలుసు...ఈ కాలంలో ఆర్థికంగా మేమూ పెద్ద దెబ్బ తిన్నాం. నాన్నకు వచ్చే పెన్షను ఆయన కాలంలో పెద్ద మొత్తంగా కన్పించినా, ఈ రోజుల్లో, రెండుమూడు రోజుల తిండికే చాలడంలేదు ... ఆపైన మా అక్కయ్య పెనిమిటి యుద్ధంలో పోయాడు. నలుగురు బిడ్డల పోషణ మామీదే పడ్డది ... ఆర్థికంగా మేం పడుతూవున్న అవకష్టాలు నాన్నకు బొత్తిగా తెలియవు. ఐశ్వర్యాల్లో తులతూగిన సంసారం మాది. అది పూర్వపు పంథాల్లోనే నడువుకోడానికి సాధ్యపడుతుందా మరి? ఇంటిఖర్చులన్నా తగ్గించుకోడానికి భగీరథ ప్రయత్నాలు చేశాం...అలా చేస్తూ వచ్చినా రథం నడవడంలేదు. ఆయన ప్రాణతుల్యంగా చూసుకొంటూ వున్న చిత్రాలు. మినహాయించి, ఇంట్లో వున్న తతిమ్మా అమూల్యవస్తువులు సంసారం ఈదడానికి గాను, అమ్ముకోవాలసిన దుస్థితికి రానేవచ్చాం ... ఇంట్లో సామానులన్నీ, క్రమేణ మటుమాయమై పోయాయి ... ఇక ముందు పొట్టబోసుకోడానికి సాధనోపాయం ఏముంది మరి? ...ఆలోచించాం .... ఆ!...ఆ!...ఆ!...అమ్మే ఆ సంగతి ఆలోచించక మరేంచేస్తుంది ఇక! దరిద్ర దేవత మమ్మల్ని, దయాదాక్షిణ్యాలు లేక, ఇలా రథన పెట్టుతూవుంటే...ఆయన చిత్రాలు అమ్ముకోడానికి ప్రారంభించాం...నాన్నకు తెలుస్తేనో?... ఆయనకు తెలియకుండానే ఈ రాక్షసకార్యాన్ని మా చేతులారా చేసుకోవాలసి వచ్చింది .... యుద్ధం ముగిసిపోతుంది. శాంతి వస్తుంది, పూర్వపు దినాలు తిరిగే వస్తాయి అని వుర్రూతలూగేవాళ్లం. యుద్ధం పూర్తిఅయిందికాని ఇక శాంతిదేవత వచ్చి ఈ లోకాన్ని తరింపచేస్తేకాదూ...అప్పటినుండి పత్రికలు చదివి, నాన్నకు వినిపించడం మానేశాం. ఆ దుర్భరావస్థ ఆయన వింటేనో...ప్రాణాలు తప్పక విడుస్తాడు" ఇలా ఆపిల్ల వారి దుర్భరావస్థను చెప్పతూవుంటే నావొళ్లు కంపించి పోతున్నది......

ఆ పిల్లని చూచేటప్పటికి ఎంతో జాలివేసింది. ఆ కథ ఎంతో కష్టంగా చెప్పసాగింది. మధ్య మధ్య ఈ పని చేయడంవల్ల ఆ ముసలాయన్నే మోసంచేస్తున్నామని కాబోలు గడగడ వణకసాగింది. కొంతసేపు ఆ పశ్చాత్తాపంవల్ల కాబోలు నోటినుండి మాట రానేలేదు. అయితేనేం, నేనూ వారిపట్ల సానుభూతి చూపెట్టుతున్నానని గ్రహించింది. తిరిగి తన కథ కొంత ధైర్యంతో చెప్పసాగింది.

"మా గండాలు అనుదినం మితిమీరిపోతున్నాయి—మా బాధ్యతలు అనుదినం హెచ్చిపోవటంవల్ల దిన ఖర్చులూ మించిపోతూనే వున్నాయని మీకు చెప్పటం అనవసరంకాదు. ఒకరోజున సంసారం ఈదుకోటానికి చాలా డబ్బుకావలసి వచ్చింది. దాన్ని ఏలా సమకూర్చాలి మరి ఈ అష్టకష్టాల్లో?—అమ్మకు ఒక ఆలోచన తట్టింది... ఇంట్లో రెంబ్రాన్ట్ చిత్రం వుంది. అది నాన్న కొనటానికి చాలా ధనాన్ని ఇచ్చివుంటాడు... చిత్రపటాలు అమ్మే ఆయనకు ఆ పటం చూపించాం. ఆయన దాన్ని చూచి ఆనందించి, పెద్ద మొత్తాన్ని ఇస్తానన్నాడు. ఆ మొత్తంతో నాలుగయిదేండ్లు సుఖంగా జీవయాత్ర జరుపుకోవచ్చు...ఆ కాలపు పరిస్థితులు మీకు బాగా తెలుసుకాదూ. డబ్బు విలువ ఒకరోజున తగ్గిపోతుంది. మరోరోజున పెరిగిపోతుంది......ఆ పటాన్ని అమ్మి, డబ్బు బ్యాంకులో దాచాం... రెండు నెలలు పూర్తిగా గడిచాయో లేదో...మా లెక్కలో సొమ్ములేదని బ్యాంకువారు చెప్పారు. ఇంకేం చెయ్యాలి మరి? మరికొన్ని విలువగల చిత్రాలు అమ్మటానికి ప్రారంభించాం. వర్తకులు సొమ్ము వెంటనే ఇస్తేకాదూ! డబ్బు విలువ మారిపోవటం వారికి బాగా తెలుసు. వారు అది ఇచ్చేనాటికి అసలు మొత్తంలో పాతికభాగమైనా మాచేతి కందిందికాదు ... ఇక వీరితో పేచీ పెట్టుకోటం లాభంలేదని మరికొన్ని చిత్రాలు వేలానికి పంపాం. వారూ చేయాలసిన మోసం చేశారు... అలా చేసినా లక్షలకొలది సొమ్ము మాచేతికి వచ్చింది. కాగితాలసొమ్ము. వాటివిలువ మాకు తెలిస్తేకాదూ? ఇంట్లో దాచాం. అంతే. వాటిని ఆ మొత్తానికి కొనే నాథుడు వుంటేకాదూ? ... ఈలాగే ఇంట్లో

అమూల్యవస్తువులన్నీ అనుదినం నడువపోగాయి... పాపం, నాన్నకు మేముచేసే దారుణకృత్యం తెలియదు........

అంచేతనే మీరు ఇవ్వాళ మాఇంటికి వచ్చినప్పుడు అమ్మ గాభరాపడ్డది...నాన్నే మీకు తాను ఎంతో జాగ్రత్తగా దాచివుంచిన చిత్రాలు చూపెడితే మేంచేసినమోసమంతా తెలిసిపోతుంది. ...ఆ బైండుచేసిన చిత్రాల పుస్తకాలు ఆయన అనుదినం చూస్తూ వుంటాడు. వాటిని కండ్లార చూచి ఆనందించే అదృష్టంలేదు. ఒక్కొక్క పుస్తకమే తీస్తాడు. చేతితో అటూ ఇటూ నొక్కి అది తనివితీర చూస్తున్నాననే అనుకొంటాడు. అసలు బొమ్మలు అందులోనుండి ఎప్పుడో అదృశ్యమైపోయాయి. వాటిస్థలాల్లో మేం మక్కికి మక్కిగా రాసివుంచిన కృత్రిమ చిత్రాలు మాత్రం వున్నాయి. ఆపుటలూ వున్నవివున్నట్లుగావున్నందున ఆయనా ఆ రహస్యాన్ని ఎన్నడూ గుర్తించినవాడుకాదు.........................మా ఇంటికి ఈ దుర్భిక్షదినాల్లో అతిథులు ఎలా వస్తారు? ప్రతివారికి వారివారి గండాలు తప్పుకోడానికే అవకాశంలేనప్పుడు మమ్మల్ని చూడడానికి ఎవరు వస్తారు మరి? ...ఈ వూళ్ళో ఇంతకాలంనుండి వున్నా, మాకూ వూళ్లోవారితో పరిచయంకూడా లేదు...చిత్రకళలో అభిరుచి వున్నవారికి ఈ చిత్రాలు చూపెట్టడానికి నాన్నకూ ఎంతో ఇష్టమే...కాని అట్టి అవకాశాన్ని ఆయనకు మేం ఇస్తే కాదూ?...ఎవరైనా వచ్చినా, ఏదో కబుర్లు చెప్పి పంపివేయడం తప్ప మరేం చేస్తాం ఈ విషమపరిస్థితుల్లో...

ఆయన అంధుడయ్యాక మీరే మా ఇంటికి ఈనాడు వచ్చిన పరాయి మనుష్యులు.....డ్రెస్ డెన్ నగరంలోని మ్యూజియం అధ్యక్షులు పూర్వం వచ్చేవారు. వారికి మాసంగతి బాగా తెలుసు. అంచేత ఆయన, నాన్నదగ్గిర కూర్చుండి కబుర్లు చెప్పుతుండే రోజుల్లో, ఈ మర్మాన్ని గుర్తించే, బొమ్మలు లేకపోయినా, ఉన్నట్టుగానే నటించుతూ, నాన్నను సంతోషపెట్టేవారు. ఆయనా ఈమధ్యనే కాలం చేశారు...ఆయన తర్వాత చిత్రకళలో అభిరుచి వున్నవారు మీరే మొదటివారు...అంచేతనే మిమ్మల్ని ఇంత ప్రాధేయపడాలిసి వచ్చింది." ఆ మాట అంటూ ఆ అమ్మాయి కంట తడిపెట్టింది. అది తుడుచుకోటానికి ఆ అమ్మాయి చేసిన ప్రయత్నాన్ని చూస్తూవుంటే నాకుండె గభిలుమని ఆగిపోయింది...ఆ పిల్ల ధైర్యవంతురాలు. ఈకాలంలో, ఆ పిచ్చిధైర్యం లేకపోతే, ఇక బ్రతకటం అంత సులభమా మరి?

ఈ పిచ్చిధైర్యంతో నే తిరిగి అన్నది:

"మా కొంప ముంచవద్దు. ఇదే మా కోరిక. మా నాన్న భ్రమలో వున్నాడు. ఆ భ్రమలోనే, ఆ పుస్తకాలుతెచ్చి, వాటిలోని చిత్రాలు మీకు చూపెట్టాడు. ఒక్కొక చిత్రం బాగోగులు తనివితీరా మీకు వివరించి సంతోషపడ్తాడు... ఆయన పాతకాలపు మనిషి. కాలచక్రం గిరగిర తిరిగిపోతూవున్నా, ఆ రహస్యం పాపం, ఆయనకు తెలియదు......నాన్నకు అపరాధం చేశాం. ఘోరపాపాలే, తెలిసే చేశాం. కాని అలా చేయకపోతే జీవించడం ఎలాగు మరి?......మేం ఒక్కళ్ళమే అయితే ఇంత దౌర్భాగ్యానికి వచ్చేవుండం...మాఅక్క ఇక్కడే వున్నది. దీని పిల్లల పోషణభారము మామీదే పడ్డది. ఈ చిత్రాలబాధకన్నా, ఆబాధ శాంతంగా సహించి ఇంత పెద్ద సంసారాన్ని ఏకోవిధంగా ఆదుకోవాలి...అందుచేతనే, పరాయివాళ్లను ఇంట్లోనికి రానిచ్చిన వారంకాదు... ...నాన్నా? ఆ పుస్తకాలు పారజూచుకూ వున్నప్పుడు, ఆయన ఆనందాన్ని చూచే తీరాలి! బొమ్మలు చూడడంతో తృప్తిపడే ఘటమా అది? అవి ఆయనకు ప్రాణాలు. వాటిని చిత్రించినవారు ఆయన ముందే నిలిచివున్నట్లు భ్రమపడ్తాడు. వారితో ఆయన చెప్పే ముచ్చట్లు వింటుంటే మేమే విభ్రాంతులమైపోతాం. ఇక మీకు చెప్పాలా మరి?...... మీరూ ఇప్పుడూ ఆ దృశ్యాలనే చూస్తారు...కాని మా మానాన్ని నిలువబెట్టే బాధ్యత మీమీదే వుంది"......

పాపం, ఆ తల్లీ, బిడ్డా అమాయకురాండ్రు. కాలాంతకులు, వీళ్ల అమాయకత్వం చూస్తే చేయాలసిన రభసవంతా చేస్తారు. కాలం ఈలాగున వుంటే, వాళ్లూ ఇంత మోసంచేసి, ఆ చిత్రాలు సంపాదించకపోతే, వాళ్ల పొట్ట ఎలా నిండుతుంది? ఈ సంగతి ఈ అమ్మాయి చెప్పనక్కరలేదు. నా కండ్లారా ఆ మోసం చూచాను. ఒకాయనకు ఎంతో

విలువగల చిత్రపటం వీళ్ళ చేతుల్లో పెట్టాలసి వచ్చింది. పాపం ఆయన తాత దీన్ని సేకరించాడు. తండ్రి ఎంతో జాగ్రత్తగా వుంచాడు. కొడుకూ కుశలాయనే! నూరేండ్లపైగా దీన్ని ఆ కుటుంబంలో ప్రాణంగా చూచుకొన్నారు. ఒక రొట్టెముక్క కొనటానికి దీన్ని ఆయన అమ్ముకోవాలసి వచ్చింది. వాళ్లు దీనికిగాను చేయాలసిన మోసంచేసి తృప్తిపడ్డారు...ఆ సంగతి తలచుకొంటే మనం జంతువులమా, మరే భూతాలమా? వీళ్ల పెత్తనంమీద మనదేశం ఇక బాగుపడుతుందా అని ఏడ్వాలి? అంతకన్నా మరేం చేయగల్గుతాం?...

ఆపిల్లకు అభయహస్తం ఇచ్చాను. మీ కష్టాలు నాకూ తెలుసు. ఆవిషయంలో మీరేం భయపడవద్దు అని చెప్పాను.

* * * *

ఇద్దరం కొంతసేపటికి వారి ఇంటిముందికే వచ్చాం. పాపం, తల్లీ బిడ్డలు అమాయకురాండ్రు. ఈ దౌర్భాగ్యకాలంలో జీవితరథాన్ని నడుపుకోవాలసివచ్చినా, ఆపనిని చక్కబెట్టుకోటానికి అష్ట కష్టాలు ఎదుర్కోవాలసివచ్చినా, వారిపంథా పాత కాలపుపంథా. ఈకాలపు మటుమాయాలు వారి కేమాత్రం తెలియవు. ఈ అమాయకత్వాన్నే చక్కగా తెలుసుకొని అందరూ వీరిని మోసపుచ్చడం మొదలుపెట్టారు. ఆపిల్ల చెప్పతూవున్న కథ వింటూవుంటే నా వొడలు కంపించిపోయింది. వీరు కష్టసముద్రంలో మునిగి తేలుతూవున్నారు. వీరి క్షేమార్గానైనా ఒకదరికిచేర్చటం నావిధి. ఆలా చేయలేక పోతినా, నాజన్మవ్యర్థం...

ఈలా ఆలోచనాతరంగాల్లో ఈదుతూ, ఏలాగయితేనేం, గడపలు గబగబ ఎక్కి తలుపుదగ్గరకేవచ్చి నిలుచున్నాను. మా సంపడి ఆయన వినేవుంటాడు! తలుపు తట్టామో లేదో సంతోషనాదంతో ఆయన "లోపలికి రావచ్చు" అన్నాడు.

ఆవిడే వచ్చి తలుపు తెరిచింది. మమ్మల్ని చూచిందో లేదో, ఆవిడే అన్నది, మందహాసం చేస్తూ!

"ఆయనకు విశ్రాంతి అన్న మాట వుంటే కాదూ? మందు పుచ్చుకోలేదు. నిద్రపోలేదు? మీకు ఆ చిత్రాలు చూపెట్టాలని తబ్బిబ్బు పడుతున్నాడు" అన్నది. కుమార్తెవంక ఒకసారి చూచింది. పిల్ల తల్లిని చూస్తూ, చేస్తున్న మందహాసాన్నిబట్టి ఏదో పెద్ద గండంలోనుంచే బయటపడ్డట్లు నిట్టూర్పు విడిచింది....

లోపలికి అడుగుపెట్టాం. బల్లమీద చిత్రాల పుస్తకాలు చక్కగా అమర్చబడివున్నాయి. వాటిలో ఒకదాన్ని తీసుకొని ఆయన దానిలోని కాగితాలు తిరగవేస్తున్నాడు. మేం తన దగ్గిరికే రావడం గుర్తించాడు. కూర్చున్న కుర్చీలోనుండి ఒక్కత్తున లేచాడు, నన్ను తన చెంతకే ఆహ్వానిస్తూ.

"మీరు వచ్చారు. ఎంతో సంతోషం. ఇక మన కార్యకలాపం ఆరంభిద్దామా మరి? బర్లిను మనుష్యులకు తీరుబాటుండటం కష్టం...ఈ పుస్తకంలో డ్యూరర్ ఎంతో చాకచక్యంగా చిత్రించిన బొమ్మలు వున్నాయి. అదృష్టవశాత్తు డ్యూరర్ చెక్కిన చిత్రాలన్నిటినీ సమకూర్చుకోగల్గాను... ఇందులో ఇది మంచిది. ఇదీ అంత మంచిదికాదని చెప్పగల్గుతామా మరి? ఒకదానికన్నా ఇంకొకటి అమూల్యరత్నం...ఆ సంగతి నేనెందుకు చెప్పాలి? మీరే బాగా తెలుసుకోగల్గుతారు." అంటూ ఆ పుస్తకంలోని మొదటిపుట తెరిచాడు....

ఆ బొమ్మ చూచాను. చూచాను. ఇప్పుడేనా అలా చూడటం? డ్యూరర్ చిత్రాలు ప్రత్యేకంగా ప్రదర్శింపబడుతూవచ్చిన చిత్రాలయంలో ఎన్నోసార్లు తనివితీర చూచి ఆనందించాను...ఇప్పుడో? ఇది చూచేటప్పటికి ఆనందించాలనా లేక బొటబొట కన్నీటి ధారలు రాల్చాలనా? అసలు అది దాని కాపీ. అసలు బొమ్మ అమ్మేటప్పుడు ఆ ఇల్లాలు ఎంత పరితపించి వుంటుందో?...పాపం, ఆయనకేం తెలుసు ఈఇంద్రజాలం?...దానివంకే తదేక దృష్టితో—పాతకాలంలో వలెనే—చూస్తున్నాడు. ఆ మూలా, ఈ మూలా, ఆమూలాగ్రం చూస్తూ, నిజమైన బొమ్మ అందులో వున్నట్లే తలుస్తూ, అపార ఆనందంలో మునిగి తేలుతూ వున్నాడు. ఆ పరంధాముడే, ఈ సమయానే నేత్ర దృష్టి ప్రసాదించి వుంటేనో?...

"ఇంత చక్కని చిత్రాన్ని ఎప్పుడైనా చూచారా మరి? ఆ దేహపువంపులు ఒకసారి చూడండి. ఈ అవయవాల రంగు చూడండి...ఆలా కళోపేతంగా చిత్రించటం మానవమాత్రులకు సాధ్యమా

మరి? దీన్ని గుర్రమని అంటాడు డ్యూరర్! ఆ రాజఠీవి, ఆ నడవడం, ఆ దృష్టి, దాని చుట్టుప్రక్కల వున్న ఆ ప్రకృతి సౌందర్యం సామాన్యమైన గుర్రాలకు అబ్బుతుందా? ఇట్టి చిత్రమే డ్రెస్‌డన్ చిత్రాలయంలో ఒకసారి చూచాను. కాని దీన్ని చూచాక ఆ దెంతమాత్రం వచ్చు లేదు. చిత్రకారుడు చేసిన పొరపాట్లు కొన్నిటిని అందులో కనిపెట్టివేశాను. ఆ జాతి వేరు. దీని జాతి మరొక్కటి" అంటూ దానిలోని తప్పొప్పులను వివరించటానికి ఆ మూలనుండి ఈమూలవరకు — మొదలు పెట్టాడు.

"దీన్ని ప్రపథమంలో డ్యూరర్ దగ్గిరనుండి సంపాదించిన ఆయన పేరు ఈ మూలే ముద్రించబడివున్నది. దీన్నొకసారి మీరూ చూచితీరాలి. ఆయన మునిమనమడి ఇంట్లోనుంచే దీన్ని సంపాదించాను. దానికోసం ఆకాలంలో నేనుపడ్డ తాపత్రయం వింటే మీరే విభ్రాంతులైపోతారు" అంటూ ఆ కథ్న సాంతంగా చెప్పివేసేవంతవరకు ఆయన మనస్సు స్తిమిత పడింది కాదు......

ఇంక, ఆ చిత్రాలన్నీ చూస్తున్నప్పుడు, ఆయన వాటినిగురించి ఎన్నోవిషయాలు వివరించుతున్నప్పుడు, నా అయోమయం ఇక చెప్పాలా మరి? పొడలు కంపించి పోతున్నది...... నేనూ దాన్ని చూచి ఆనందించుతున్నట్లే నటించాలసిన దౌర్భాగ్యంపట్టింది. నా యీ స్థితి నే ఆయన గ్రహించాడా లోకమే మునిగిపోతుంది! ఇక ఆవిడ ఆవేదన వివరించాలా?

ఏలాగయితేనేం, తటపటాయించక, "ఔను. ఇది డ్యూరర్ కళానైపుణ్యాన్ని బహుచక్కగా ప్రకటించుతున్నది," అని జవాబిచ్చాను. ఆ మాట విన్నాక ఒక చిరునవ్వు నవ్వాడు. ఆలా నవ్వుతున్నప్పుడు ఆ ముఖ వికాసాన్ని చూచే తీరాలి! తన దగ్గిర అంత గొప్పచిత్రం వున్నందుకు గర్వపడ్డాడు. ఆ రెప్పలు ఈఆనందంలో ఏలా కొట్టుకొంటున్నాయో? ఆ దృశ్యాన్ని వర్ణించటం మన తరమా మరి?

"దీనికోసమేనా ఇంత ఆనందిస్తున్నారు? దీనికి మించిన చిత్రాలు ఇందులోనే వున్నాయి. వాటిని మీరు చూచాక ఏ మంటారో విని సంతోషపడాలి"అంటూ మరొక చిత్రాన్ని చూపాడు. అదీ ఇటువంటి పంథాలోనే వుంది...

"చిత్రకారుడు దీనికి "విషాదం" అని పేరు పెట్టాడు. విషాదాన్ని ఇన్ని కళాకాంతుల్తో మరే చిత్రకారుడు చిత్రించి వుండలేదు. దీన్నే బెర్లీను కళోపాసకులు, వారేకాదు, మూజ్యీయంవారు, చూస్తే, ఇక ఇక్కడ వుండనిస్తారా ఇది?" అని మందహాసంచేసి, ఎంతో వుత్సాహంగా వర్ణించడం ప్రారంభించాడు...

ఇలా ఒక చిత్రం తరువాత మరో చిత్రాన్ని ఆ పుస్తకాలను, తన మామూలు పద్ధతిలోనే తెరిచి చూపించాడు. కాలచక్రం గిరగిర తన మార్గానే ఎంతో వడిగా తిరిగిపోతున్నది. ఆయన తన తన్మయత్వంలో ఆ సంగతే పూర్తిగా మరిచిపోయాడు... ఇక మా సంగతో? ఒక గండంనించి మరో గండంలో పడుతూ, తబ్బిబ్బైపోతున్నాం. పాపం, ఈయన సంపాదించిన చిత్రాల సంఖ్య లెక్క చెప్పటానికి ఆరంభించితేనా? రెండు వందలకు పైగానే వున్నాయి...అన్నీ కాలవాహిలో మటుమాయమైపోయాయి. వాటిస్థానే నిలిచినవి యీ కృత్రిమ చిత్రాలు.

ఈలాగే డ్యూరర్ చిత్రాలు మాకు చూపాడు. తరువాత రెంబ్రాన్ట్ చిత్రాలు ఈ ధోరణిలో చూపిస్తుంటూ, వాటినిగురించి ఎన్నో వివరాలు వర్ణించుతూ తన్మయుడైపోయాడు.

* * *

ఆ పనిఅంతా సవ్యంగా, ఎంతో చాకచక్యంతో చక్కబెట్టాక, ఒక నిట్టూర్పు విడిచాడు. ఆనందబాష్పాలు ఏకధారగా కారుతున్నాయి. ఆలా చూస్తుంటే పాతరోజుల సంగతి జ్ఞప్తికి వచ్చింది.

"మీవంటివారు రావడం, వీటిని చూచి ఆనందించటం నా అదృష్టం. ఈ చిత్రాల విలువ మీకు తెలుసు. మీరు, ఎన్నిపనులున్నా, అన్నీ మాని వేసి, ఇంతవోపికతో వీటిని చూడటం నన్నేకాదు, మాఇల్లుకూడా పావనంచేసినట్లే అని నేను మరిమరి చెప్పాలా? వీటిని ఇంతకాలం ఎంతో జాగ్రత్తతో పోషించాను. నా సొంతబిడ్డలకన్నా ఎంతో గారాబంగా చూచుకొంటున్నాను. వీటిని సేకరించ

టానికి నా సంపాదనంతా పాడు చేశాను... అరవైఏండ్లు కాలం ఈ రత్నాలు సంపాదించటానికి నేను చేసినత్యాగాన్ని మీరే వింటేరా ఆశ్చర్యపడిపోతారు. ఆ కాలంలో పానీయాలు రుచి చూడటం పూర్తిగా మానేశాను. పొగచుట్టలు తాగటం వదిలిపెట్టాను. సెలవుల్లో ప్రయాణం చేయడం నిలిపేశాను. నాటకప్రదర్శనాలు చూడటం మానేశాను పుస్తకాలు మరి ఇతరవస్తువులు ఎంత అవసరమైనా, కొనటం పూర్తిగా వదిలిపెట్టాను. అమూలంగా కూడబెట్టుకోగల్గిన ధనం అంతా ఇవి సంపాదించుకోటానికే వ్యయంచేశాను... ఈజీవితం క్షణభంగురం. నేనూ ఒకరోజున ఈ కాలవాహినిలో పడిపోవాలసిందే. కాని అంతవరకూ... మీరా భాగ్యవంతులు. అష్టైశ్వర్యాల్లో తులతూగుతూ వున్నలక్ష్మీపుత్రులు ... కాని నా సంగతో? నేను వున్నఇల్లుచూస్తే నా జీవితవైఖరిచూస్తే పిసినారినని తప్పక అంటారు...ఈ జీవంలో ప్రాణం వున్నంతవరకు, ఎన్ని దుర్భరావస్థలు ఎదుర్కోవలసి వచ్చినా, వీటినిమాత్రం బయటికిపోనీయను ... అట్టి ఆలోచనే ఈ ఇంట్లోవారికేవుండేనా,... మొదట నా శవాన్ని వెలుపలికి లాగుకొనిపోవాలి. అటుతరువాతే ఈసంగతిని ఆలోచించటానికి ..." అంటూ మరోకసారి ఆ మృదులహస్తాలతో ఆ పుస్తకాలు గట్టిగా పట్టుకొన్నాడు. తన సొంతబిడ్డలను పాలించి లాలన చేస్తున్నట్లు వాటివంక చూశాడు. మందహాసం చేశాడు.

మేమంతా ఆయనచుట్టూ నిలువబడి ఆ దృశ్యాన్ని తదేకదృష్టితో చూస్తున్నాము.

దీన్నే అలా చూస్తూవున్నప్పుడు జర్మను చిత్రకారుడు క్రీస్తుప్రభువు మరణానంతరం చిత్రించుకొని వ్రాసిన చిత్రం స్ఫురణకువచ్చింది. భగవానుడు సిలువమీద ప్రాణాలు విడిచాడు. కళేబరాన్ని తీసుకొని వెళ్ళి ఒక గుహలో సమాధిచేశారు. ఆపని జరిగి మూడురోజులైంది. ప్రభువు మృతకళేబరాన్ని చూడటానికి ఆయన ప్రియశిష్యురాండ్రు అక్కడికి అర్ధరాత్రివేళ వస్తారు. ఆ ప్రదేశం ప్రశాంతంగావున్నది. సమాధికి కావలి కాసేవాళ్లు గాఢనిద్రలో మునిగిపోయారు.పాపం, ఈతల్లులు గాభరాతో ఇటూ అటూ చూస్తారు. సాహసంచేసి సమాధిమీది మూత తెరుస్తారు! లోపల శవంలేదు. మటుమాయమై పోయింది. ప్రభువు మరణించటం తాము కన్నులార చూచారు. ఇక్కడ సమాధిచేయబడటం చూశారు. కాని ఇప్పుడేది? ఇది మాయా? లేక మహిమని అనాలి? ఆ గాభరాతో కొందరు కన్నీరునించారు. మరి కొందరు గడగడ వణికిపోతున్నారు. ఇక కొందరు—వారికి ఈ ఇంద్రజాలం లోగుట్టు బాగా తెలుసు—భగవానుని దైవశక్తి తలపోస్తూ తన్మయావస్థలోపడి పోయి వున్నారు.........

ఇదే ఆయన్ని చూస్తున్నప్పుడు మా అవస్థ. ఆయన ఈ లోకానికి మరణించినట్లే కాని ఆయన చావలేదు. చిరంజీవి. తన దివ్యలోకంలోనే వుండి ఆనందిస్తున్నాడు..ఆ తల్లి కంపించిపోతున్నది. ఇక ఆ పిల్ల సంగతిని చెప్పడమెందుకు? నా సంగతి చెప్పాలా ఆ దృశ్యాన్ని చూస్తూ వున్నప్పుడు?...

ఆయన తన పని అంతా సాంతంగా చక్కబెట్టాక, ఆ పుస్తకాలు బీరువాలో జాగ్రత్తపరిచాడు. బీగాలు గట్టిగా వేసి, ఆ గుత్తి భార్య చేతి కిచ్చాడు.

* * * *

బల్ల ఖాళీ అయింది. ఆవిడ కాఫీ పాత్రలు దానిమీద చక్కగా అమర్చి కాఫీ పుచ్చుకోటానికి మమ్మల్ని ఆహ్వానించింది. అదీ ఒక విధంగా నా మంచికే వచ్చింది. ఆయన్ని చూచాక నా నరనరాలు శోషిల్లాయి. వాటికి శాంతి కావాలి. పైకి ఎంత అట్టహాసం చేసినా ఆ స్థితి మాత్రం చక్కపరచుకో లేకపోయాను. నా కన్నా వయస్సులో ఆయన ఎంతో పెద్ద. ఆ వుత్సాహము, ఆ మాటల చాకచక్యము చూస్తూవుంటే, నే నెక్కడ? ఆయ నెక్కడ? ఆత్మకే వుత్సాహంవుంటే, వృద్ధులు, యువకులైపోతారు...కాఫీ పుచ్చుకుంటూ ముచ్చట్లు చెప్పసాగాడు. ఆయన్ని ఆయా వర్తకులు మోసం చేయడానికి ఎన్ని భగీరథ ప్రయత్నాలు చేశారు! వాటినుండి బయటపడడానికి తను పడ్డ అష్టకష్టాలు తలంచుకొంటేనో?...తనకు నచ్చిన చిత్రాలు వాళ్ల దగ్గిర వున్నాయి! వాటిని సాధించడానికి ఎంత నాటకం ఆడాలిసివచ్చింది? ధైర్యం కావాలే? ఆ పిచ్చి ధైర్యమే తన కార్యకలాపాన్ని చక్కపెట్టేసింది!...ఇక నేను వెళ్ళిపోవాలి? చక్కబెట్టుకోవాలిసిన పని ఎంతోవుంది. ఆయనదగ్గిర సెలవు పుచ్చుకోటానికి సాహసంచేసి లేచాను...ఆయన వెళ్ళనిస్తాడా మరి?.."అప్పుడేనా వెళ్లడం? అన్ని చిత్రాలు చూచారుకారు. అవి చూడకుండా వెళ్లడం ఏమాత్రం మంచిదిగాదు. మీవంటి రసికులు ఎప్పుడూ మా ఇంటికి వస్తారా?...అవి మీరు తప్పని సరిగా చూడాలి." అంటూ గభాలున లేచాడు. చిన్న

పుత్రవాసివలె పట్టుపట్టాను. ఆ స్త్రీలు ఈ దృశ్యాన్ని చూచాక ఏం చేయగల్గుతారు? కాని ఆయనతో ఆ తల్లి అన్నది. "భువ మాయన్ని నిర్బంధించడం మర్యాద కాదు. రైలుబండి తప్పిపోతేనో? ఆ సంగతి మనం గ్రహించాలి."

దాంతో ఆయనేం చేస్తాడు పాపం?... నేను వెళ్ళిపోవడం తప్పనిసరి అని గ్రహించాక ఆ ముసలాయన నీ విధంగానో వున్నాడు. గొంతు మారిపోయింది. నా చేతులు గట్టిగా పట్టుకొన్నాడు. తన కృతజ్ఞత చూపెట్టటానికి నన్ను తడిమాడు. మాట రాదు. ఎంతో బాధపడుతున్నాడు......కొంతసేపయ్యాక, తన ధైర్యం తెచ్చుకొని "మీరు రావడంవల్ల నాలో ఎక్కడాలేని వుత్సాహం వచ్చింది. ఇట్టి చిత్రాల రహస్యం తెలుసుకొన్నవారు ఈ కాలంలో కనబడడం అరుదు. అందులో నావంటి ముసలివాణ్ణి అంగుల్ని చూడడానికి మీవంటివారు రావడం నా అదృష్టం...అదిస సమయాన్నే నా కోరిక మీకూ చెప్పివేయాలి...ఈరత్నాల్ని, నా యోగ్యాన్ని బయటికి పోనీయకుండా కాపాడే భారం మీమీదే వుంది. అంతే కాదు. ఇంకో కోరికకూడా ఈ అంత్యకాలంలో మిగిలివుంది" అంటూ ఆ చిత్రాలున్న బీరువాలవైపు ఒకసారి చూస్తూ "వాటి జాబితా తయారు చేసే బాధ్యత మీమీదే పెట్టుతున్నాను. ఆ జాబితా తయారు చేసి ఇస్తానని మీరు వాగ్దానం చేయాలి ...అదే నా కోరిక. నా సమాధి కూడా అదే. దానికన్నా మరేదాన్ని వాంఛించాలి మరి?" అన్నాడు కన్నీటిధారలు కారుస్తూ, పాపం, ఆ ముసలాయన.

తల్లీకూతుళ్లు ఆ మాట విన్నాక ఏలా స్తంభించిపోయారో మరి వేరే చెప్పాలా? ఆరత్నాలు ఎప్పుడో పోయాయి. గబగబ పరిగెత్తుతూ మటుమాయమయ్యాయి. ఆ బీరువాల్లో వున్నవి రాళ్లు, రప్పలు అని ఆయనే తెలుసుకోగల్గాడా? ఇంకేం అవుతుంది?... అట్టి కోరిక కొనసాగించటానికి ఏమాత్రం వీలులేక పోయినా, తప్పక దాన్ని నెరవేరుస్తానని అభయమిచ్చాను. ఆ మాట విన్నాక, ఆ నేత్రాల్లో నుండి దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆ జ్యోతులు చూచే తన్మయమైపోవాలి!...

ఆయన దగ్గిర ఎంతో కష్టంతో సెలవుపుచ్చుకొని బయటికి వచ్చాము. ఆ తల్లులూ నాతో తలుపు దగ్గిరకు వచ్చారు. తమ కృతజ్ఞత వెలియబెయ్యడానికి నా వంకచూచారు. ఆ కంపిస్తూపోతున్న శరీరాలు చూస్తూవుంటే, ఆ కన్నీటి ధారలు అవలోకిస్తూవుంటే, నేను వారిని ఎలా చూడగల్గుతాను మరి? మర్యాద లాంఛనాలన్నీ ఏదోవిధంగా ముగించుకొని గబగబ నడిచి వీధిలోపడ్డాను...

ఆయనకు మహాపరాధం చేశాను. ఆ సంగతి మరిచిపోగలనా? దేవమాతలే, అసమయాన్నే ఆయన గదిలో ప్రత్యక్షమై, నేత్రదృష్టినే ప్రసాదించి వుంటేనో...ఆయన నిజం తెలుసుకుంటాడు. అది తెలుసుకొంటేనో, ఇక ఆయన ప్రాణాలు నిలుస్తాయా మరి?...కాని నావంటి మానవ మాత్రులు ఈ విషమపరిస్థితుల్లో మరేం చేయడానికి సాహసించగల్గుతారు? ఈ ఆలోచనావాహినిలో తేలియాడుతూ, నడుస్తున్నాను...

ఒక ఆలోచన మాత్రం నన్ను కష్టపరంపరల్లో నుంచి గట్టెక్కించింది. కాలం కష్టకాలం...అంతే పాడుకాలంలో' కూడా కళ, చిత్రకళ చావలేదు. కండ్లున్నవారు దాన్ని నారాధన చేస్తున్నా, ఒక అంగుడు, దాని మహిమ మరిచిపోలేదు. అట్టి కళాదులు ఈ కాలంలో వుండడం మన భాగ్యం... అంతే అదృష్టం వుండటం మూలకంగానే కళ చావదు. ఏలా చస్తుంది? ఆయన సాక్షాత్తు గురుదేవుడు. ఆయన దర్శనం చేసుకొన్న నేనూ పావనుడ నయ్యాను. అదేచాలు. అదే ఎన్ని ఎదురుదెబ్బలలోనుండి సవ్యంగా ఆ కళ వర్ధిల్లటానికే సహాయపడుతుంది.

.........

ఇలా నడుస్తూవుంటే ఎవరో నన్ను పిలుస్తున్నట్లు విన్నాను. ఈవూరికి పరాయివాణ్ణి...ఎవరు పిలుస్తున్నారు, అంత పరిచయం వున్నవారెవరై? ఇటూ అటూ చూచాను. ఆయనే కిటికీ తెరిచి నావంక చూస్తూ, నన్నే పిలిచాడు. ఆయనదగ్గిర ఆ యిరువురు తల్లులూ నిలువబడివున్నారు. చేతిలో రుమాలు వుంది. అది యెగరవేస్తూ అంటున్నాడు:

"మీ కార్యం సఫలీకృతం అగుగాక" ఆ గొంతు ముసలాయనదొంతిని ఎలా అనగల్గుతాను? ఆయన చిరంజీవి. అంతవుత్సాహం, వుద్రేకం మనకూ ఈ కాలంలో వుంటేనో?

ఆ రోజులలో ఎంతో మంది నడుస్తున్నారు, వాళ్లి వాళ్ల వైఖరుల్లో, వాళ్లవాళ్ల ప్రపంచపుమార్గాల్లో:.. దీనిరహస్యం వాళ్లికేం తెలుస్తుంది? ఈమాట ఆ ప్రపంచాన్నే ఒక క్షణకాలం మరిచిపోయి, వినగల్గారా? ప్రపంచమే పూర్తిగా మారిపోతుంది...

ఆ మాట పదేపదే తలుస్తూవుంటే గోథేమహాకవిచక్రవర్తి అన్న వాక్యం జ్ఞప్తికి వస్తున్నది.

"చిత్రాలు సంపాదించడం కష్టం. ఆ కష్టం ఎదుర్కొని అవి సేకరించగలిగినమానవులే మానవులు! అదృష్టమున్నది ఒకటి ఈలోకంలో వున్నదా, అది వాళ్లదగ్గిరే చూడవచ్చును!"

# నాగేశ్వర సంస్మృతి

'శాస్త్రి'

ఆనాడు దేశోద్ధారకుని వర్థంతి దివసం. అక్కడ సమావిష్టులైన వారంతా కలిసి పది పదిహేనుగురికంటె ఎక్కువ మంది ఉండరు. ఆ సమావేశంలో పెద్ద ఆడంబరా లేవీ లేవు. ఎవరో కొందరు పంతులుగారి చిత్రపటం పూలమాలికలతో అలంకరించి హారతి ఇచ్చారు. అంతే.

ఆనా డుపన్యాసాలు మొదలైన ఆర్భాటా లేవీ లేనేలేవు. అందువల్ల ఆయా ప్రముఖులకు ఆహ్వానాలు పంపించే ప్రసక్తే రాలేదు.

అయినా తలవని తలంపుగా ఒక వ్యక్తి అక్కడికి వచ్చారు. పంతులుగారికీ వీరికి బాగా సన్నిహిత పరిచయం ఉండేది. ఆ రోజుల్లో వారితో బాటు సత్యాగ్రహాది సమరాల్లో పాల్గొని అనేక విధాలుగా సతమతమైన వ్యక్తి. ముక్కాకలు తీరినవాడు. ఈయన ఆనాటి పంతులుగారి అనుచరవర్గంలో ఒక సామాన్య వ్యక్తి మాత్రమే. అయినా ఆనాటి స్వాతంత్ర్యావేశంలో అనేక విధాలుగా శ్రమించి, కష్టనష్టాలకు గురిఅయినవాడు. ప్రస్తుతం వీరు రాజకీయాల్లోనించి పూర్తిగా విరమించుకున్నారు.

ఆనాడు దేశోద్ధారకుని గురించిన ప్రస్తావన లేవోవచ్చాయి. ఈ వ్యక్తికూడా పంతులుగారిని గురించిన గాథలేవో ముచ్చటిస్తున్నారు. ఎన్నెన్నో మధురస్మృతు లాక్షణంలో వారి మనోవీధిలో స్ఫురించి ఉండవచ్చును. కొంతసేపటి కాయన నోట మాట రాలేదు. కళ్లనీళ్ల పర్యంతం అయింది. అలాగే పంతులుగారిని తలుచుకుంటూ ఆ ఆవేశం పట్టలేక ఆయన వట్టి పసిపాపలా విలపించారు.

మళ్లీ కొంతసేపటికి కుదుటపడి, ఈ ఆవేశానికి లోలోపల కించపడి వెంటనే అక్కడినించి వెళ్లిపోయారు.

పంతులుగారు పరమపదించి పద్దెనిమిది సంవత్సరాలయింది. ఎంతటి ఆత్మీయ బంధువులకైనా ఈపాటికి కొంత విస్మృతి, ఉపేక్ష కలగడం సహజం. మొత్తంమీద ఆంధ్రజాతి, నాయకులుకూడా వారిని విస్మరిస్తున్నారనే అనిపిస్తూంది. లేకపోతే జాతి సర్వతోముఖాభివృద్ధికి అహర్నిశలు తపించిన ఆ మహామహునికి తగిన స్మృతి చిహ్నంకూడా నెలకొల్పలేక పోవడానికి మరి వేరే కారణం కనిపించదు. లేక, మన వారి మనస్తత్త్వంలోనే ఈ ఉపేక్షాభావం ఉన్నదేమో! తెలియదు.

ఆ వ్యక్తి అలాగ వెళ్లిపోగానే అక్కడ ఉన్న వారంతా నిర్ఘాంతపోయారు. ఆయన చీటికీ మాటికీ కన్నీరు పెట్టుకునే వ్యక్తి కాదు. సహజంగా ఉద్ధతుడు. చాలా కాలం నించి ఆయన పరిచయం ఉన్న వారందరికీ

ఈ ధోరణి ఎంతో ఆశ్చర్యం కలిగించింది. ఎన్నడు బెంబేలుపడడం అంటే ఏమో ఎరగని ఆ వ్యక్తి మనసులో ఇలాంటి ఆర్ద్రిత కలిగించిన పంతులుగారి స్మృతి మాధుర్యంలోనే అంతటి మహత్త్వం ఉన్న దని అక్కడి వారందరు అనుకున్నారు.

అయితే ఇది చాలా సామాన్య సంఘటన. ఆనాటి స్వాతంత్ర్యోద్యమాల్లో పాల్గొన్నవారి కెందరకో వారి స్మృతి ఇంతకన్నా మహత్తరమైన భావన లెన్నో కలిగించి ఉండవచ్చును. నేటికీ నాగేశ్వరరావుగారి పరిచయ భాగ్యం లభించిన, కవులు, పండితులు, పరిశోధకులు, కళాకారులు, శాస్త్రజ్ఞులు, సంఘ సంస్కర్తలు, మొదలైన వా రెందరెందరో వారిని గురించినగాథ లెన్నెన్నో చెబుతూంటారు. వీరందరు విశ్వదాత ప్రత్యేకంగా తమవర్గానికే సంబంధించిన వ్యక్తి అన్నట్టుగా ప్రస్తావిస్తూంటారు. విశ్వతోముఖమైన పంతులుగారి వ్యక్తి మహత్త్వమే అట్టిది. విజ్ఞానంలో, కళా సారస్వతాల్లో, సంఘ సంస్కారాదిరంగాల్లో నాగేశ్వరరావుగా రాంధ్రులకు చేసిన సేవ మహత్తరమైనది.

కొందరు కేవలం రాజకీయ నాయకులే. వీరికి కళా సారస్వతాదివిషయా లంతగా పట్టవు. మరికొందరు సంస్కరణాది సాంఘికోద్యమాల్లోపడి నిత్యము సమతమహాతూంటారు. వీరికి శాస్త్రపరిశోధనాది విషయా లంతగా రుచించవు. కళాప్రపూర్ణునిలో ఇవి అన్నీ మూర్తీభవించాయి. నేటి ఆంధ్రదేశంలో ఏవిధమైన జాతీయోద్యమం తీసుకొన్నా దానిలో దేశోద్ధారకుని ప్రభావం విస్పష్టంగా గోచరిస్తూంటుంది.

మొన్న వర్ధంతినాడు మన తాత్కాలిక రాజధానిలో పలువురు మంత్రివర్యులు వారి గుణగణాలు కీర్తించి ధన్యులైనారు. ఈ సంస్మృతి ఆంధ్రుల కిక అన్ని రంగాలలోను శుభప్రదం కాగలదనీ, ముఖ్యంగా మంత్రివర్గంలో ఐకమత్యము, విశాలమైన రాష్ట్రాభిమానము పెంపొందింపగలదనీ ఆశిస్తున్నాను.

ఆ రోజుల్లో సమగ్రమైన రాష్ట్రాభిమానము, సర్వతోముఖమైన అభివృద్ధికాంక్ష, తత్పరత, సామరస్యము మూర్తీభవించిన వ్యక్తి నాగేశ్వరరావు పంతులుగారొకరే అంటే అది కేవలం న్యూనోక్తి మాత్రమే. ఆంధ్ర రాజధానిలో రేకెత్తిన వారి దివ్యస్మృతి సర్వతోముఖంగా వికసించి, చక్కని రూపు ధరించంగలదనీ అది మన మంత్రులందరికీ ఆదర్శప్రాయమై వర్ధిల్లగలదనీ ఆశిస్తున్నాను.

ఇటీవల కొందరు హరిజనులొకచోట సమావేశమై పంతులుగారు తమ సంఘోద్ధరణకు చేసిన సేవ గేయరూపంలో కీర్తించుకొన్నారని పత్రికల్లో ఒకచిన్న వార్తపడింది. నామట్టుకు మంత్రివర్యుల ప్రశంసలో కంటె వీరి కృతజ్ఞతలోనే పంతులుగారి మహత్త్వం ఎంతో అంతర్గతమై ఉన్నదని అనిపించింది. హరిజనులు దేశోద్ధారకునికి సముచితమైన కీర్తిభవంతి నిర్మించుకోలేకపోవచ్చును. చివరికి పంతులుగారి చిత్రపటంకూడా ప్రతిష్ఠించుకో లేకపోవచ్చును. కాని హరిజన స్త్రీలు తమ తమ గేయరూపాల్లో కీర్తించిన ఆ ప్రశస్తిలోనే అజరామరమైన వారి కీర్తి మందిరప్రతిష్ఠ జరిగినదని ఆ వార్త చది

వినవారి కెవరికైనా స్ఫురిస్తుంది. 'పదం పద్యం పట్టి నిలిచెను కీర్తులపకీర్తుల్' అన్న కవివాణికూడా ఈ సంఘటనలోనే సార్థకమైనదని అనిపించింది.

ఈనాడు రాజకీయ విప్లవాలను గురించీ, సామ్యవాద ధోరణిని గురించీ చిత్రవిచిత్రమైన వాదోపవాదాలెన్నో వినబడుతూంటాయి. అనేకులు కేవలం ఆవేశాల్లో పడి ఆర్థిక రాజకీయాది సమస్యలకే ప్రాధాన్యం ఇస్తూంటారు. ప్రస్తుత పరిస్థితుల్లో ఇంతకంటె మార్గాంతరమేదీ లేదని విజ్ఞులనేకులు భావిస్తున్నారు. కాని ఈ విధమైన సమస్యలు బయలుదేరడానికి మానవజాతిలో ప్రకోపిస్తున్న ఆధ్యాత్మికదృష్టిలోపమే ప్రధాన కారణమని గుర్తించిన విజ్ఞులీకాలంలో చాలా అరుదుగా ఉన్నారు. ఈ ఆధ్యాత్మిక దృష్టిలోపమే క్రమంగా మానవజాతి అథఃపతనానికీ మానవత్వలోపానికీ దారి తీస్తున్నదనీ ఆధ్యాత్మిక దృష్టి కంటె ప్రస్తుత భయంకర పరిస్థితుల్లో శరణ్యమేదీ లేదనీ ఈ విజ్ఞులిటీవల గుర్తించారు. కాని పంతులుగారిలో ఈ దృష్టి సహజంగా ఆవిర్భవించి సమగ్రమైన వారి జీవిత దృక్పథాని కొక జ్యోతిలా మెరిసింది. కళాసారస్వత రాజకీయ సాంఘికాది రంగాల్లో వారు చేసిన కృషి, రచించిన రచనలు పరిశీలిస్తే సర్వత్ర ఈ దృక్పథమే భాసిస్తూంటుంది. దీనివల్లనే వారి జీవితాని కొక పరిపూర్ణత ఏర్పడింది.

దేశోద్ధారకులను గురించి స్మరిస్తున్న సమయంలో ఇలాంటి వ్యక్తి ఒకప్పుడుండేవారా అని ఆశ్చర్యంవేస్తుంది! ఒక్కొక్కప్పుడింతటి పరిపూర్ణత మానవమాత్రులకు సాధ్యమా అని కూడా అనిపించడం సహజం!

ఇందువల్లనే వారి స్మృతి ఎందరెందరి ఆత్మల్లోనో అగరు ధూమలతికలా నిలిచి నిరంతరము పుణ్యభావనలు రేకెత్తిస్తూంటుంది.

నా కొక సారస్వత సమావేశంలో వారి దర్శన భాగ్యం మాత్రమే లభించింది. అప్పటినించీ ప్రశాంతగభీరము, ఉదారము అయిన వారి తేజోమూర్తి మనోవీథిలో అలాగే నిలిచింది! వారి సహచరులై వారితో చిరకాల పరిచయ భాగ్యం సంపాదించిన వారి కెంతటి మనోజ్ఞానుభూతులైనా కలిగి ఉండవచ్చును.

ఒక్కొక స్మృతి మనలో కొంత కాలమే నిలిచి ధూళిధూసరమైన చిత్తరువులా క్రమంగా మాసిపోతూంటుంది. కొన్ని మహత్తర స్మృతులు మన అంతరాంతరాళాల్లో నిత్యనూతనమైన మాణిక్య దీపికల్లా మెరుస్తూంటాయి.

కళాప్రపూర్ణుని దివ్యస్మృతి కొందరు వ్యక్తులకేగాక జాతి జాతి కంతటికీ మహత్తరమైన మాణిక్యదీపిక!

ఈ దీపిక కాంతులే జాతి అంతరాంతరాల్లో వెలుగుదారులు నిర్దేశిస్తూ తెలుగు జాతిని సముజ్జ్వలపథంలో నడిపింపగలవని ఆశిస్తున్నాను.

# పెన్నేటిపాట

శ్రీ విద్వాన్ విశ్వం

(గత సంచికతరువాయి)

## మూడవసర్గ

రంగన్న గబగబా, పారంగడగ్ర ద్రోసి మొంగ మురమ్ముం గాళ్లున్
ముంగలచేతులు గడుగుకొనెం, గంగమ దెచ్చియిచ్చు నీటిముంతతో.

కుండలోని సంగటినంత గోకి తీసి, మూకటినిబెట్టి మజ్జిగ మునుగ బోసి,
పచ్చిమిరపకాయొక్కటి తెచ్చియిచ్చె, ఉదయభోజన మతని కియ్యదియె సుమ్మ!
గంగమ్మ పదారేండ్లది, కొంగునిలుచునంత వయసుగూడ లేని, దా
సింగారపుబొమ్మ మన, 'రంగన్నకు బ్రదుకులో చిరత్నరత్నమూ.

అంగమ్ముల నిగనిగ, సారంగమ్ముల లగువుబిగువు, రంగులసొగసుల్
ఖంగున మ్రోగెడుకంఠము, బంగరుబొంగరము పుణికిపట్టిన దపుడే.

రంగు వెలిసిన నీలిచీర, చెఱంగులకు సొరుంగడించి, తా
రంగలించు కురంగనయనా స్నిగ్ధవర్తనముల్;
చెంగుచెంగున చెంగలించి, బెడంగుసొబగుల రంగలించి, వి
హంగభంగుల వింగడించు లతాంగిచందమ్ముల్.
సిల్వరుకడియాలే, ఆ చెల్వకు సొగసులనుగూర్చె, చెవుల బెండుగ
మ్మ ల్వయ్యారము బెనిచె, నగ ల్వలెనే మిసిమిపసిమి కలకలలాడన్.
చెండుమల్లె చాలు నిండుదన మ్మిచ్చు, కొండగోగుచాలు దండిదండి;
వెండిబిళ్ళచాలు వెలుగులవిరియించు, కొప్పులోని కలదు గొప్పదనము.
తిప్ప లెన్నిపడిన ముప్పుల మున్గిన, ఉప్పుపప్పు లేని యునికియైన,
కప్పురంపు టెడద, కమ్మనితలపులు, నిప్పువంటి బ్రదుకు—గొప్పనిచ్చె.

అమ్మలేదు, నాన్న అంతకంటెనులేడు, కొమ్మలేదు పట్టుగొమ్మలేదు;
నిమ్మళముగ నెట్లొ నెగడించె జీవిక, సొమ్మసిలక బావ జూచువఱకు.

అక్క బావ పిదప, నల్లారుముద్దుగా సొంతపిల్లలాగ జూచుకొనిరి;
తమకుపిల్లలేల ? తలిదండ్రులే తామటంచు పెంచినారు, మంచివారు.

చాకి నంతరించి చదువు చెప్పించిన బావ, ఎద్దుపొడిచి పోవగానె
అక్క గడ్డిమోపు లమ్మి పోషించెను, లేమియేమిసేయు ప్రేమయున్న!

మగవాడుపోయెనే యని, పొగలుచు గంపంతదిగులు పొడుచుచునున్నన్,
మిగులోనగులో తా దిని, తెగించి చెల్లెలిని సాకె దేవ మొక్కతే !
అక్క దేవమ్మ దేవత ! చిక్కులెన్ని నొక్కుచున్నను చెల్లెలి జిక్కనీక,
మిక్కుటమ్మగు మక్కువ, రెక్కవట్టి నడుపుకొనివచ్చె తక్కువన్నదియె లేక.

పేదరాలుగనుక, పెద్దకుటుంబము చిదికి నిలిచినట్టి చిన్నవాని
వెదకివెదకి, కడకు వీని రంగన్నను-జూచి పిల్లనిచ్చి చొక్కిపోయె.

గంగమ్మకు, రంగన్నకు సింగారము జేసి, పెండ్లిజేసిననా, డా
యంగనకనులన్, మాలిమి పొంగులు రంగులనుసూపి పూర్ణతనందెన్.

మాలిమితాలిమిం గొలుచు మానము లేదు; కులాద్రులం దలం
దాలిచి, సప్తసాగరవితానము నీదుచు, కల్పముల్ తపః
పాలనసేయనీ, ఎడద బాకులపోటుల బ్రువ్వనీ— వనం
తాల వనాల పూల పవనాల విలాస విహారమే యగున్.

పెనుబలముగలది మక్కువ, తనుదానై తన్నుదాను తలగుకొనుటకున్
వెనుదీయనీదు, నిన్నెంతో నిరామయ దివ్యకర్మనిష్ఠుని జేయున్.

అనురాగహీనజీవిత, మనయము నిన్నడచిపుచ్చు నతిభారమ్మై;
నినునన్ను జేయి గలిపి, యువని మాఘువనిం బొనర్చు వలతి యదొకటే.

రంగన్నగంగమ్మ రంగురక్తిమలు; రంగన్నగంగమ్మ నింగినీలిమలు;
రంగన్నగంగమ్మ సింగారముల జిమ్మ, రంగారుబంగారు పొంగారుగోపురాల్;
రంగడంటే ఒక్కగంగమ్మమగడె, గంగమ్మ అన నొక్కరంగన్నపడుచె;
రంగన్నబ్రదుకెల్ల గంగమ్మబ్రతుకె, గంగమ్మమనసెల్ల రంగన్నమనసె.

రంగని గంగన్నాయని, గంగమ రంగమ్మయనుచు గ్రామప్రజలున్
భంగులుభంగులు పిలుచుట, కంగారునెకాదు వారి కలయిక దెలుపున్.

గంగమ్మ వలనల్లగాజుల రవళిలో, గంగమ్మ అఱసీలికన్నుల మగతలో
రంగన్నరుచిచూచు రాగులఅంబలే, హాయైన భక్ష్యభోజ్యాల మఱపించున్.

చూపులేగాని మాటల జోలిబోక, వలపులేగాని వాంఛల వంకబోక,
వనిత్వరలెకాని సరసాలపాలుగాక, గబగబాముగియించి రంగన్న వెడలె.
కొడవలి పగ్గము చేకొని, నడచెన్ రంగన్న కొండనడుమకు, ప్రొద్దున్
గడచుచునున్నది, రావలె వడివడిగా— మోపుమేత వట్టిమాటలా ?

ఊరికి చేరువనే గల, దోరగ ఒకకొండ, దాని దొరువుల వెంటన్
చేరగవలె నెత్త, మ్మాచేరువనే పెద్ద యడవి చిక్కగ నుండున్.

ఒకడా యిద్దఱ ! చాలమంది తమకెంతో కొంత ఆపూట జీ
వికకుం దోడ్పడునంచు వత్తురు సరే ! వేయేండ్ల కొక్కొక్క వా
న కదా ! అక్కడమాత్రమెట్లు గఱికైనా పుట్టు ? ఏపాత చె
ట్లకు గానీ చివురేది ? పచ్చనలు తాటల్ దీసినా చూడమే !

చినుకులు పడనేపడితే, అనుమానము లేదు గ్రామమంతా సాకున్
వెనుదీయదు మల ! కావలసినవన్నియు నడవిలోన చిక్కును సుమ్మా.

కానీ, ఎపుడో ఎచటో, నానుపువానైన పడిననాళ్ళన్ కొండల్
వేసవి విరియన్, మిన్నులచానవలెన్ గానవడును— చాయదేలుచున్.

కాసేపురాల్చిన గంపలకొలదిగా కమ్మని కలివిపండ్లమ్మవచ్చు,
కొంతసేపేచాలు కొల్లలుకొల్లలు బలసకాయలు గంపబట్టవచ్చు,
ఇంతసేపేచాలు నెన్నైన రేణగాయలు కోసుకొని అమ్మనైనవచ్చు,
ఒకయింతసేపె ఓపిక గోసుకొన్నచాల్, సీమచింతల నోడిజేర్చవచ్చు,
పీనియాదరువున నూరిలోని, పేదచానలెందఱో ఆనాటి సాదమునకు
చాలినంత గడింతు రాకాలములను, కాయగసురులకేమి? చాలామెదొరకు.

మిద్దెమేడలకేకాదు మిన్నుదగులు మేటిభవనాలకైన మేల్మేలి కట్టె
దొఱకుచుండునిచ్చట, కాని మెఱకవట్టి ఎండిపోవుచు నున్న దాయింతయడవి.

తిండికిచాలని కక్కుఱితిం దావలవలప లనక తేపతేప, కొ
ట్టం డసిలెను చిక్కనికొండయడవి; అగ్గిపడుట కొంతనశించెన్.

తేనెతెట్టెలతోచాలు తెలిసియున్న చాలసాధించవచ్చు, నచ్చటి రకాల
ఆకులేచాలు కొందఱి ఆకలణచు, ఉకులేతీర్చు కొందఱి పీకులాట.

మడకమొఖలు కాడిమానుదాకా, గొఱ్ఱుతుంటమొదలు మేడితోక దనుక,
బండికుండమొదలు బారునొగలదాక, కొండలోనె దెచ్చుకొనగవలయు.

కావలివారి కన్నుగవగప్పి, ఒకప్పుడుపట్టుకొన్న నే
పావలా అడ్డుగో వదలుపట్టునెఱింగి, మఱెంతతప్పినన్
చావడిలోని కీడ్చుకొని చన్నసరే అనుకొన్నవారె, ఏ
దో విధిలేక పోదు, రదియున్ కొడవంటిని దోచు నెప్పుడో.

కానీ తప్పనిసరిదై, ఈనాటికిగూడ కొండఅల్లే, యితడున్
కానకు బోవును; చుట్టఱికానికి దాయాది యితను గ్రామస్థులకున్.

గడ్డిమోపుదెచ్చు, కాకున్నకట్టెలమోపుదెచ్చు, నదియునోపకున్న
మొద్దుకొట్టితెచ్చి మునియప్ప కమ్మును-మడకొ బడకొ ఏదొ మిడుకు—మనుచు..

పొలముపనిలేని రోజు లప్పుడు తనెట్లా బ్రదుకవలెగద? కూలికి బ్రాలుమాలి
కాదు! పనియేది ? ఏడాదికంతకొక్క మూడు నెలలేపనుల్; కడముట్టు-టెట్లు ?

దొరికినగడ్డీగాదము, బరబర గోసుకొని, గోగుపగ్గము బిగియిం
చి, రయమ్మున నడిప్రొద్దున, విరవిరలాడుచును వచ్చి,వేసెన్ మోపున్.

ఎర్ర టెండప్రొద్దు; ఏడుమూరల గడ్డిమోపు మెడలమైన; మూడుమట్ల
లోతు కనులు; పొట్టలో పీపున జేరెను—వగుడువోలె నతడు వణకుచుండె.

అనిమిష మతని జూచిన నేనరమానవుని గుండెలే యయినన్, లో
కానికి శాప మిదేమని, వేనోళ్ళను విచ్చియేడ్చి విలవిలలాడున్.

గిరగిర కన్నుల నీరుందిరుగగ గంగమ్మ, చెఱగుతీసి యొత్తుచున్
చరచర లోనికి వెళ్లెను, పురుషుడు తనకంటెనీరు పోల్చు నటంచున్.

మగడు కొండకువోయిన మరునిమునమె, గబగబా లేచి గంగమ్మ, గవినివారి
వడ్లదంపకమున, దనవంతు తవ్వ ముగ్గుచెన్నంగివడ్లు ముమ్మాఱుజేసి—

చేట నార బెట్టి, శాటమీదేయున్న చక్కరోటిలోన చక్క దంచి,
కుండమెసరు వెట్టి, కుతకుతమనిపించి, చింతకాయ దంచి చిప్పవెట్టె.

పాంతనీళ్లను దెచ్చి రవంత వంగి నిలుచుకొన్న రంగన్నపై నిమిరినిమిరి
కడుగుచున్న ఆయిల్లాలి కరయుగమ్ము, వేయి సంజీవనుల మేళవింపుసుమ్మ!

ఆ నిర్మల ప్రేమ హస్తసంస్పర్శలో, మానిపోయిన వేమొ వానిగాయములు,
లోని ఒక్కొకయెముక హూనమైయున్న, వానితీపులు కొంత వదలినట్లయ్యె.

ఇన్ని యిడుములు నీకోసమే భరించుచుంటి నని ఆతడనడు; నీసుఖముకొఱకె
బ్రదుకుచుంటి నటంచామె పలుకదెపుడు-మాటలేటికి? మనసులో మరులు పొరల.

అతని యడుగుల చప్పుడే యామె మొగము నింతవిప్పార్చు, మాట రవంత విన్న
జాలు, కన్నులలో వసంతాలు విరియు, చూచెనా యిక నిలువెల్ల సొక్కిపోవు.

మూడునాలుగు మాటలే, మూడువేల ప్రేమగీతాల ఆవేగసీమ దాటు?
హృదయముల్ మాటలాడుకో: మొదలువెట్ట, నాల్క నటునిటు నాడించు నాథుడెవడు?

చూపులతోనే వలపుల, రూపు దిద్దుకొనుచు,
నాపడంతి బువ్వ బెట్టె, దాపున గూర్చొనుచు.

సశేషం

# లోకోత్తరానందము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

(గత సంచికతరువాయి)

## 9

దృశ్యము, శ్రవ్యము నను రూపకమును క్రీడనీయకమని భరతుడు పిలిచినాడు. క్రీడ అనగా ఆట. నాట్యాది సహితమగు లలితకళలను క్రీడగా, లీలగా, కొందరు వ్యవహరించినారు. భావనావ్యాపారమునకు క్రీడలోవలె స్వేచ్ఛాసంచారము గలదని "కాంట్" (*Kant*) పలికినాడు. భావనచే ననిశ్చితములైన భావములు బుద్ధిగ్రాహ్యములై ఉచ్చరింపబడి రసచర్వణ యనబడు ఆనందము నొసగుచున్న వనినాడు. కాని అనన్వత్వ సంబంధమున భావమును రూపోపహితముగా చేయు క్రీడయే రసచర్వణ యని "షిల్లర్" (*Schiller*) చెప్పినాడు. అనగా పరిచ్ఛిన్నము, ఇంద్రియగ్రాహ్యమునగు రూపమును అపరిచ్ఛిన్నము, ఆత్మావేశ నిష్ఠము నగు భావముతో చక్కగా అన్వితము చేయు క్రీడయే రసచర్వణలో గలదని తాత్పర్యము.

క్రీడయని వ్యాఖ్యానించబడు ఈ రసప్రవృత్తిని "స్పెన్సర్" (*Spencer*) మరియొకరీతిగా వివరించినాడు. క్రీడలో కన్పించు ప్రవృత్తులు గాని, రసమున కన్పించు ప్రవృత్తులు గాని జీవిత పరిణామమునకు సాక్షాత్తుగా ఉపకరించునవి గావు. అనగా మానవ జీవితమున కనుపకరమై కన్పించు అనవసరమగు శక్త్యుత్సాహములు క్రీడద్వారా, లలితకళలద్వారా బహిర్గతము లగుచున్నవి. క్రీడలో నధమ శక్త్యుత్సాహలను, లలిత కళలలో ఉత్తమ శక్త్యుత్సాహములను మనము వమనము చేయుటచే మనలో మిగిలిన శక్త్యుత్సాహములకు సరియైన నివృత్తి కుదురుచున్నది. జీవిత పరిణామమునకుపకరించజాలని ప్రవృత్తియే రసప్రవృత్తి. ఇట్లనుపకారకమగుటచే రసచర్వణసుఖమయమగుచున్నదని ఇతని వాదము.

అతిప్రయత్నముమీద సంపాదించిన శక్తి యను సౌందర్యవృత్తితో మానవు డితరులకు సుఖము నొసగ గలుగుచున్నాడని "లాంగె" (*Lange*) ఈ వాదమును వ్యాఖ్యానించినాడు. బుద్ధిపూర్వకముగా మనలను మనమే మోసపుచ్చుకొనుచున్న కావ్యానుభూతిలో నిరపేక్షమగు ఆనందము కలుగుచున్నది. ఈవిధమగు భ్రమయే రసచర్వణలో నతిముఖ్యమైనదగుటచే బాలురకు క్రీడలవలం దానందము కలుగునట్లు పెద్దలకు లలితకళలలో ఆనందము వచ్చుచున్నదని భావము. ఈవాదమును "గ్రూస్" (*Groos*) కూడ అంగీకరించినాడు.

"షిల్లర్" యొక్క క్రీడావాదమునకే దుర్గతిని పట్టించిన ఈ విమర్శకులు స్థాయ్యాత్మికమగు బాల క్రీడకు భావాత్మికమగు పెద్దలప్రవృత్తికి గల భేదమును విస్మరించుచున్నారు. ఆటలలో గల ప్రవృత్తి కావ్యజగమునుగాని, కావ్యమునుగాని సృష్టించ గల శక్తితో సమన్వితమై కన్పించుట లేదు. ఈ ఆటలలోని ఆనందమున హృదయసంవాదముకూడ గానరాదు. పైగా ఆటలోని ప్రయోజనము పరతఃసిద్ధము. కావుననే క్రీడనీయకమనగా చిత్తవిక్షేపము, చిత్తవికాసము నని అభినవగుప్తు డర్థము చెప్పినాడు. అనగా క్రీడనీయకమగు లలితకళయందు తత్త్వముపహితముగా ప్రదర్శించబడుటచే సత్యానృత మిథునీకరణము సిద్ధించుచున్నది. కావున శుద్ధ బుద్ధ ముక్తస్వభావము గల తత్త్వముయొక్క ప్రధానాభాసలలో సౌందర్య మొకటియని "ఫన్ హార్ట్‌మన్" (*Von Hartmann*) చెప్పినాడు. ఈ సౌందర్యము కేవలము వస్తునిష్ఠము

కాదు, కేవలము మనోవిభ్రమముకూడ కాదు. ప్రత్యక్ష పరిదృశ్యమానవిషయమున సౌందర్యప్రతీతి కలుగుచున్నది. అనగా విషయస్వభావాధీనమై సౌందర్యము ప్రతీతమగుచున్నది. వస్తువు తనంత తానే సౌందర్యము గాక, సౌందర్యభావనకు హేతువగుచున్నది. ఇట్టి సౌందర్యభావము గల ప్రమేయము భావనానుప్రాణిత సంవేదనమున కుపకరించునది. కాని ఈ సౌందర్యభావనలో నుత్పన్నమగు సంచారి భావ మెక్కువకాల ముద్దీపితమై యుండజాలదు. ఐనను సంచారిభావ మిచట భావనచే సమున్మిషిత మగుట వలన తాత్త్వికము, అతి విశదమునగు సంతోషమును లేక సుఖము నిచ్చుచున్నది. ఈ సుఖము బాహ్యప్రమేయముపై ఆరోపింపబడగా ప్రమాతృప్రమేయముల కభేద మేర్పడుచున్నది. కావున నీ వాదము ననుసరించితిమేని వస్తువుతో గాక, వస్తుభావనముతో కవికి, ప్రవృత్తిగలదనవలెను.

ఈ ప్రవృత్తిలో తత్త్వమునకు ప్రతీకగా వస్తువు గలదు. ప్రతీకను వదలి తదుపహితమగు భావమునకు కవి పోజాలడు. ప్రతీక కేవలము బాహ్యస్వరూపము. ఈ బాహ్యస్వరూప ప్రదర్శనలో భావము అస్పష్టమగుటచే కావ్యము నిర్జీవము కావలెను. మహాకావ్యము నిర్జీవముగాగాని, భ్రమగాగాని ప్రతీయమాన మగుటలేదు. కావ్యజగమున కేవలము బుద్ధిగ్రాహ్యములే యగు శుష్కభావములు లేవు. సజీవములై, చేతనములై కన్పడు నీ భావముల నసత్యతా గ్రహించినచో యుక్తియుతమగు సిద్ధాంతము ను ప్రతిపాదింపలేము. కావ్యజగమున కన్పించు నిరపేక్ష భావనలో లోకోత్తరాను భూతిగలదు. ఈ యను భూతిగల జగమే తాత్త్వికమని, మన వ్యావహారిక జగము అతాత్త్వికమని మనకు గల ప్రతీతిని త్రోసివేయుట దుష్కరము. సౌందర్యభావన ప్రమాతృప్రమేయముల సంబంధము ననుసరించి వచ్చుటచే నీ ప్రతీతిని భ్రమయనిగూడ పలుకలేము. అసత్యము, భ్రమాత్మకము నగు విషయమును బుద్ధిపూర్వకముగా సత్యమనుచు తన్నుదా మోసగించుకొను మానవుడు బుద్ధి వైపరీత్యమునకు లోనైనవాడని యెంచవలెను. మానవుని, జగత్తును, చక్కగా అవగాహన చేసికొనుటకై కావ్యజగమును ప్రవేశించుచున్నామని మరువరాదు. ఈ యవగాహనద్వారా మన దృక్పథము మారుచున్నది.

పరిదృశ్యమాన విషయముల కతీతమగు ప్రవృత్తి యనుభూతిలోను గలదు. క్రీడలో సహితము కన్పించు విషయముల కతీతమైన భావావగాహనము కలదని చెప్పవలెను. ఈ అవగాహనలో నభివ్యక్తమగు కావ్యముద్వారా కవికి ఆత్మవిశ్రాంతి కలుగుచున్నది. ఆత్మవిశ్రాంతివలన సుఖస్థితి కలుగుచున్నది. కాని సుఖదుఃఖ సమ్మిశ్రితమైనది క్రీడయగుటచేతను, క్రీడయనగా చిత్తవిక్షేపమని అర్థముండుటచేతను, విక్షేపానంతరము చిత్తవిస్తరవికాసములు కలుగుటచేతను, ఆత్మవిశ్రాంతిని క్రీడగా గ్రహించరాదు.

క్రీడలో స్వేచ్ఛా ప్రవృత్తిగలదని, ఇదే విధమగు స్వేచ్ఛ భావనావ్యాపారమున గలదని చెప్పుచున్నారు. బాహ్యజగము నియబద్ధమైనదని గ్రహించి జ్ఞానాకారమున ప్రతివ్యక్తియు లౌకికజగమును వ్యాఖ్యానించుచున్నాడు. ఈజ్ఞానము సహితము నియమబద్ధమైనదే. కాని ఇట్టి నియమము భావనలో లేదా? ఈ నియమముల కతీతమైన తత్త్వము నన్వేషించునది భావనావ్యాపారము, అనగా భావనావ్యాపార ముపహితమై నియమబద్ధమైనపుడు తార్కికులు చెప్పు బుద్ధియని పిలువబడుచున్నది. కాగా భావనా జగము బుద్ధిగ్రాహ్యములైన నియమములతో సమన్వయించగా లౌకికజగము వచ్చును. ఉపాధులనబడు ఈ నియమములను పరిత్యజించగా బుద్ధికి భావన యనబడు నిజస్వరూపము రాగలదు. కావున భావనను నియమ బాహ్యమనికాని, నియమ శూన్యమనిగాని యెంచుట పొరబాటు. అందుచేతనే స్వేచ్ఛా ప్రవృత్తిగల భావనయే క్రీడయని పలుకునపుడు స్వేచ్ఛాశబ్దమున దోషము కన్పించుచున్నది. ఈ దోషము "షిల్లర్" వాదములో లేదు.

తత్త్వము నుపహితమైనట్లు అవగాహన చేసికొనుటయే క్రీడయని, ఈ క్రీడయే కావ్యహేతువని "షిల్లర్" చెప్పినాడు. "లోకవత్తు లీలా కైవల్యం" అని బాదరాయణుడు పలికినపుడు లీలా శబ్దమునకు నిరపేక్షము, అయత్నసిద్ధము, అనిర్వచనీయము నగు విషయమని అర్థము చెప్పవలెను. అత్యంత విరుద్ధములగు విషయముల కెచట సమన్వయము కలదో అది అనిర్వచనీయమని పిలువబడుచున్నది. కావ్యజగమున బుద్ధీంద్రియము లిట్లు భావనలో సమన్వయింపబడుచున్నవి. ఏవం విధమగు

క్రీడలలో, లీలలలో, జ్ఞానము, మనన నిదిధ్యాసలు, కలవు.

## 10

సంవేదనాధీనమైనది ప్రవృత్తి. సంవేదనము సుఖముగాను, దుఃఖముగాను అభివ్యక్తమగుచున్నది. అనేక కారణములవలన అనేక సుఖములు కలుగుచున్నట్లు కన్పించినను, సుఖము లన్నియు నభిన్నములే. భోజనము జీర్ణమగునపుడు, చల్లగాలి వీల్చునపుడు, మంచిపని చేయునపుడు, కావ్యానుశీలనమున కూడ ఒకే ఒక విధమగు సుఖము కలుగుచున్నది. ఈ ప్రవృత్తు లన్నింటిలోను సంవేదనము కలదు. ప్రతి ప్రవృత్తియు ఇచ్ఛవలన బయలుదేరుచున్నది. ఉద్దిష్టార్థ ప్రాప్తి కాశించు ఇచ్ఛ నెరవేరుటకు మనము సలుపు ప్రవృత్తిలో సహకారి కారణముగా సుఖము గలదు. ప్రవృత్తులలోని భేదముల ననుసరించి ఏకైకమగు సంవేదనము భిన్నభిన్నముగా కన్పించుచున్నది. రూపరహితమగు సంవేదనము ఇచ్ఛా ప్రవృత్తులచే నియంత్రితమై రూపవంతము కాగా బ్రహ్మానుభూతి, ధర్మప్రతీతి, రసచర్వణ అనునవి వచ్చుచున్నవి. ఇది యొక సాహిత్య చార్వాకవాదము.

ఈ వాద మతి ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నది. "దుఃఖా దుద్విజతే సర్వ స్సర్వస్య సుఖమీప్సితం" అని శాంతి పర్వమున గలదు. దుఃఖమును నిరసించుట, సుఖమును వాంఛించుట మానవ స్వభావము. ఇష్టమైనది సుఖము, ద్వేషమైనది దుఃఖము అని శాంతిపర్వము చెప్పునపుడు సుఖ దుఃఖముల కిచ్ఛాశక్తితో సన్నిహిత సంబంధము కలదని స్పష్టము. కావున సుఖ మనుకూల వేదనీయమని, దుఃఖము ప్రతికూల వేదనీయమని న్యాయదార్శనికు లనినారు.

ఈవాదమును విమర్శించుటకు కొన్ని ప్రధాన విషయములను గమనింపవలెను. సుఖము కలుగదని తెలిసికూడా మనము కొన్ని విషయములను వాంఛించుట గలదు. మనోవికాసమును తీసికొని రాగల ప్రతిభావము సుఖవంతమే. భావము సుఖవంతమని యెంచుట మనోవృత్తియైనను, ఈ సుఖవంత మను గుణమును విషయముపై ఆరోపించుచున్నాము. కాగా మన మొకవస్తువును వాంఛించునపుడు వస్తువు సుఖకర మగుటచే దానిని వాంఛించుచున్నామా? లేక మనము కోరుచుంటిమి గనుక వస్తువు సుఖకరమగుచున్నదా? కొన్ని విషయములు సుఖకరములైనను మనము వాటిని కోరుకొనజాలము.

ఒకపనిని జయప్రదముగా నిర్వర్తించినను, ఒక విషయమున సమగ్రత్వమును పొందగల్గినను సుఖము వచ్చుచున్నది; ఉద్దిష్టవిషయజ్ఞానము, తత్ప్రాప్తికై ఇచ్ఛ, ప్రవృత్తి అనువానికి యోగ్యమగు సమన్వయము కుదురగా సుఖము కలుగుచున్న దనవచ్చును. అనగా సుఖమునకు సుఖభిన్నమగు భావముతోగాని, వస్తువుతోగాని సన్నిహిత సంబంధము కలదు. "సుఖము, దుఃఖము అనునవి లేవు. ఇవి కేవలము గుణములు విశేషణములవంటివి. సుఖవంతములైనవి, దుఃఖవంతములైనవియు నగు విషయములే కలవు. ఈ సుఖదుఃఖములు చిత్తవృత్తులతోను, ప్రవృత్తులతోను సంబంధము కలిగియున్నవని అంగీకరింపక పోవుట అజ్ఞాని స్వభావము" అని "ఎఫ్. ఎచ్. బ్రాడ్లీ" (*F. H. Bradley*) పలికినాడు. సుఖమునకు సుఖత్వము సిద్ధించవలెననిన భావానుప్రాణితము కావలెను. కాగా సుఖముయొక్క స్వభావము తదుపహితమగు భావాధీనము. ఈ సుఖము వస్తుసమాశ్రితము, వస్తువు కన్న విలక్షణముకూడ. కావ్యమున మనకు కలుగుచున్న సుఖము శబ్ద, స్వర, భావాదివిన్యాసవశమున వచ్చుచున్నది. బుద్ధీంద్రియములకు సమన్వయమును జూపు శ్రవ్యదృశ్యాత్మకమగు రూపకమున కలుగు సాక్షాత్కార ప్రతీతిలో అనుభూయమానమగు జ్ఞానమే సుఖముగా చెప్పబడుచున్నదని యర్థము.

ఇచ్ఛాసుఖములు సార్థములగు మనోవృత్తులు. ఇచ్ఛితము, సుఖవంతమువగునది బాహ్యజగమున గల వస్తువు. మనము వాంఛించు కావ్యము బాహ్యజగమున గలదు. అనగా వాంఛ ఉద్దేశించు విషయమగు కావ్యము, మనోగతమగు సుఖముకంటె విలక్షణమైనది. సుఖము ననుభవింప జేయగల్గిన విషయమగు కావ్యమునకు ప్రమాతకంటె విలక్షణము, స్వతంత్రము నగు అస్తిత్వము కలదు. సుఖకరమగు కావ్య మనుభూతమగుచున్నది. కాని సుఖమే ప్రవృత్తిలో గల ఉద్దిష్టార్థ విషయమంటిమేని, బాహ్యవిషయ ప్రాప్తి వలన సుఖము సంప్రాప్తమగునని పలుకరాదు. మనోవృత్తియగు సుఖము మనలోనే ఉండుటచే విషయ

ముము లేక ప్రమేయమును అపేక్షించవలసిన అవసరముకాని, అగత్యముకాని లేదు. మనోవృత్తియగు సుఖము, కావ్యగతము కాజాలనపుడు కావ్యానుశీలనమువలన సుఖము కలుగుచున్నదంటె మేవి భ్రమలో పడగలము. కావున నే

"నకహాపణ వస్సేన తిత్తికామేసు విజ్జతి
అపి దిబ్బేసు కామేసు రతిం సోనాధిగచ్ఛతి"

అని ధమ్మపదము పల్కుచున్నది. స్వర్గసుఖము లనుభవించినను కాముకుని రతివాంఛ తరుగదు; అట్లే బంగారము వర్షించినను కోరికలు పోజాలవు.

"నజాతుకామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏవాభి వర్ధతే"

అని అరణ్యపర్వమున గలదు. నేతిని పోయుచున్న కొలది అగ్నియొక్క జ్వాల అధికమగునట్లు ఉద్దిష్టార్థ విషయ ప్రాప్తియైనను కోరికలు క్రమక్రమముగా అధికములగుచున్నవి.

కోరికకు సుఖమునకుగల సంబంధము విచారణీయము. తినంతట దా వచ్చునది సుఖమని చెప్పరాదు. ఏదో ఒక కృత్యము నెరవేరగా సుఖము కలుగుచున్నది. ఈ కార్య నిర్వాణమునకై సుఖహేతుకములగు విషయములను పరిత్యజించుట గలదు. అనగా సుఖమునకు కోరికకు అవినాభావ సంబంధము లేదు. ధర్మవిరుద్ధముగా ప్రవర్తించిన కూడ సుఖము కలుగగలదు. కాని ఇట్లు మనము వర్తించుట కంగీకరించుట లేదు. అనగా సుఖమును అనుభవించునది మానవుడైనను తదనుభూతి ప్రమేయాధీనమని స్పష్టము. కావున నే నొక పద్య మానందము నిచ్చుచున్న దంటె పేని ఈ యానందము పదైకనిష్ఠమగును. పద్యస్వభావము నాశ్రయించుకొనివచ్చున దీ యానందము. వస్తుతంత్రమగు ఆనందము జ్ఞానాకాశమున నే విశ్వజనీనము, పురుషార్థ సంవలిత మగుటచే

"ఏత ద్ధస్మవై తత్పూర్వే విద్వాంసః ప్రజాం న కామయంతే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాయం లోకః"

అని బృహదారణ్యకము చెప్పుచున్నది. ఇచ్ఛాశక్తి పూర్తిగా శమించిన గాని సుఖ మనుభూతము కాజాలదు. కావున "కామ కారేణ చైకే" అని వేదాంతసూత్రము కలదు. సుఖమును ఇచ్ఛాశక్తినుండి వేరుచేయక తప్పదు. నిర్వికల్పక జ్ఞానావగమనమున సుఖమంతర్లీనముగా కలదు.

"యచ్చ కామ సుఖం లోకే
యచ్చదివ్యం మహత్సుఖమ్
తృష్ణా క్షయ సుఖస్యైతే
నార్హతః షోడశీం కలామ్"

అని శాంతిపర్వమున గూడ సుఖమునకు తృష్ణాక్షయమువలన నే సుఖత్వము సిద్ధమగుచున్నదని చెప్పబడినది.

## 11

అకస్మికముగా, ఎక్కడినుండియో వచ్చిపడునవి సుఖదుఃఖములు కావు. సుఖదుఃఖములు మానవ జీవిత నిష్ఠములు. సాత్త్వికమగు సుఖము, రాజసికమగు దుఃఖము జీవితము కన్పరచు భిన్నవృత్తులు. జ్ఞానసంగ జనితము సుఖమని, తృష్ణాసంగ సముద్భవము దుఃఖమని గీతావాక్యము. మానవ జీవితము ప్రవృత్తిపరము. చిత్తవృత్తులలో కన్పించు సంఘర్షణ ఉపశమించనంతవరకు ప్రవృత్తిగలదు. ఈ సంఘర్షణచే నియంత్రితమైన ప్రవృత్తి సుఖదుఃఖములుగా అనుభూతమగుచున్నది. ఒకే ఒక కారణము వలన సుఖదుఃఖములు రెండును కలుగగలవని కరుణరసాస్వాదము చెప్పుచున్నది. అన్యోన్య సంబంధము గల సుఖదుఃఖములను వేరుచేయ లేము. సుఖము లేని దుఃఖము, దుఃఖము లేని సుఖము ఉండజాలవు. కావున నే

"సుఖం సుఖే నేహ న జాతు లభ్యం
దుఃఖేన సాధ్వీ లభతే సుఖాని."

అని సత్యభామతో ద్రౌపది యనినది. దుఃఖము ద్వారా లభ్యమగు సుఖము కావ్యదృష్టియందు కన్పించుచున్నది. సుఖ మతి తీవ్రరూపమును ధరించిన కొలది ఈ తీవ్రత్వము తదంతర్గత దుఃఖమువలన వచ్చుచున్నదని స్పష్టము. దుఃఖానుపేక్ష లేని సుఖమున సుఖత్వమున్నదో లేదో కూడ చెప్పజాలము. అనగా కావ్యానుశీలనమున లోకోత్తరానందము కలుగుచున్నదనునపు డీ యానందమున సుఖదుఃఖములు సమన్వితమైయున్నవని ఎంచవలెను. సా హి తస్య చార్వాక వాదము లనుభవవిరుద్ధము లగుచున్నవి. సుఖ

దుఃఖములు సర్వత్ర సమనుగతములై యుండుటచే రస చర్వణలో సుఖమున్నదని గాని, దుఃఖమున్నదని గాని, చెప్పజాలము. రసప్రతీతియందు సుఖదుఃఖము లున్నను, వీటిని సంవలితము చేసికొని, వీటి కతీతమై యున్న అనుభూతియే కలుగుచున్నది.

రసచర్వణను ఏక ఘనసంవిచ్చర్వణయని చెప్పియున్నాము. ఒకే ఒక రసప్రతీతిలో వివిధ సుఖస్పందనములు కలుగుటలేదు. అనుక్షణము మారుచున్న సుఖము లనుభూతము లగుటలేదు. సుఖానుభూతి యుండుటయే గాక రసప్రతీతియందు "నేను సుఖించుచున్నాను" అను జ్ఞానముకూడ కలదని, పూర్వ సుఖస్మరణ, భావిసుఖాశంస కూడ కలవని చార్వాక వాదములు చెప్పుచున్నవి. అనగా సుఖసంవేదన జ్ఞానప్రవృత్తితో అన్వితమైనపుడే కావ్య మానందదాయకము కాగలదు. సుఖసంవేదనము జ్ఞానప్రవృత్తితో సంవలితము కావలెనని వీటికి విలక్షణమైన విషయముద్వారా ని సమన్వయము కుదురుచున్నదనవలెను. ఈ విలక్షణవిషయమున సుఖము, ప్రవృత్తి అంతర్లీనమై యున్నను, జ్ఞానానుస్యూతమైన సుఖమే అర్థవంతము, ఆశంసాయోగ్యము నగుటచే నిచట జ్ఞానాకారమునకే ప్రాధాన్యము చెప్పవలెను. జ్ఞానరహితమైన సుఖ మసత్ప్రవృత్తికి హేతువగుచున్నదని "ప్లేటో" (*Plato*) చెప్పియున్నాడు. నియమము, యోగ్యత, ఔచిత్యము మొదలగు వాటిచే సంబద్ధమైన సుఖమును జ్ఞానముగానే గ్రహింపగలము. ఏవం విధముగ జ్ఞానము వైశిష్ట్యముతో కావ్యమున ప్రతీయమానమగుచున్నది.

## 12

ఈ యానంద స్వరూప స్వభావ విచారమున మరియొక్క వాదమును పరిశీలింపవలసి యున్నది. సద్యః పరనిర్వృతి, లోకోత్తరాహ్లాదము, చమత్కారము, అలౌకికానందము మొదలగు పేర్లతో చెప్పబడు ఆనందము రసచర్వణలో గలదని ఈ వాద సారాంశము.

దుఃఖసంశ్లిష్టమని చెప్పబడిన సుఖము నీయానంద మాశ్రయించి యుండక తప్పదు. సుఖదుఃఖముల కన్యోన్య వైలక్షణ్యము లేదు. సుఖము సంవేదనాత్మకము. సంవేదనము విషయనిష్ఠమగు భావముతో నన్వితమై రూపవంతము, అర్థవంతము నగుచున్నది. జ్ఞానానుస్యూతమగు సంవేదనమున సార్థమగు సుఖమే కలదని ఎంచుట పొరపాటు. విషయముతో నతి సన్నిహిత సంబంధము లేకుండ సుఖము కలుగజాలదు. కాగా రసచర్వణలో ప్రతీయమానమగుచున్న దనబడు సుఖము జ్ఞానాకారముగా కలదని చెప్పవలెను.

కేవలము ఇంద్రియములకే సంబంధించినది సుఖమని చెప్పగూడదు. సుఖము కేవలము మానసికము గూడ కాదు. ఇంద్రియములు, మనస్సు అన్యోన్య సంవలితములై సుఖప్రతీతిలో కన్పించుచున్నవి. బాహ్యజగమున గల ప్రమేయము సుఖావస్థాకారక మగుటచే సుఖమును మనఃప్రవృత్తియని ఎంచరాదు. ఈ ప్రమేయమున నుపహితమైన భావము లేక జ్ఞానము సుఖము నర్థవంతము చేయుచున్నది. జ్ఞానరహితమైన సుఖమునకు సుఖత్వము లేదని స్పష్టమగుచున్నది.

నిరపేక్షభావన గల రసచర్వణలో కావ్యముగాని, రసముగాని సాధనముగా గ్రహింపబడక సాధ్యముగానే స్వీకరించబడుచున్నది. ఇట్టి రసము స్వతఃసిద్ధము, స్వయంపోషకమునగుటచే ఇచ్ఛాశక్తి ఉపశమించుచున్నది. అలౌకిక చమత్కారాత్మకమగు రసాస్వాదము స్మృత్యనుమాన లౌకిక స్వసంవేదన విలక్షణమని అభినవగుప్తుడు చెప్పినపుడు జ్ఞానావగతి రూపమగు నిరపేక్షభావనయే పరామృష్టమని తెలియవలెను. ఇదేభావముతో

"నఖల్వర్థం కంచిన్నృత్తమపేక్షతే;
కింతు శోభాం జనయతీత్యతో నృత్తం ప్రవర్తితమ్.
ప్రాయేణ సర్వలోకస్య నృత్తమిష్టం స్వభావతః"

అని భరతుడు నాల్గవఅధ్యాయమున చెప్పినాడు. స్వయంపోషకము, స్వయంసిద్ధము నగు నృత్తము శోభాజనకమగుటచే, స్వభావతః జనులందరు నృత్తమున ప్రీతికలిగి యున్నారు.

"సిద్ధై రర్థైః సమంకృత్వా
హ్యసిద్ధోఽర్థః ప్రయుజ్యతే
యత్రశ్లిష్టవిచిత్రార్థా
సాశోభేతి విధీయతే"

అని శోభాశబ్దమునకు పదునారవ అధ్యాయమున భరతుడు అర్థము చెప్పినాడు. సిద్ధములగు అర్థముల

ద్వారా ఇతఃపూర్వ మనవగాహమైన అర్థము శ్లిష్టముగా ప్రయోగింపబడి విశిష్టార్థముతో ప్రతీతమైన శోభయని పిలువబడును. ఈ విశిష్టార్థప్రతీతి జ్ఞానావగతియగుటచే ఆత్మవికాసము కలుగుచున్నది.

## 13

ఆత్మవికాసమనగానేమి ? స్వసంవిచ్చర్వణ రూపము, ఏకఘనమువగు ప్రకాశ మానందసారమగుటచే భావములన్నియు సుఖప్రధానములు. అంతరాయములు నశింపగా కలుగు విశ్రాంతియే సుఖము. ఏవం విధమగు అంతరాయ శూన్యత్వము కన్పించుటచే శోకమున హృదయ విశ్రాంతి గలదు. దుఃఖమున కవిశ్రాంతి రూపము గలదు కనుకనే సాంఖ్యులు రజోగుణాత్మకమగు దుఃఖమునకు చాంచల్యమును ప్రాణమనినారు. రసములన్నిటియందు హృదయ విశ్రాంతి కన్పించుటవలన సర్వరసములకు ఆనంద రూపత్వము సంగీకరించవలెను. కాని వీరరసమువలె ఇతర రసములలో గూడ ఉపరంజకవిషయ వశమున కటుకతాస్పర్శకలదని అభినవగుప్తుడు వివరించినాడు. రసప్రతీతిలో అంతరాయప్రతీతి లేదు. రెండు సంవేదనలకు గాని, భావములకు గాని అన్యోన్యత కుదురనిచో అంతరాయప్రతీతి కలుగగలదు. ఇట్టి అంతరాయము లెక్కడ లేవో అక్కడ సుఖము కూడ ఉండజాలదు. కావున నీ ప్రతీతిని సుఖదుఃఖముల కతీతమగు ఆనందమని యందురు. కావ సందర్భవశమున రసములలో దుఃఖ ప్రతీతి కన్పించవచ్చును. ఈ దుఃఖానుభూతిమగు ఆనందములో నొక అంశమే గాని ప్రధానమైనది కాదు. ఆనందము ననుభవించుటకు మానవు డెన్ని కష్టములకైనను ఓర్చి, యత్నించుచున్నాడు. ఆనంద మతితీవ్రముగా ప్రతీతమగుకొలది దుఃఖముకూడ వైశిష్ట్యముతో కన్పడగలదు. విశిష్టమగు దుఃఖమునకు దుఃఖత్వము ప్రధానము గాదు. కావుననే గర్భసంధిలో నెంతో క్లిష్టత్వము, విషాదము కన్పించినను, ఇది క్రమేణ ఆనందములోకి పర్యవసిత మగుచున్న ఆనందము నర్ధవంతము చేయగలుగుచున్నది.

ఇట్లు ప్రతీయమానమగు ప్రీతి లేక ఆనందము వ్యుత్పత్తిలేక జ్ఞానముకన్న భిన్నమైనది కాదు. ప్రీతి వ్యుత్పత్తుల కేకవిషయత్వము కలదు. విభావాద్యౌచిత్యమువలన వచ్చునది ప్రీతి. తత్తద్రసోచిత విభావాదుల స్వరూపసంవేదనము సమగ్రముకాగా వ్యుత్పత్తి కలుగుచున్నది. కాగా ప్రీతి వ్యుత్పత్తు లనన్యము లని లోచనకారుడు పలికినాడు. ఈ యనన్యత్వము ప్రమాతృప్రమేయముల అభేద ప్రతిపత్తి నాశ్రయించుకొని వచ్చునదగుటచే, అనుభూతిలోగల తత్త్వావగతియే ప్రీతివ్యుత్పత్తులుగా భాసించునని గ్రహించవలెను. తద్ద్వారా సకల జగత్తు కావ్యజగమున సూక్ష్మరూపములో, నిజస్వభావములో కన్పించును. సప్తద్వీపగత భావాను కీర్తన రూపమగు నాట్యమున ఎవరి హృదయగోచరము కాదో, అట్టి జ్ఞానాదికము లేనే లేదని చెప్పవలెనని అభినవగుప్తు డనినాడు. జ్ఞానమనగా ఆత్మజ్ఞానమని అర్థము. సర్వాన్యక్షత్వాంతర్యామిత్వ లక్షణములతోనున్న జ్ఞానము కావ్యజగమున కావ్యమను ఉపాధి ద్వారా అభివ్యక్త మగుచున్నది. రసచర్వణయందు అనుపహితమగు తత్త్వమవగతమగును. దేశకాలాద్యుపాధులతో నున్న వ్యక్తులీ తత్త్వమును అభివ్యక్తము చేయుచు, తత్త్వనిష్ఠులై యున్నవారగుటచే రసచర్వణ ఆత్మశాంతిని చేకూర్చుచున్నది.

గుణాలంకార మనోహర శబ్దార్థశరీరము, లోకోత్తర రసప్రాణముగల కావ్యమున హృదయసంవాద వశమున నిమగ్నాకాంక చిత్తవృత్తి కలుగుచున్నదని అభినవగుప్తుడు పలికినాడు. ఈ చిత్తవృత్తిద్వారా రమణీయతా ప్రతీతి కలుగుచున్నది. రమణీయత యనగా లోకోత్తరాహ్లాదజనక గోచరత; ఆహ్లాదనిష్ఠము, చమత్కార మనబడునదియగు నీ లోకోత్తరత్వము కేవల మనుభవైకవేద్యము. ఇట్టి ప్రతీతి భావనావిశేష మహిమవలన కలుగుచున్నదని జగన్నాథు డనినాడు. భావన ప్రమేయము ననుపహితమగు భావమును లేక జ్ఞానమును అభివ్యక్తము చేయునది. ఈ భావము లేక జ్ఞానము పొందు లాలిత్యోపేతమగు రూపమువలన కావ్యమున కితరవిషయముల కంటె వైశిష్ట్యము కలుగుటచే మహాకవి కాళిదాసు లలితకళలను "లలిత విజ్ఞానము" అనినాడు. ఇట్లు రసప్రతీతిలో జ్ఞానానందములున్నను, ఆనందము జ్ఞానముచే అనుమూల్యతమై కలదని మరువరాదు.

రసప్రతీతిలో కేవల మింద్రియములుగాని, కేవలము బుద్ధిగాని వ్యాపృతములగుట లేదు. రసచర్వణలో ప్రమేయ మనాశ్యర్థసాధకము కాకపోవుటచే నిరపేక్ష

బుద్ధితో గ్రహింపబడుటచే నిచట ఇచ్ఛాశక్తితో సంబంధములేని భావనావ్యాపారము కలదని "కాంట్" (*Kant*) పలికినాడు. ఇచ్ఛాశక్తిని వదలుచున్న భావన, తచ్ఛక్తి సంవలితమగు సుఖదుఃఖము లనుకూడ ప్రధానముగా గ్రహింపజాలదు. పైగా సౌందర్య మనబడు రసము నిరుపహితముగా ప్రతీత మగుచున్నది. ఈ ప్రతీతిలో వాంఛలతో సంబంధము లేని ఆనందముకలదు. అనగా నీ ప్రతీతిలో ప్రమేయమున నభివ్యక్తమగు పురుషార్థము నాశ్రయించుకొని వచ్చునది ఆనందము. కాగా సౌందర్యమున పురుషార్థము గలదని "కాంట్" యొక్క రెండవసిద్ధాంతము. జ్ఞానస్వరూపమగు సౌందర్యము శుద్ధసంవేదన మని "కాంట్" మూడవ సిద్ధాంతమును చెప్పుచు జ్ఞానమునకు సంవేదనకు గల సంబంధమును నిర్వచించలేదు. నియంత్రితమైన ఆనందము సౌందర్యప్రతీతిలో గలదని నాల్గవసిద్ధాంతమును వివరించుచు, ఎట్లు ఆనందము నియంత్రితమగుచున్నదో చెప్పక విడచినాడు.

జాతివ్యక్తులు, సాధ్యసాధనములు, జ్ఞానప్రమేయములు అనునవి ఒకదానితో నొకటి సంబద్ధములై సౌందర్యమున భాసించుచున్నవి. జాతికి వ్యక్తితోను, సాధ్యమునకు సాధనముతోను, జ్ఞానమునకు ప్రమేయముతోను అవినాభావ సంబంధము కలదు. కావుననే జ్ఞానమొక విశిష్టవిధముగా ఉపహితము కాగా సౌందర్యమనబడుచున్నదని చెప్పగలుగుచున్నాము. "సౌందర్యమున గల సంవేదనములు, రూపములు మొదలగు వానిలో పురుషార్థములు, సమన్వయము మొదలగు జ్ఞానగమ్య లక్షణములు కలవు. విషయ సన్నికర్ష, సంవేదనము అనునవి సంవిధభిన్నములై సంవిద్రూపమున ప్రతీయమానములగుచున్నవి. అతీంద్రియమగు తత్త్వము లేక జ్ఞానము ఉపాధుల కతిరిక్తమై పోక కావ్యజగమున ఆయా ఉపాధులయందే ప్రతీతమగుచున్నది. కాగా సుఖము, సంవేదన, చర్వణ యనునవి పరిణతములై, నిజస్వభావముల నందుచు స్వేచ్ఛానియమములను, బుద్ధీంద్రియములను సమన్వయపరచుచు, జ్ఞానమున పర్యవసితములగుచున్నవి" అని "హెగెల్" (*Hegel*) సిద్ధాంతించినాడు. కావ్యానుభూతియందు జ్ఞానమే ప్రతీతమగుచున్నదని, ఈ జ్ఞానమునే లోకోత్తరాహ్లాద మనవలెనని నిశ్చయింపవలెను.

# ఆలోచన - అనుభూతి

"హితశ్రీ"

హాలంతా జనంతో క్రిక్కిరిసింది. కొత్త తెలుగు చిత్రం మొదటి రాత్రి మొదటి ఆట ఆడుతోంది. కథ దకదక సాగిపోతోంది. సన్నివేశాల్లో ప్రతిబింబించే వాస్తవికత కథాసంవిధానంలో ఆసక్తిని కలిగిస్తూండటంవల్ల ప్రేక్షకులు కథాగమనంలో లీన మౌతున్నారు.

యువతీ యువకులు - నాయికా నాయకులు - అన్యోన్యం ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. 'గృహ ప్రవేశం జరిగింది. రాత్రి. నాట్యరాణి నాట్య ప్రదర్శనం. కలవాళ్లు మరి. అందులో, నాయకుడు స్థానిక ప్రముఖుడు. ఔచిత్య భంగం లేదు. నాట్యరాణిని దంపతులకి పరిచయం చేస్తున్నారు.

"ప్రసిద్ధ నర్తకి......" వగైరా, వగైరా.

"పెళ్ళికుమారుడు—పురప్రముఖుడు" వగైరా, వగైరా.

నాయకుడు చిన్నగా నవ్వాడు సవినయంగా.

రాణి — నాట్యరాణి — ఓరగా చూసింది. నవ్వింది. అందులో కొంటెతనం ఉంది.

ఆ నవ్వు!

స్త్రీలకై ప్రత్యేకించిన స్థానంలో ఫస్ట్ క్లాస్ సోఫాలో కూచున్న మనోరమ గుండె గతుక్కుమంది. ఆ నవ్వు ఆమెకి నచ్చలేదు. కొత్తగా పెళ్ళయిన యువతీ యువకులు. వాళ్ల ముందర రాణి అలా నవ్వటం—అన్యాయం.

మనోరమ ముఖం చిట్లించుకుంది.

పరిచయం అయింతరవాత నేపథ్యంలోకి వెళ్లిపోతూ రాణి మరోసారి వాలుగా నాయకుడివైపు చూసింది. అతనూ అదే సమయంలో చూశాడు. ఆమె చిన్నగా నవ్వింది. అతనామెవైపు అలాగే చూస్తున్నాడు.

నాయకుడలా చూడటం ఫస్టు క్లాసులో పురుషుల ప్రత్యేక స్థానంలో కూచున్న రంగారావుకి నచ్చలేదు.

పెళ్లయి రెండు రోజులు కాలేదు.

అతనలా ఆమెవైపు చూస్తాడేం!

నాయిక నాయకుడిని మెత్తగా తట్టింది. అతను ఉలిక్కిపడి ఆమెవైపు చూసి చిన్నగా నవ్వి ఆమె చేతిని తన చేతిలో తీసుకున్నాడు.

రంగారావుకి తృప్తిగా ఉంది.

రంగారావుకి కూడా కొత్తగా పెళ్లయింది. భార్య అందం చూసి మురిసిపోతాడు.

వెంటనే రంగారావుకి భార్య జ్ఞాపకం వొచ్చింది. ఆమె మరెక్కడో లేదు. అదే హాల్లో స్త్రీల మొదటి తరగతిలో సుఖాసీనురాలై ఉంది ఓసారి అటువైపు చూశాడు, ఆమె కనిపించటానికి వీల్లేదని తెలిసినా.

నాట్యం అద్భుతంగా ఉంది. అంటే రంగారావుకని గానీ, ప్రేక్షకులకని గానీ అర్థం కాదు. నాయకుడు ఊరికే తల తిప్పుతున్నాడు. రాణీ అతనివైపు మందహాసంతో చూస్తూ అభినయిస్తోంది.

అలా నాయకుడు తల తిప్పటం రంగారావు కేమాత్రం నచ్చలేదు. తన కంతగా నాట్యం విషయం తెలియకపోవటంవల్ల గానీ, ఎక్కువగా తెలియటం వల్ల గానీ రంగారావుకలా అనిపించిందనుకోటం సరికాదు. నాయకుడలా తలతిప్పకపోతే ఆ వేషధారిస్థానే మరో వేషధారి బుక్ కాక తప్పదని తెలియనంత అనాయకుడు కాడు రంగారావు. అయినా నాయకుడలా తిప్పటం అతని కిష్టం లేదు.

రాణి అలా నాయకుడివైపు చిలిపిగా చూడటం మనోరమకి గుర్రుగా ఉంది.

నాట్యం ఐపోయింది. నాయకుడు తెగదప్పట్లు కొట్టేశాడు—అందరితోపాటు. నాయిక మర్యాద కోసం అరచేతులు రెండూ రెండుమూడుసార్లు కలిపింది.

గ్రీన్‌రూమ్‌లో నాయకుడు రాణిని అభినందిస్తున్నాడు—కాదు—పొగిడేస్తున్నాడు.

అది రంగారావు కిష్టంలేదని వేరే చెప్పక్కర్లేదు. రాణి వయ్యారంగా, విలాసంగా అజంతా భంగిమలతో ఆకర్షిస్తోంది.

ఆ అంగవిన్యాసం మనోరమకి కంటకంగా ఉంది.

నాయకుడిచూపులు రంగారావుకి అసహ్యంగా ఉన్నాయి.

రాణి నాట్యం ఏమంత గొప్పతరగతికి చెందింది కాదు. ఆవిషయం నాయకుడికి తెలుసు. అయినా ఆమెని పొగిడేస్తున్నాడు. కాని పొరపాటున ఓ-చిన్న మాట తూలాడు. రాణి వెంటనే చిర్రు బుస్సుమంది. ముఖం ముకుళించుకుంది.

మనోరమ ముఖం విప్పారింది.

రంగారావు సంతోషించాడు.

నాయకుడు పొరపాటుకి పశ్చాత్తాపపడ్డట్టుగా ముఖం పెట్టాడు.

"మీరు సహృదయతలో స్వీకరిస్తారనుకున్నాను" అన్నాడు.

రాణి వేషం విప్పుకుంటూ—

ఆమె నిర్లక్ష్యధోరణికి మనోరమకి ఏహ్యభావం కలిగింది.

"అదేమిటి? అతనలాగే నుంచుంటాడేం?" అని ముఖం చిట్లించుకున్నాడు రంగారావు.

రాణి వేషం విప్పుకుంటూ నిర్లక్ష్యంగా నాయకుడిదగ్గిరగా వచ్చి విచారకరంగా ముఖం పెట్టి, "మీది రసహృదయం అనుకున్నాను. కాని..." అని ఆగింది.

"క్షమించాలి" అన్నాడు నాయకుడు.

"మగవాళ్లంతా ఇంతే" అంది రాణి.

విస్తుపోయాడు రంగారావు.

మనోరమ ఆశ్చర్యపోలేదు. ఆమెకి కొంచెం జాలి కలిగింది.

"సున్నితహృదయాలని గాయపరచటానికి ఏమీ సంకోచించరు."

"హుఁ" అనుకున్నాడు రంగారావు.

"క్షమించాలి" అన్నాడు నాయకుడు మళ్ళీ.

"మీరు తప్పుచేశారని ఒప్పుకుంటున్నారా?"

"నిస్సంకోచంగా" అన్నాడు నాయకుడు, తనేమీ తప్పు చెయ్యలేదని లోపల అనుకున్నా.

"తప్పుచేసినవాళ్లు శిక్షకి లొంగటం సభ్యత." నాయకుడు నవ్వాడు. "ఏమిటా శిక్ష?"

"రేపు మాఇంటికి టీకి రావాలి" నవ్వింది. నాయకుడూ నవ్వాడు.

ఆ నవ్వులు మనోరమ కేమీ నచ్చలేదు.

రంగారావు కంతకంటే బావుండలేదు.

నాయిక కాఫీ ట్రే తెస్తోంది.

నాయకుడు పేపరు చూస్తున్నాడు.

కాఫీ రెడీ.

నాయకుడు కప్పు అందుకోలేదు. తల నెమ్మదిగా తిప్పి నాయికవైపు చూసి ఏదో సంజ్ఞ చేశాడు.

నాయిక చిరునవ్వు నవ్వింది. కాఫీ కప్పు నాయకుడి నోటి కందిస్తుంటే చెయ్యి పట్టుకున్నాడు.

"ఇష్ !"

కాఫీ కొంచెం రుచి చూసి—

నాయికవైపు కొంటెగా చూసి—

కాఫీ కప్పు ఆమె నోటిదాకా...

రంగారావుకి ఆనందంగా ఉంది.

దిగ్గు—చిన్నది.

ద్వారంవైపుకి కళ్లు పరిగెత్తాయి.

"డాన్ డాన్" అన్నట్టుగా ప్రేక్షకులు ఈల వేశారు.

ప్రవేశం రాణి!

మనోరమ హృదయం గతుక్కుమంది.

నాయిక కాఫీ రుచి చూడలేదు.

నాయకుడి చెయ్యి ఆగిపోయింది.

రంగారావుకి విచారం వేసింది.

టీ కప్పులో తుఫాను. "రావొచ్చునా?" అంది రాణి, కొత్తగా పెళ్ళయిన యువతీ యువకుల్నీ, కప్పుల్నీ చూస్తూ.

"రండి" అన్నాడు నాయకుడు.

"మీ ఆనందానికి అడ్డొచ్చినట్టున్నాను."

"పరవాలేదులెండి." అన్నాడు నాయకుడు కంగారుగా. దేనికి పరవా? ఒళ్లు మండింది రంగారావుకి. అదేంమాట!

రాణి వొచ్చిన కారణం నాయకుడిని మళ్లీ ఇంకోసారి టీకి ఆహ్వానించటానికి—జ్ఞాపకం చెయ్యటానికి. ఆమె శ్రమకి నాయకుడు నొచ్చుకున్నాడు.

"ఒకసారి పిలిస్తే మీలాంటివాళ్లు మాఇళ్ళకొస్తారా?" అంది రాణి.

మనోరమ నిట్టూర్పు విడిచింది.

"అహాఁహాఁ...ఎంతమాట! ఎందుకు రాను?" నాయకుడు సవినయంగా అన్నాడు.

"క్షమించాలి. తీరికలేదు." అని నాయకుడు ఎందుకనడు అని రంగారావుకి కోపం వొచ్చింది.

నాయకుడికీ, రాణికీ జోస్తీ ఎక్కువౌతోంది.

రంగారావు దాన్ని ఏమాత్రమూ ఆమోదించలేదు. ఈ విషయంలో రంగారావు ఏకాకి కాడు. తన చుట్టూఉన్న జనం చిన్నగా చేస్తూన్న వ్యాఖ్యానాలు—రాణీ ప్రవేశించినపుడల్లా చిత్ర విచిత్రమైన ధ్వనులూ రంగారావు వింటూనే ఉన్నాడు.

నాయకుడిమీద చాలామందికి కోపం వొస్తోంది. మంచివాడల్లేనే కనిపిస్తాడే—

నువ్వు నా దగ్గిరికి రావొద్దని గట్టిగా చెప్పెయ్యడేం?

చెప్పేస్తే బాగుండును.

అలా చెప్పేస్తే కథ జరగటం కష్టమని రంగారావుకి తెలియకపోలేదు. కాని ఆ విషయం గురించి అతనేమీ ఆలోచించటంలేదు. ఆలోచించాలని తోచలేదు అతనికి.

టీ కోసం రాణి ఇంటికి నాయికవెళ్లదు. అది ఆమె కిష్టంలేదు. నాయకుడు వెడతాడు. అదీ ఆమె కిష్టంలేదు. కాని ఆమెకి భర్తమీద ఇష్టం. అందుకని అయిష్టం కనబడనీయదు.

రాణితో కబుర్లు—నాయకుడు రాణి ఇంటి దగ్గిర. అతను గడియారం చూసుకుంటున్నాడు మాటి మాటికీ అది రాణికి కోపకారణం.

రంగారావుకి సంతోష కారణం.

"ఆగిపోయిందా?" విసుగ్గా అడిగింది రాణి.

"ఎబ్బే. లేదు."

"మరి అన్నిసార్లు చూస్తారేం?"

"టైమెంతయిందో నని..."

ఏవో కబుర్లు.

మళ్ళీ గడియారంమీదికి నాయకుడి కళ్లు.

"గడియారం తప్పితే ఇక్కడమీకి ఆనందించ తగిన వింకేమీ లేవా?"

చటుక్కున తల పైకెత్తాడు నాయకుడు. ముఖంలో కొంత వింత కనిపించింది. ఆమె ముఖంలోకి చూశాడు. అదే కావాలిసింది—రాణికి.

"క్షమించాలి."

రాణి నవ్వింది.

"అన్నిసార్లు క్షమించమని అడక్కూడదు."

నాయకుడి కేమనాలో తెలీలేదు. గడియారం వైపు చూడటం—పరాయిఇంట్లో పరాయివాళ్ల ఎదుట ఎక్కువసార్లు—మంచిది కాదేమోనని అతని కనిపించి ఉండవచ్చు; గడియారంవైపు మాత్రం చూడటం లేదు. బహుశా నిమిషాలు లెక్కపెట్టుకుంటున్నాడేమో. పరాగ్గా ఉన్నాడు. రాణి ఏదో అడిగితే జవాబివ్వలేదు. ఆమె దగ్గిరగా వొచ్చింది. ఆ అలికిడికి మేల్కొని గాభరాపడ్డాడు. తన పర్టు చెయ్యిమీద అకస్మాత్తుగా రాణి చెయ్యి—

నాయకుడు తికమకపడ్డాడు.

మనోరమ నిరాశపడ్డది...ఈలలూ, కేకలూ!

నాయకుడు 'షాక్' తిన్నట్టు లేచినుంచోడేం? రంగారావు మనసులో అదే ఆలోచన.

నాయకుడి పర్టు చెయ్యి తొలగించి చూసి "ఆరుకి ఆరు సెకండ్లు తక్కువ" అంది. అతని కర్థం కాలేదు. తెల్లబోయి చూశాడు.

"మీరు నిమిషాలు లెక్కపెట్టుకుంటున్నట్టుగా ఉంటే, టైం చెప్పాను."

తన పొరపాటు అర్థమైంది నాయకుడికి. తను పరాగ్గా ఉన్నట్టు కనిపెట్టింది. కనుబొమలు ఎగరేశాడు.

"క్షమించాలి" అన్నాడు తన కర్తమైనట్టు చెప్పటానికి. రాణినవ్వింది. "ఎన్నిసార్లు?"

నాయకుడికీ నవ్వొచ్చింది.

నాయకుడికి అకస్మాత్ గా ఆమె స్పర్శ జ్ఞాపకం వొచ్చినట్టుంది. చెయ్యివైపు చూసుకున్నాడు.

రాణి ఓరగా చూసింది.

ఆ చూపు!

ఆ వయ్యారం!

మనోరమకి అసహ్యం కలిగింది.

అలాగే రాణి చూస్తోంది—నాయకుడి కళ్లూ, తనవీ కలిపేదాకా, నాయకుడు తికమకపడ్డాడు. టైం ఐపోతోంది.

ఇంటివగ్గిర నాయిక చూస్తోంది గడియారం. టైం ఐపోతోంది. నాయకుడు గడియారం చూడకూడదు. పర్సు చెయ్యి గడియారం కప్పేసింది. బీచ్ కి పోయే టైం దాటిపోతోంది. నాయిక మేడమీదనించి చూస్తోంది...

అకస్మాత్ గా జ్ఞాపకం వొచ్చింది నాయకుడికి—బీచ్ ప్రోగ్రాం. భార్య కళ్లలో మెదిలింది—ఎదురుచూపులతో—

రంగారావు సంతోషించాడు.

నాయకుడు మొహమాటస్థుడు. వెళ్లాలి. ఎలా? సందేహిస్తున్నాడు.

ఏమిటలా ఇదవుతాడేం? తక్షీమని లేచి వెళ్ళిపోలేదూ? రంగారావుకి కోపంగా ఉంది.

నాయికముఖం ముకుళించింది.

రంగారావుకికూడా—

క్యాలెండర్ మీద తారీకులు మారిపోతున్నాయి.

అల్లుడికీ, కూతురుకీ పండగ ఆహ్వానం.

నాయకుడికి పనితొందర. తీరికలేదు.

నాయిక ఒంటరిగానే వెళ్లింది.

ఆవిషయం రాణీకి తెలిసింది.

ఆహ్వానం ... పండక్కి. టీమాత్రమే కాదు. డిన్నర్.

నాయకుడికి అంత ఇష్టంగాలేదు.

మొహమాటస్థుడు.

ఆవిషయం రాణీకి తెలుసు — మొదటినించీ కూడా.

ఆ దౌర్బల్యం—

రంగారావుకి కోపకారణం.

ఆ దౌర్బల్యవినియోగం రాణీకి తెలుసు. ఉపయోగించింది.

అన్యాయం అనుకుంది మనోరమ.

ఆ రాత్రి...

మనోహరమైన వెన్నెల.

మేడమీద ఖాళీ డాబాలో ఈజీఛైర్ లో నాయకుడు.

రాణీతో కబుర్లు.

డిన్నర్ గురించి పొగిడేస్తున్నాడు.

తాంబూలం ఇచ్చింది రాణి.

సిగరెట్ స్వయంగా వెలిగించటానికి సిద్ధపడ్డది.

మొహమాట పడ్డాడు—తికమకపడ్డాడు—నాయకుడు.

"అతిథులకి ఆమాత్రం సేవచేస్తే తప్పేంలేదు" అంది రాణి.

ఈజీఛైర్ లో పడుకున్న నాయకుడు ముందుకి వంగాడు మర్యాదగా. రాణీకూడా వంగింది.

"అబ్బా." అంది రాణి.

రెండు తలలూ ఢీకొన్నాయి. ఈలలూ, చప్పట్లూ.

"క్షమించాలి."

నవ్విందామె.

అతనూ నవ్వాడు. "దెబ్బ తగిలిందా?"

"ఊఁహూఁ."

మనోరమకి వొళ్ళు మండింది.

ఎందుకు తగుల్తుంది?

అన్యాయం.

రాణిమీద మనోరమకి అసహ్యం ఎక్కువైంది. రాణీ సిగరెట్ వెలిగిస్తోంది నాయకుడికి.

నాయకుడామెవైపు తేరి పారచూస్తున్నాడు.

నిప్పుపుల్లలు ఆరిపోతున్నాయి.

మనోరమ కళ్లుచూస్తున్నాయి.

మనసుకి పని లేదు. హృదయంలో అనుభూతులు. మనోరమ వేశ్య. చిన్నప్పుడు నాట్యం నేర్చింది. ఇంతవరకూ నర్తకిగా అంత పేరేమీ లేదు. రంగస్థలం మీద చేసిన కొద్ది నాట్యప్రదర్శనలూ ఎక్స్ట్రా హోదాలోనే—ఎవరిట్రూపులోనో. ఓ శ్రీమంతుడి వివాహ సందర్భంలో నాట్యప్రదర్శన ఏర్పాటయింది. తమదే ట్రూపు. పరిచయం చేశారు ట్రూపులో అందర్నీ. ఫలానా ... ఫలానా—"మనోరమ" ఆ శ్రీమంతుడు ఓ చూపు గిరవాటేసి తల పక్కకి తిప్పాడు. ఆమెకి కష్టంవేసింది. ప్రదర్శనలో అందరికంటే ఎక్కువగా ఆకర్షించాలని చూసింది. ఎవరూ తనవైపే చూస్తున్నట్టు లేరు. తనకి సామర్థ్యం లేక కాదు. డబ్బు లేక సొంత ట్రూపు ఏర్పాటు చేసుకోలేకపోయింది. ఆమెకి ఉక్రోషం వొచ్చింది. ఎలాగైనా పైకి రావాలి. సాధించాలి. ఈ శ్రీమంతుడికి నాటకాలూ ఇత్యాదులంటే అభిమానం అని వినికిడి. వొంటరిగా కలుసుకుని సహాయం అడిగింది. అంత మొత్తం సహాయంకాని—పెట్టుబడి కాని—ఇవ్వటం అతని కిష్టంలేదు. అదే పనిగాడు. తళుకుబెళుకులతో ఆకర్షించటానికి ప్రయత్నించింది. కాని కొత్తగా పెళ్లయిన మోజులో ఉండటంవల్ల నేమో తన వలలో పడలేదు. తనకే పేరుంటే—

ఈ విషయమంతా మనోరమ మర్చిపోయిందని కాదు. రాణిని చూస్తున్నంతసేపూ తను మనోరమ కాక మరో స్త్రీ అని ఆమె అనుకోలేదు. అసలామె ఆలోచించింకేమీ లేదు. ఆలోచించే స్థితిలో లేదు. అన్నీ ఏమేమిటో అనుభూతులు.

మనోరమ రాణిని అసహ్యించుకుంటూ ఉంది.

రంగారావు నాయకుడిమీద ఆశలు వొదులుకున్నాడు.

కథ సాగిపోతోంది. సంఘటనలు జరిగిపోతున్నాయి. నాయిక అశాంతితో కుంగిపోతోంది. ఘర్షణ జరగక తప్పలేదు. నాయకుడు ఏదో అన్నాడు. నాయికకి అభిమానం ముంచుకొచ్చింది. పుట్టింటికి వెళ్ళిపోయింది. నాయకుడు పట్టించుకోలేదు. నెలలు గడిచిపోయాయి. అభిమానం విడిచి నాయిక సొంత ఇంటికి బయల్దేరింది. ఇల్లు తాళం వేసిఉంది. చుట్టుప్రక్కలవాళ్లు—రాణితో ఊళ్లు తిరుగుతున్నాడనీ, ప్రస్తుతం వాళ్ళ ట్రూపు ఫలానా ఊళ్లో ఉందనీ. తను ఎప్పుడూ వెళ్లి ఎరగని ఊరు. అయినా పట్టుదలతో వెళ్ళింది. స్టేషన్ దాటగానే ఎలా వెళ్ళాలో, వాళ్లు ఎక్కడున్నారో అనే అధైర్యం లోపల పీకుతూనే ఉన్నా సైకిల్ రిక్షా ఎక్కితే అతనే తీసుకువెడతాడనే ధైర్యంతో ఓ సైకిల్ రిక్షావాలాని కేకేసి అడిగింది. అతను నాయిక వంక కొంచెం అనుమానంగా చూశాడు—ఆమె ధోరణినిబట్టీ, ఆదుర్దానిబట్టీ. 'నిమిషంలో తీసుకెడతాను ఎక్కండి' అన్నాడు. నాయిక రిక్షా ఎక్కి కూచుంది. జనసమ్మర్దం ఎక్కువగా ఉన్న రోడ్లన్నీ దాటిపోతోంది రిక్షా. రాను రాను ఇళ్లుకూడా కనిపించటం లేదు. దారి తప్పినట్టు నాయికకి అనుమానం వేసింది. అడిగింది. ఓ వకిలినవ్వు నవ్వి లేదులెం డన్నాడు రిక్షావాలా.

ఆ నవ్వు—ఆ ధోరణి—ఆ వేగం!

నేల తరగతిలో కూర్చున్న ఓ రిక్షావాలాకి గుండెల్లో గుచ్చుకుంది. కొత్త తెలుగుచిత్రం చూడాలని—రిక్షా అద్దె మూడున్నర గంటలు దండగైనా, సాహసించి హాలువగ్గర ఓ కిళ్లీకొట్టు యజమానిని చూసూండమని—హాలులో కూర్చుని బీడీ కాల్చుకుంటూ వినోదిస్తున్న ఆ ఒకానొక రిక్షావాలా ఏమేమిటో జరగాలనుకున్నాడు.

రిక్షా ఆగింది.

"ఏం?" అంది నాయిక.

వెకిలిగా నవ్వి దిగమని డబాయించాడు—ఆమె విలగల నగలవైపు చూస్తూ.

అన్యాయం.

అసలే కష్టాలు. పైపెచ్చు ఇదొకటి—

హాల్లో రిక్షావాలా బాధపడ్డాడు.

ఏదైనా జరిగి—

తెర నాలుగువైపులూ చూశాడు.

రిక్షావాలా దౌర్జన్యం చేసేట్టున్నాడు. ఏం చేస్తాడో! పాపం నమ్మివచ్చింది.

బీడీ కాల్చటం మానేశాడు రిక్షావాలా.

నేల తరగతి ప్రేక్షకులు—తన చుట్టూ ఉన్న వాళ్లు—తిడుతున్నారు. తనూ తిడుతున్నాడు.

ఎదురుగా టాక్సీ—

ఈలలు, చప్పట్లు—నేల తరగతి ప్రేక్షకుల్నుంచి. ఉద్రేకం ఆపుకోలేక చిరునవ్వుల రూపంలో వొదిలేస్తున్నారు పై తరగతి ప్రేక్షకులు. ఆనంద బాష్పాలు తుడుచుకుంటున్నారు కొంతమంది జేబు రుమాళ్లతో.

టాక్సీ—రిక్షా.

పారిపోయాడు రిక్షావాలా.

బీడీ జ్ఞాపకం వొచ్చింది హాల్లో రిక్షావాలాకి.

టాక్సీలో—నాయకుడూ, రాణీ.

నాయకుడూ, నాయికా పరస్పరం చూసుకున్నారు. పలకరించుకోలేదు. కారు తలుపు తీశాడు నాయకుడు. నాయిక లోపల కూర్చుంది...

కథ జరిగిపోతోంది. నాయికా, నాయకుడూ, రాణీ ఒక్క ఇంట్లోనే ఉంటున్నారు. లేక, నాయకుడూ, రాణీ ఉన్న ఇంట్లోనే నాయికకూడా ఉంటోందనటం సమంజసం. ప్రస్తుతం నాయిక హోదా అటువంటిది. అదే ఇంట్లో రాణీ తాలూకు వరస సోదరుడు—ట్రూప్ వ్యవహారాల్లో జోక్యం కల్పించుకుంటూ ఉండే వ్యక్తి—కూడా ఉంటున్నాడు.

నాయికకష్టాలు పడుతోంది, మానసికంగా ఆమెకి అనేక అన్యాయాలు జరుగుతూన్నాయి.

జనం—హాల్లో ప్రేక్షకులు—సానుభూతి చూపిస్తున్నారు. అన్యాయానికి బాధపడుతున్నారు. అన్యాయాన్ని ఖండిస్తున్నారు.

నాయికకష్టాలు చూసి రాణీసోదరుడు, ఓ ఉపన్యాసం ఇచ్చేశాడు నాయికకి. ఆమెస్థితిచూస్తే తనకి మనసూ, హృదయమూ ద్రవించి ఏకమయాయన్నాడు. ఇహ కష్టాలు పడక్కర్లేదన్నాడు. భారతనారి తిరుగుబాటు చెయ్యాలన్నాడు. నాయికలాంటి చదువుకున్న యువతి—నవీన విద్యాప్రవీణురాలు — ప్రవర్తించే విధం అది కాదన్నాడు. కుక్కకాటుకి చెప్పుదెబ్బే నన్నాడు.

నాయిక వింటోంది.

రెండో తరగతి ప్రేక్షకుడైన రామ్మూర్తికి ఈ ఉపన్యాసం ప్రమాదకరంగా కనిపించింది. ఆమె దౌర్బల్యాలమీద వొత్తిడి తెస్తున్నాడు — దురాత్ముడు, విలన్.

రామ్మూర్తికి వొళ్లు మండుతోంది.

తనామెని ప్రేమించానన్నాడు విలన్. బాగా ఆలోచించుకునే సమాధానం ఇవ్వమన్నాడు. అక్కర్లేదంది నాయిక.

రామ్మూర్తి సంతోషించాడు.

తనని నాయిక అర్థంచేసుకోవాలని ప్రాధేయపడి, అది ఆమెకే మంచిదని సలహాఇచ్చివెళ్లాడు విలన్.

బెదిరిస్తున్నాడు రాస్కెల్—అనుకున్నాడు రామ్మూర్తి. అలా అనుకోటం రామ్మూర్తి కొంచెం భయంభయంగా అనుకున్నాడు.

నాయిక జీవితం పాడైపోతుందేమోనని భయం. అలా అనిపించగానే హృదయంలో బెరుకుతో పాటు మనసులో లీలగా తన గత జీవితంలో ఓ సంఘటన మెదిలింది. కాని రామ్మూర్తి ఆలోచించటానికి సాహసించలేదు.

రామ్మూర్తి ఆ ఊరికి కొత్తగా వొచ్చిన బి. ఇడి. అసిస్టెంట్. అంతకి ముందున్న ఊరినించి ఓ చిన్న ఉపద్రవం తప్పించుకోటానికి ఈ ఊరు వొచ్చేశాడు. మరేంలేదు. ఏదో బుద్ధిచాంచల్యంవల్ల ఎదురింటి ప్లీడర్ గుమాస్తాగారి రెండో భార్యతో వ్యవహారం జరపటానికి ప్రయత్నిస్తే ఆయన తన్నించినంత పని చేశాడు. ఆ హడావిడికి బతుకు జీవుడా అని ఇలా వొచ్చేశాడు.

విలన్ ప్రయత్నాలు మానలేదు.

ఆ సాయంత్రం—నాయకుడితో చెప్పింది—విలన్ ఇలా బాధిస్తున్నాడని. "మహా పతివ్రతలా నన్ను పట్టుకుని వేళ్లాడమని ఎవడేడిశాడు. కాపలా కూచోమంటావా?" అన్నాడు. అభిమానం ఘోరంగా దెబ్బతింది నాయికకి.

నాయకుడూ, రాణీ సినిమాకి వెళ్లారు.

నాయిక ఆలోచిస్తూ కూర్చొంది.

నాయిక తిరుగుబాటు చెయ్యాలని వాదిస్తుంటే—అంతరాత్మ సహనం కావాలంటోంది.

ఆ సమయంలో విలన్ దగ్గిరగా వొచ్చాడు. కాళ్లమీద పడ్డాడు దాదాపు.

రామ్మూర్తి ఊపిరి బిగబట్టాడు.

నాయిక భవిష్యత్తు?

ఆమె దౌర్బల్యం అన్యాయంగా వినియోగించుకుంటున్నాడు విలన్. ఆమె జీవితం!

విలన్ ఆమెని దగ్గిరికి తీసుకోబోయాడు— "డాన్‌డాన్".

బలంగా తోసేసింది నాయిక.

శేష్—రామ్మూర్తి గట్టిగా ఊపిరివొదిలి తీరిగ్గా కూచున్నాడు.

దౌర్జన్యం చేస్తున్నాడు విలన్—

బుద్ధిచెప్పింది నాయిక

రామ్మూర్తికి సంతోషంగా ఉంది.

కథ చకచక సాగిపోతోంది.

అన్యాయాలు — అధర్మం — పైశాచ్యాలు— ఘోరాలు. ఎన్నెన్నో జరుగుతున్నాయి.

ప్రేక్షకులు సానుభూతి చూపిస్తున్నారు. అన్యాయం, అధర్మం జరిగినప్పుడల్లా నిరసిస్తున్నారు. ఏదైనా అడ్డురావాలని కోరుకుంటున్నారు.

న్యాయం, ధర్మం జయించినప్పుడల్లా— సంతోషం తెలియచేస్తున్నారు.

చప్పట్లూ, ఈలలూ,

జేబు రుమాళ్లూ, చిరునవ్వులూ.

కోపగిస్తున్నారు.

కళ్లు తుడుచుకుంటున్నారు.

నాయిక కష్టాలు చిత్రం ఆఖరుకి తుదముట్టాయనీ చెప్పనక్కర్లేదు. నాయకుడు పశ్చాత్తాప పడ్డాడనీ చెప్పాలిసిన అవసరం లేదు.

చిత్రం పూర్తి కావస్తోంది.

రంగారావు లేచాడు. మళ్లీ జనం మూగితే పోవటం కష్టం—అందులో ఆడవాళ్ళతో. కారు డ్రైవర్ నిద్రపోతూ ఉంటాడేమో. గబగబా హాల్లోంచి బయటికొచ్చాడు రంగారావు. దూరాన కారుంది. డ్రైవర్ కూడా అక్కడే ఉన్నాడు. స్త్రీల గేటుదగ్గిర నుంచున్నాడు. ఎంతసేపటికీ రాలేం? పూర్తిగా చూడటాని కేముంటుందనో. కామెడీయేగా. అన్ని చిత్రాల్లోకి మల్లేనే, వొచ్చెయ్యకూడదూ, త్వరగా. ఆడవాళ్లతో వస్తే ఇదే తంటా.

ఒక్కొక్కరే వొస్తున్నారు.

ఆ వొచ్చే దెవరు, తన భార్యేనా? కాదు— ఎవ రీమె? ఎక్కడో చూసినట్టుందే! ఎక్కడబ్బా? ఎప్పుడు?

ఆమెవైపు జ్ఞాపకం తెచ్చుకోటానికి తదేకంగా చూస్తున్నాడు రంగారావు. ఆమె తలెత్తి చూసింది. ఎందుకు అలా చూస్తున్నాడు తనవైపు రంగారావు? రంగారావు! దగ్గిరగా వొచ్చింది. రంగారావు పరధ్యానంగా ఆమెవైపు అలా చూస్తూనే ఉన్నాడు.

ఆమె ముందు కొచ్చింది. రంగారావుకి దగ్గిరగా నిలబడింది.

"ఏమిటలా చూస్తున్నారు? మర్చిపోయారా?"

రంగారావు బిత్తరగా చూసి, పరధ్యానంనించి మేల్కొని తొట్రుపాటు పడసాగాడు.

"నేనండీ, మనోరమని. మర్చిపోయారల్లే వుంది. మాలాంటివాళ్లు మీకు జ్ఞాపకం ఉంటారా ఏమిటి గాని—"

"ఎబ్బెబ్బె....జ్ఞాపక మే." ఇప్పుడు తెలిసింది రంగారావుకి. ఆమె నర్తకి మనోరమ. తన జ్ఞాపక శక్తి హీనతకి కొంచెం చింతించాడు.

మనోరమ మాటలు కలిపింది.

"ఇలా నిలబడ్డారేం. మీవాళ్లకోసమా?"

"అవునండీ."

ఎలెక్ట్రిక్ లైటు వెలుతురులో క్రేప్ సిల్కు చీర మెరుస్తోంది. అలాంటి చీర తన భార్యకి కూడా కొనాలనిపించింది రంగారావుకి. తన కలాంటి విషయాలు పట్టవు. కాని ఆ సమయంలో అది చాలా బావుందని పించి కొనాలనిపిస్తోంది. ఆ మాటకొస్తే ఆ వెల్వెట్ చోళీ మాత్రం! నిగనిగలాడుతూ—ఎర్రగా—కళ్లు జిగేల్ మన్నాయి రంగారావుకి.

మనోరమకి ఆ సంగతి తెలుసు. వయ్యారాలు వొలకబోస్తూ అందాలు విరజిమ్ముతోంది.

ఇదేమి టివాళ అనుకోకుండా రంగారావు తనవైపు అలా చూస్తున్నాడేం? అతన్ని ఆకర్షించటానికి తను ఎన్ని ప్రయత్నాలు చేసింది! అప్పుడేమీ తోచని మనిషి—!

మనోరమ నిజంగా అందంగల మనిషేననిపించింది రంగారావుకి. నిజానికి తన భార్యకంటే కూడా. నర్తనలో కృషిచేసినమనిషి కాబట్టి శరీరం

తీగలా ఉంది—నాజూకుగా. ముఖంలో మంచి కళ కనిపిస్తోంది. లావణ్యవతి.

మనోరమ చేతిగడియారం చూసుకుంది. అది గమనించాడు రంగారావు. అప్రయత్నంగా గేటు వైపు చూశాడు—తన భార్య వొస్తోందేమోనని. ఇంకా రావటం లేదు. 'పానీలే నెమ్మదిగా వొస్తుంది.' అనుకున్నాడతను.

"ఎక్కడా ప్రదర్శన లివ్వటం లేదా?" అడిగాడు, ఏదో అడగాలి కనుక.

"ఏదీ, మీలాంటి గొప్పవాళ్లు ఏర్పాటు చేయిస్తేగా."

నవ్వాడు రంగారావు.

"అయినా, మాలాంటి చిన్న చిన్న వాళ్ల మీద ఉంటుందా ఏమిటి లెండి మీ చూపు."

కొంచెం చివుక్కుమంది మనస్సు రంగారావుకి. "పాపం." అనుకున్నాడు. బయటికి "అదేం మాట." అన్నాడు. మనోరమ ప్రత్యుత్తరంగా నవ్వింది, కావాలని కొంచెం కులుకుతూ. క్రేప్ సిల్కు భుజంమీద సరిగా ఆనటం లేదు. ఆమె సరిచేసుకుంది-అంటే. భుజం పైకి లాక్కొని రెండో కొన చుట్టూ తిప్పి చేత్తో పట్టుకుంది. కాని...విద్యుద్దీపకాంతిలో వెల్వెట్ చోళీ మెరుస్తోంది. వెల్వెట్ చోళీమీదికి మనసుపోయిన రంగారావుకి అది ఆహ్లాదకరంగా ఉంది...

మనోరమ సవరించుకుంది—సరిగా.

సిగ్గుపడ్డాడు రంగారావు.

గేటువైపు చూశాడు, కొంచెం భయంగా—అయిష్టంగా.

"కారు తెమ్మన్నారా, సార్"

డ్రయివర్ అడుగుతున్నాడు. అటుచూశాడు.

"అమ్మగారు కొంచెంసేపటికిందే వెళ్లిపోయారు. తల నెప్పిగా ఉందని."

'ఓ' రంగారావుకి ఎందుకో కొంచెం తేలికగా ఉంది.

"రండి. లిఫ్టు ఇస్తాను."

"థాంక్స్."

చీకట్లో దూసుకుంటూ పోతోంది కారు...

జనం కిటకిటలాడిపోతున్నారు, హాలుముందు.

రిక్షాలు, బళ్లూ, జనం...

జాలిగా చూస్తోంది ఒక అమ్మాయి. పల్లెటూరి మనిషిలా కనిపిస్తోంది. చిన్న వయస్సు. ఏదో పోగొట్టుకున్నట్టుగా చూస్తోంది.

"రిక్షా అమ్మగారూ." "రిక్షా" "రిక్షా"

కేకలు.

"స్టేషన్‌కి వొస్తావా?"

ఒంటరిగా స్టేషన్‌కి — ఆ అమావాస్య రాత్రి. ఏ ఊరినించి, ఎక్కడికి...

రిక్షావాలాకి సందేహం కలిగింది.

"ఎక్కండి" అన్నాడు.

"ఎంత...?"

మాటవరసకి అడిగినట్టుగా అడిగింది. ఆ అమ్మాయి ఎక్కడో, ఏదో ఆలోచిస్తోంది.

"మీచిత్తం" బేరంలో అతని కిష్టం లేదు. పోటీ. పైగా సినిమాకెళ్లి మూడున్నరగంటల బేరం పోగొట్టుకున్నాడు. ఏదో విధంగా కూడెదియ్యాలి...

ఆ అమ్మాయి రిక్షా ఎక్కింది.

రిక్షావాలా హుషారుగా ఉన్నాడు. సినిమా మంచి హుషారిచ్చింది. బాగా తీశారనుకుంటూ, సినిమాలో ఘట్టాలు జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

"ఇటేనా స్టేషన్?"

అకస్మాత్‌గా వినిపించింది అతనికి. ఊహాలోకం నించి తిరిగి "ఇటేనండి." అన్నాడు. ఆ అమ్మాయిని గురించి ఆలోచిస్తున్నాడు. చెప్పకుండా ఇంటినించి వొచ్చిన రకం అని తెలుస్తూనే ఉంది. ఏ రెండో పెళ్లి సంబంధం వొద్దనో—లేక ఏ పోట్లాటవల్లో. నగలతో ఒంటరిగా—

"ఇటేనా స్టేషన్?"

మళ్లీ అడిగింది. రిక్షావాలా 'అవు'నన్నాడు. వెంటనే అతనికో కొత్త ఆలోచన కలిగింది. అటు వెడితే స్టేషన్ వొస్తుంది—మరో పక్కకి వెడితే—నిర్జనం. నగలు! ఒక్క నగచాలు—జీవితం హాయిగా కొన్నాళ్లు...ఒక్కటి చాలు...అవన్నీ ఎంత ఖరీదు చేస్తాయో!

రిక్షా పోతోంది.

ఆ అమ్మాయికి అనుమానం వేస్తోంది.

జనం కనిపించరేం? ఎవరైనా జనం తిరుగుతూ ఉంటే బావుండును. ఎదురుగా ఎవరన్నా వొస్తే ఆపి, 'స్టేషన్ ఇదేనా?' అని అడిగితే—

"నేను వొచ్చిన రోడ ఇదికాదే." అనుమానంగా అంది.

"అది వొచ్చేదారి, ఇది వెళ్లేదారి."

కొంత తృప్తిపడ్డది... కాని...

రిక్షా పోతూనే ఉంది.

ఎవరూ జనంగాని — బండీగాని ... టాక్సీ గాని, టాక్సీ!—

ఏమీ ఎదురురాకుండా ఉంటే...

రిక్షావాలా ఆలోచిస్తున్నాడు...

రంగారావు గారి కారు పరిగెత్తుతోంది.

చీకటి. రంయిమని చలిగాలి కొడుతోంది కారు కిటికీల్లోంచి. గతుకుల రోడ్డు.

బ్యాక్ సీటులో కూర్చున్నారు రంగారావూ, మనోరమా.

మనోరమ అలా నిర్లక్ష్యంగా సీటుకి చేరగిలబడి కూచుంటుందేం?

రంగారావుకి ఏమిటోగా ఉంది.

మల్లెపూల వాసన.

మనోరమ మాట్లాడుతుంటే రంగారావు వింటున్నాడు—అర్థంచేసుకుని అంతగా అతను పట్టించుకోటం లేదు. ఆమె ఏదో చెబుతోంది. అతను వింటున్నాడు. ఆమె గొంతు సన్నగా బావుంది. వినాలనిపిస్తోంది.

గాలికి చీరచెంగు ఆప్పుడప్పుడు రంగారావు ముఖానికి కొట్టుకుంది.

"సారీ" అంది.

'పరవాలేదు' అన్నాడు.

కారు కేదో అడ్డొచ్చింది. సడెన్ బ్రేక్.

రంగారావు తూలాడు. మెత్తగా......భయపడ్డాడు రంగారావు.

"సారీ"

"పరవాలేదు." మనోరమ నవ్వింది.

పరవాలేదు! దూరంగా జరగదేం?

దొంగతనంగా మనోరమవైపు చూడాలనిపించింది. చూశాడు. ఆమెకూడా చూసింది. ఆమె కళ్లు నల్లగా బావున్నాయి.

మనోరమకి ఆ విషయం తెలుసు. అలా కళ్లలోకి చూస్తే......చిన్న చిన్న కదుపులకే రంగారావు చెయ్యి తన చేతికి తగుల్తోంది. మనోరమ చిరునవ్వు నవ్వుతుంది. ఈ రంగారావేనా......తనవైపు సరిగా చూడనుకూడా చూడలేదు ఆరోజు! తన తళుకు బెళుకులకి చలించలేదు!

రంగారావుకి మనసులో ఏదో మెదుల్తోంది.

మనోరమ దగ్గిరికి జరగాలనిపిస్తోంది.

ఆమె కలలు కంటోంది—సొంత ట్రూపుతో జేగీయమానంగా—రంగారావు డబ్బుతో...

రంగారావు, పాపం.

కాని పెట్టుబడికావాలి తనకి.

మనోరమ వేశ్య—ఆ విషయం తెలుసు రంగారావుకి. కాని అతను ఆలోచించటం మానేశాడు. పరిస్థితుల్ని అతను అతిక్రమించి వదలచుకోలేదు. విసుగ్గా ఉన్నాడు. సినిమాచూసి అలిసిపోయాడు. మత్తు మత్తుగా...చీకటీ, గాలీ...మనోరమ ఊపిరి వెచ్చగా తగుల్తోంది...

రంయిమనికొట్టాడు డ్రైవర్, సందుతిరగటానికి.

ఆవాలుకి తూలింది మనోరమ!

రంగారావు ఆపాడు—ఆమె జబ్బలుపట్టుకుని.

మనోరమ వెంటనే సర్దుకోలేదు.

'సారీ' అనలేదు.

'పరవాలేదు' అనే అవకాశమే లేదు.

మనోరమ నవ్వింది. రంగారావు నవ్వాడు. ఆమె లేవలేదు. రంగారావు ఆమెచేతులు వదల్లేదు.

కారు దూసుకుపోతోంది — నడిచేవాళ్ళని కవ్విస్తూ...

నడుస్తున్నాడు రామ్మూర్తి.

ఎవరో జనం ఎదురుగా వొస్తున్నారు.

పరకాయించిచూశాడు—ఎలెక్ట్రిక్ లైట్ వెలుగులో.

ఎదురింటివాళ్లు—వాళ్ళలో ఆ అమ్మాయిలేదే!

ఎందుకో! వాళ్లఅమ్మ, తమ్ముడూ, ఇంకా ఎవరో — చుట్టుపక్కలవాళ్ళూ ... ఆ అమ్మాయి ఎందుకురాలేదు! అసలే సినిమాపిచ్చి. మరి...ఆలోచిస్తున్నాడు రామ్మూర్తి.

అపిల్ల ఉత్తర వైపు బాగులదల్లే ఉంది. ఎప్పుడూ అలా ఆ మేడగది కిటికీదగ్గిర నిలబడి పాడుతూ ఉంటుంది—సినిమా పాటలూ, ప్రేమగీతాలు. ఈ ఊరు కొచ్చినప్పటినించీ చూస్తున్నాడు. కథల పత్రికలు చదువుతూ, డాబామీద తిరుగుతూ, కూనిరాగాలు తీస్తూ, రోడ్డుమీద వొచ్చేపోయే జనం చూస్తూ...అప్పుడప్పుడు తనవైపు అలా చూస్తుం దేం? తనూ పాడతాడు. తను పాడుతుంటే అలా నిలబడి చూస్తూ...

రామ్మూర్తికి ఏవేవో ఆలోచనలు సాగుతున్నాయి.

ఫూలిష్ గరల్.

చెప్పేవాళ్లెవరూ లేనట్టున్నారు.

ఎప్పుడో సినిమాఫీల్డులోకి ఉరుకుతుంది. చూడటానికి బాగానే ఉంటుంది. ఏ చిత్రంలోనో బుక్ అయితే...

అతనికి నవ్వొచ్చింది. చిత్రంలో బుక్ కావటం మాటలా?

రామ్మూర్తి ఆలోచిస్తూ, గది చేరుకుని లైటు వెలిగించాడు. బ్రహ్మచారి కొంప. అంటే రామ్మూర్తికి పెళ్ళి కాలేదనికాదు. రెండు సంవత్సరాల కిందటే ఐంది. భార్య ప్రస్తుతం పుట్టింట్లో ఉంది—కాన్పుకి. ఇప్పట్లో వొచ్చే అవకాశం లేదు. అందువల్ల ఓ గది అద్దెకి తీసుకుని ఉంటున్నాడు—ఆ కొత్త ఊరికి వొచ్చినప్పటినించీ. గది చిందరవందరగా ఉంది. విసుగ్గా కుర్చీలో కూలబడి మేడవైపు యథాలాపంగా చూశాడు.

ఆ గదిలో లైటు వెలిగింది.

కిటికీలోంచి...

ఫూలిష్ గరల్. తనవైపు చూస్తున్నట్టుగా ఉంది. బహుశా, ప్రేమపిచ్చి! రామ్మూర్తి నవ్వుకున్నాడు.

రామ్మూర్తి బాగుంటాడు. ఆ విషయం అతనికి తెలుసు. ఏదో పాట అందుకున్నాడు. జంట పాట. విరహగీతం, అందుకొంటూ, రామ్మూర్తి మనసులోకి దొంగతనంగా తొంగిచూశాడు.

తనా పాట ఎందు కందుకున్నాడు!

ఆమె నిలబడి వింటున్నది.

వింటుందని తనకి తెలుసు. పిచ్చిపిల్ల!

ఆమె ఒక్క క్షణం అదృశ్యమైంది. తరవాత మళ్లీ ప్రత్యక్షమైంది.

ఆమె ఏదో సంజ్ఞ చేస్తున్నట్టుంది...తనకే!

రామ్మూర్తి కొంచెం చలించాడు. అంతుకనేనా ఆమె సినిమాకి వెళ్లి లేదు!

కిటికీలోంచి ఏదో కాగితం ఉండచుట్టి గది ముందు పడేలా విసిరింది.

సాహసం! కాసేపు అలాగే కూచుని తరవాత తెలివి తెచ్చుకుని రామ్మూర్తి అప్రయత్నంగా గది తలుపుదగ్గిరికి వెళ్ళాడు, కాగితం తీసుకోవాలని.

ఎవరో కాలేజీ కుర్రాళ్లల్లే ఉన్నారు—ఇద్దరు అప్పుడే గది దాటి పోతున్నారు—మాట్లాడుకుంటూ.

రామ్మూర్తి ఆగాడు వాళ్లు వెళ్లేదాకా.

వాళ్లు సినిమాగురించే మాట్లాడుకుంటున్నారు.

రామ్మూర్తి గుండె కుదుటబడ్డది. వాళ్లు చూస్తే దన్నమాట. వాళ్లు గది దాటగానే కాగితం విప్పి చూశాడు. రెండే ముక్కలు. తనని ప్రేమిస్తోందిట!

ఫూలిష్ గరల్. ప్రేమ పిచ్చి. తను ఒంటరిగాడు కాదని తెలియదు.

ఆ అమ్మాయి అక్కడే నిలబడి ఉంది.

రామ్మూర్తి కూడా అక్కడే నిలబడ్డాడు.

అతను సంకోచిస్తున్నాడు — లాంఛనప్రాయంగా.

తను పాట ఎందుకు పాడాడు! ఎందుకో రామ్మూర్తికి మనసు జ్ఞాపకం చెయ్యబోగా అతను విననట్టు నటించాడు. ఆమెకి పాటఇష్టం......ఆ దౌర్బల్యం...రామ్మూర్తి విసుక్కున్నాడు తనమీద. ఎలాగైనా ఆమె సినిమాలో తప్పక చేరుతుంది. ఆమె తత్త్వం అటువంటిది.

'అథారా లేమి'టని నిలదీసి అడిగితే రామ్మూర్తికి కోపం వొస్తుందని అతనికీ తెలుసు. అందుకే అడగలేదు.

ఆమె సినిమాల్లో చేరిపోతుంది.

చేరింతరవాత ఎలాగో...ఎలాగో...తప్పదు.

అప్పుడామెకి మంచి భవిష్యత్తే ఉంటుంది.

ఏమేమిటో ఆలోచించాడు మామ్మూర్తి. అతనికి విసుగుపుడుతోంది.

ఎదురెదురుగా—

రామ్మూర్తి మేడవైపు నడిచాడు...

ఇంకా సినిమాగురించే మాట్లాడుకుంటున్నారు ఆ కాలేజీ కుర్రాళ్లిద్దరూ...

"అందరూ ఆమోదించేదీ ఎవ్వరూ ఆదరించనిదీ ఏమిటో చెప్పగలవా?" స్నేహితుణ్ణి అడిగాడు కాలేజీ కుర్రాడు.

"ఏమిటి?"

"పోనీ, ఎవ్వరూ ఆమోదించనిదీ, అందరూ ఆదరించేదీ ఏమిటో చెప్పు."

"నువ్వే చెప్పెయ్యి."

"మొదటిది ధర్మం, రెండోది అధర్మం."

రెండో కుర్రాడు నవ్వాడు.

"అంత డౌన్ రైట్‌గా మాట్లాడకు."

"సర్వసాధారణం అని నా అభిప్రాయం. మినహాయింపులు లేవనికాదు. హాల్లో ప్రేక్షకుల రియాక్షన్ గమనించావనుకుంటాను. ధర్మానికి ఇంతగా బ్రహ్మరథం పట్టే మనుషులు ఇన్ని అన్యాయాలు ఎలా చేస్తారో! చెయ్యాలనే ఆలోచనలు ఎలా కలుగుతాయో!"

కొంచెంసేపాగి రెండో కుర్రాడు అన్నాడు.

"అనుభూతులు వేరు, ఆలోచనలు వేరు."

"ఏం వేరో!" నిస్పృహగా అన్నాడు మొదటి కుర్రాడు.

"వేశ్యకూడా వేశ్యని అసహ్యించుకుంటుందని నీకు తెలీదా?"

"ఏం లాభం?"

"అందుకే మానవుడి భవిష్యత్తుమీద ఇంకా నాకు నమ్మకముంది." అన్నాడు రెండో కుర్రాడు.

మొదటివాడు మౌనంగా ఆలోచిస్తున్నాడు...

మనోరమ నడుంచుట్టూ చెయ్యివేశాడు రంగారావు.

నిర్జన ప్రదేశంలో రిక్షా ఆగింది.

మేడగది సమీపించాడు రామ్మూర్తి.

—అది వర్తమానం.

వేటూరి—

సుందరశాస్త్రిగారి

## సువర్ణ సుందర రసము

సర్వసవామేహములకుసంజీవి.

గుణము ప్రత్యేకము

అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి సవామేహాలనైనా కుదుర్చును.

**50 మాత్రలు రు. 5.**

**ఆర్షరసాయనశాల, ముక్త్యాల.**

---

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R.S.** సుగంధ ముక్కుపొడి

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారు చేయువారు:—

**పి. వి. రాజన్ & కంపెని,**

అరక్కోణం, Arkonam, N. A. Dt.

---

## కుష్టు ★ బొల్లి

వగైరా చేమ మచ్చలు, తెగ, సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స!

ప్రతి సం॥రము వేలాది ప్రజలకు పూర్ణారోగ్యమును, నవజీవనమును ప్రసాదించుచున్నవి.

హిందూదేశమంతటా, ఆఫ్రికా, బర్మా, మలయా విదేశములలోను ప్రఖ్యాతి గాంచి విరివిగా వాడబడుచున్నవి

**మా ఔషధరాజములే!**

నేడే మా ఉచిత సలహాకు, క్యాటలాగుకు వ్రాయండి.

**జి. వి. రెడ్డి & కో**

(రిజిష్టర్డు)

"భాస్కరాశ్రమము"

గోపాలపురం : తూ. గో. జిల్లా.

---

శ్రీమదాంధ్ర

## మహాభారతము

ఉద్యోగపర్వము

వెల ఒకరూపాయి

**శ్రీమద్భగవద్గీత**

(కా. నాగేశ్వరరావుపంతులుగారు)

వెల **4-0-0**

**ఆంధ్రవాఙ్మయ చరిత్ర**

వెల **2-0-0**

**ఆంధ్ర గ్రంథ మాల,**

పోస్టుబాక్సు నెం. 212 మదరాసు-1.

# సాతవాహనోదంతము

శ్రీ జె. యస్. ఎ. రామచంద్రరావు

జయ కార్తిక భారతీ ముఖమున వెలువడిన 'సాత వాహను' లెవరను వ్యాసము చారిత్రక విమర్శకుల నొక విచిత్ర విషమపథమునకుఁ గొనిపోవుచున్న దనుటలో సందేహముండదు. సునిశిత మేధాసంపత్తిఁ గలిగిన నిష్పాక్షిక విమర్శకులదృష్టిలో, మగధాధిపతులని ప్రఖ్యాతినార్జించి, యేకచ్ఛత్రముగ, నాంధ్ర మండలముఁ గేంద్రముగ విశాల భారతి భూభాగములో సార్వభౌమాధికారము నెఱపిన శాతవాహన కులజులను దేశద్రిమ్మరీంద్రులు నొక తెగ వర్తకజాతి కంటగట్టుటకే వ్యాసరచయిత శ్రమించుచున్నటులఁ దోచుచున్నది. వీరివాదమునందలి సత్యాసత్యపరిశీలన మెట్టినిర్ణయములకు మార్గదర్శకమైనను, కేవల 'సాతవాహన' శబ్దాధారముగ వీరి పరిశోధనమున మాత్రము యుక్తియుక్తమును, సమయ స్ఫూర్తిశోభితమునునై యున్నది. ఈ వ్యాసకర్త సాతవాహనశబ్దమునుమాత్రమే బట్టుకొని, దానిని గమ్మెచ్చులలో బెట్టి సాగదీసి వేసినారు. కాని చరిత్ర ప్రసిద్ధములైన యీ వంశీయుల పర్యాయనామములను గూడ చేర్కొనుట మాని వేసినారు. కాన నీవ్యాసముఁ జదివిన బుద్ధిశాలురు త్వరపడి వీరి నిర్ణయమే చరిత్రకు మూలాధారమని నమ్మి సాతవాహనుల నిజచరిత్రను విస్మృతిపథాన నడఁగింతురేమో యను నావేదనమున నే నెఱిఁగినంతవరకు విషయపరిశోధనముఁ బత్రికా ముఖమునఁ బాఠకలోకమునకు మనవిఁజేసుకొనుచున్నాను. విజ్ఞులిందలి యౌచిత్యంగ్రహించి మన్నించెదరుగాక!

ప్రాచీనాంధ్రకీర్తి చరిత్రకు స్వర్ణాభిషేకముఁ జేసిన రాజవంశీయులు సాతవాహనులే. వీరికి శాతవాహనులని, శాలివాహనులని, శాతకర్ణులని, శతకర్ణులని వేర్వేరు నామములు ప్రసిద్ధములై యున్నవి. మౌర్యుల మగధసామ్రాజ్యపతనానంతరము వీరే మగధాధీశులైరి. నాఁడు మగధాధీశుఁడనగా భారతసమ్రాట్టన్న మాట. అనగా నాంధ్రులు భారత సార్వభౌమాధికారము నధిరోహించిరి. ఈ వంశీయుల కాంధ్రభృత్యులని మరియొక పేరుగలదు. ఈ యాంధ్ర భృత్యపదము వీరిని హీనకులజులనుగా మార్చివేయు ప్రమాదమును సూచించుచున్నను, కూలంకష పాండితీ ప్రకాండు లగువారి సాహాయ్యమున నది నివారింపఁబడినది. ఆంధ్ర భృత్యులనగా భృత్యులుగా నున్న యాంధ్రులని యర్థము. మౌర్యసామ్రాజ్య పతనమువరకు నాంధ్రులు భృత్యులేగదా! అందున నే యౌత్తరాహులగు పౌరాణికులు వీరి నాంధ్ర భృత్యులుగఁ జిత్రించి వీరల పాలనాయుగము నభివర్ణించిరి.

శ్రీ రావుగారు తమ వ్యాసమున నచ్చటచ్చట విదేశీయుల వ్రాతలనుఁ గ్రోడీకరించి తమ సిద్ధాంతమును సమర్థింపఁ బ్రయత్నించిరి. స్వదేశీయుల వ్రాతలనుఁ గించిన్మాత్రముగనైన గమనింపక, బడివాటుగా విదేశీయుల వ్రాతలనే యాధారముగా గొనుట ప్రమాదభూయిష్ఠము. మన యూళ్లను, పేర్లను విదేశీయులు తమ చిత్తము వచ్చిన ట్లుచ్చరించిరి. అందులకు మెగాస్థనీసు, టాలెమీ, మార్కోపోలో మున్నగు వారి రచనలే యాధారము.

ఓరుగల్లు నగరములో తిరుగాడుచుఁ బ్రత్యక్షముగా సన్నియు, విని కనిన విదేశీయుఁడు కాకతి రుద్రమాంబను గణపతిదేవ చక్రవర్తి భార్యగా వర్ణించినాడు. ఫెరిస్తాయను మహమ్మదీయ చరిత్రకారుని యభూత కల్పనలఁ జదివితిమేని, దిగంత విశ్రాంత యశోవిరాజితుఁడగు శ్రీ కృష్ణదేవరాయలను పట్టి పిఱికిపందగను, బహమనీ సుల్తానుల బందీగను వ్రాయవలసియుండును. విదేశీయుల వ్రాతలలో నిట్టి ప్రమాదములు పెక్కులు గలవు. కడకు నిష్పాక్షికులగు ఫాహియాన్, హ్యూన్‌త్సాంగులు కూడ భ్రమప్రమాద జనితదోషములకుఁ బాల్పడిరి. దేశీయ రచనలలో

కూడ కొంత చరిత్ర కుపకరించు సామగ్రి లేకపోనూ లేదు.

సాతవాహనుల పరిపాల నారంభము నాటి కాంధ్రభాష కొకరూప మేర్పడలేదను చారిత్రిక సత్య మీ వ్యాసకర్త గ్రహించినటులు తోచదు. నేడు వాడుకలోనున్న ప్రాంతీయ నామములకు నాటి "శాతవాహన" పద వికృతుల నంటగట్టుట పూర్తిగా నర్థరహితమని నే నభిప్రాయ పడుచున్నాడను. ఏది, యేమైనను — సాతవాహనులనుఁ గూర్చిన పుట్టు పూర్వోత్తరములనుఁ దెలిసికొనుట కుపకరించు చరిత్రాంశములు నేటికిని దుర్లభములు. సార్థవాహుల వంశీయులే సాతివాహనులని యని యభిప్రాయపడుటకంటె,— "సాతుఁ"డను వ్యక్తిపరముగా నీపద ముద్భవించినదని నమ్ముటలో గొంత యౌచితి గానుపించుచున్నది. ఈక్రింది యుదంతమునుఁ బరిశీలింపుడు.

"దీపకర్ణి యను మహారాజు దక్షిణాపథమునుఁ బాలించుచుండెను. వానికిఁ బ్రాణప్రియురాలైన శక్తిమతి యను భార్య యుండెను. ఆమె యొక రాత్రి సుఖశయ్యను నిద్రించియుండగా పాము కఱచెను. అందుచేత నామె మరణము నొందెను. అంతట దీపకర్ణి శోకముచేత నపుత్త్రికుఁ డయ్యునుఁ బ్రహ్మచర్యవ్రతి మవలంబించెను. ఒకనాఁడు దీపకర్ణి మహారాజు తన వెనుక రాజ్య మేలుటకుఁ దగిన పుత్త్రుఁడు లేక పోయెనుగదా యని విచారించుచు నిద్రఁ జెందగా స్వప్నములో నీశ్వరుఁడు ప్రత్యక్షమై 'ఓ! రాజా! నీవు వేటకుఁ బోవునప్పుడా యడవిలో సింహముమీద సవారిఁ జేయుచు నొక బాలుఁడు కన్పడును; వాని నింటికిఁ దెచ్చుకొనుము. వాఁడే నీకు బుత్త్రుఁడగును.' అని చెప్పి యదృశ్యుఁడాయెను. అంతట రాజు మేల్కొని యా స్వప్నమును స్మరించుకొనుచు నమితానందమునుఁ బొందుచుండెను. ఒకనాఁడు రాజు మృగయావినోదార్థము మహారణ్యమునందు విహరించుచుండగా మధ్యాహ్నకాలమునందు సింహారూఢుఁడై బాలసూర్యుంబోలెఁ బ్రకాశించుచున్న యొక బాలుని నొక తామరకొలనియొద్దనుఁ జూచెను. వానిం జూచిన తోడనే రాజునకు స్వప్నము సంగతి జ్ఞప్తికి వచ్చెను. సింహము బాలునిఁ దించి నీళ్లు త్రాగుటకై సరస్సునకుఁ బోవుచుండగా దీపకర్ణి యొక్క బాణముఁ ప్రయోగించి సింహమును బడవైచెను. వెంటనే సింహము మనుష్యుఁ డాయెను. అంతట నా మనుష్యుఁడు 'రాజా! నేను కుబేరుని మిత్రుఁడను. యక్షుఁడను. నా పేరు సాతుఁడు. నేను పూర్వము గంగలో స్నానముఁ జేయుచుండిన యొక ముని కన్యకనుఁ జూచి, మదన బాణములకు గురియై, యామెను గాంధర్వ విధిచేతను వివాహమైతిని. మా దాంపత్యమునుఁ జూచి మును లోర్వంజాలక, సింహము లగుదురుగాక! యని శపింపగా మే మిరువురము సింహ దంపతులముగా జనించి నారము. కాలక్రమమున నా భార్య గర్భిణియై యీ పుత్త్రునిఁ గని కాలధర్మము నొందినది. నేనే వీని నితర సింహికలపాలతో బెంచితిని. నీ బాణము తగులగానే నా శాపము తీఱినది. ఈ మహాసత్త్వుని నీ కిచ్చెదను. వీనిని నీ పుత్త్రునిగా గ్రహింపుము. ఈ ప్రకారమే జరుగవలయునని యీశ్వరుఁడు విధించియున్నాఁడు.' అని చెప్పి సాతుం డంతర్హితుండాయెను. దీపకర్ణి యా బాలు నింటికిఁ గొనివచ్చి సాతుఁ డతనికి వాహనమైనందున సాతవాహనుఁడని పేరుపెట్టి కాలక్రమమునఁ బట్టాభిషిక్తునిఁ జేసి తపస్సునకై యరణ్యమునకుఁ బోయెను. అది మొదలుగ సాతవాహనుఁడు భూమి నేలుచున్నాఁడు."

(శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర ప్ర॥భా. ఆరవ ప్ర. పుట 93-94)

ఈ పై కథ బృహత్కథ, కథాసరిత్సాగరము లను మహాకావ్యములనుండి యనువదింపఁబడినది. సాతివాహన శబ్దమే శాతవాహన శబ్దముగా శాసనములలో ప్రయోగింపఁబడినది. శాతవాహనునే ప్రాకృత భాషలో శాలివాహనుఁ డందురు.

"ఈ శాతవాహనుని చరిత్రము పురాణములలో గాని, శాసనములలో గాని యెచ్చటను గానరాదు. ఈతనిఁ గూర్చిన విశ్వాసపాత్రమైన చరిత్ర యింతవరకుఁ గాన్పింపలేదు గాని, యీతని పేరిట నద్భుతము లయిన గాథలు మాత్రము వేలకువేలు కేవలము నొక విధముగా బహుదేశములందు భరతఖండమందంతటను ప్రచారములో నున్నవి. ఆగాథలు శాతవాహనుని కాలము నిర్ణయించుట కంతమాత్రముఁ బనికిరావు. కేవలము కల్పితములైన గాథ లనేకములు వీరాగ్రగణ్యుఁడైన శాతవాహనుని మెడకు ముడి పెట్టబడినవి. ఈతనియొక్క

ప్రఖ్యాతినిఁబట్టి యిటీవలి రాజు లెందరో యీ శాతవాహనునితో నేమియును సంబంధము లేక పోయినను తా మీతని సంతతివారమని గొప్పగా జెప్పుకొనుచుండిరి. ఇతఁ డాంధ్రజాతీయుఁడని, యాంధ్రదేశమును బాలించిన యాంధ్రభృత్యవంశ మనియెడి శాతవాహనవంశమునకు మూలపురుషుఁడని, యాంధ్ర మహారాష్ట్రదేశములలోని శాసనాదులవలనను, పురాణాదులవలనను, స్పష్టముగా దెలియుచుండఁగా, తదితరదేశ రాజన్యుల కెట్లు వంశకర్తయయ్యెనో దెలియరాకున్నయది.”

(ఆంధ్రులచరిత్ర ప్ర. భా. 6 ప్ర. పుట 90)

మహాపురుషుఁడైన సాతవాహనుని చరిత్ర మిట్లు తెలిపినకొలఁదియు వయోమయపరిస్థితిలో పడిపోవుచున్నది. పాతుఁడను యక్షునిపరముగా సాతవాహన శబ్ద ముత్పన్నమాయెనను వాదములో నే సారస్య మున్నదని తోచుచున్నది. ఈతఁడు యక్షునిచే పెంపబడె నంతమాత్రమున నీకథ యసత్యమని త్రోసివేయవలసిన యవసరము లేదు. యక్షులను నొకజాతి మానవులు టిబెట్టు ప్రాంతములనుండి భారతదేశమునకు వలస వచ్చిరి. వా రత్యున్నతమైన హిమవత్పర్వతభూములనుండి వచ్చుటచే తామందరికంటె నధికులమని తలఁచిరి. వీరి శరీరచ్ఛాయ పసిమివర్ణము. ప్రస్తుతము నేపాలు, బెంగాలు, అస్సాముదేశీయులైన ప్రజలు వీరిసంతతివారే! వీరి నేపాళీభాషలో ‘యక్కా’ యని పిలచిరి. చైనావారు వీరిని ‘యూచీ’ లనిరి.

సింహములను సహితము లొంగదీయగలిగిన సాహసోపేతుఁడగు నీ ‘యక్షబాలునిఁ’ గాంచి దీపకర్ణి ముచ్చటపడి సంతతిలేని తనకుఁ గుమారునిగ గ్రహించియుండవచ్చునని పైకథ పరిశీలించిన స్థూలముగా బోధపడుచున్నది.

ఏ మహనీయుని పవిత్రనామముచే మన సువిశాల దేశము విలసిల్లుచున్నదో, యట్టి భరతుని విజనారణ్య మధ్యమునుండియే గదా దుష్యంత మహారాజు నాస్థానమునకుఁ గొనివచ్చినది. అటులనే యాంధ్ర రాజవంశమునకు మూలపురుషుఁడైన సాతవాహనుని గూడ ఘోరారణ్య మధ్యములోనుండియే గొనివచ్చుటలో నేదో విశేష ముండియుండవచ్చును. మన మహాపురుషులైన భీష్మ ద్రోణాది వీరులయొక్కయు, చివరకు భారతవీరులగు పాండవులయొక్కయు జన్మరహస్యములు నిగూఢముగా నుంచఁబడుటలో కొంత విజాతీయత గానుపించుచున్నది. ఆర్యులు దృషద్వతీ సరస్వతీ నదుల నడుమ విస్తరిల్లుచున్న సమయములో మంగోలియను జాతీయులగు నీ యక్షులు భారతదేశమునఁ బ్రవేశించిరనుటకుఁ బ్రబల నిదర్శనములు గలవు. దక్షిణాపథ ప్రభువగు దీపకర్ణి విక్రమ సాహసోపేతుఁడగు నీ బాలు నా యక్షసంఘము నుండియే గ్రహించియుండవచ్చును. కర్ణివంశములో జేరుటచే నా వంశగౌరవము కొఱకై యీ బాలుని నామధేయము సాతకర్ణిగా జేయఁబడియుండవచ్చును. ఈ శబ్దములో, సాతి, కర్ణి వంశములయొక్క సమ్మేళనము ప్రస్ఫుటముగా గానుపించుచున్నది. కావున సాతవాహన వంశమే సాతకర్ణివంశము గూడను.

ఆంధ్రరాజులకు మహాకర్ణులని పేరు. వీరినిఁ గురించిన కథలు కొల్లలు కొల్లలుగా జావా, సుమత్రా మున్నగు దేశములలో గలవు (“ఒక కర్ణమహారాజును గురించి యా దేశములో నొక కావ్యము గలదట. ఆ కావ్యమేదియో తెలిసికొనినయెడల వీరల చరిత్రము గొంతవరకుఁ దెలియఁబడవచ్చును” ఆంధ్రుల చరిత్ర ప్ర. భా. 10 ప్ర పుట 191.) ప్రస్తుతపు టిండోనీషియా యధ్యక్షునిఁ నామములో “సోకర్ణో” యని వాడఁబడిన యంత్యపదము పరిశీలించిన పై వాక్యములు పూర్తిగా నసత్యములు గావని నమ్మవచ్చును.

పాతుఁడు వాహనముగా గలఁవాడు సాతవాహనుఁడు. చిన్నతనమునందే తల్లిదండ్రులను గోల్పోయిన యీ బాలుని పాతుఁడు పెంచియుండవచ్చును. ఆనాటి భాషాసాంప్రదాయము ప్రకారము పాతునిచే పెంపఁబడినవాఁడే సాతవాహనుఁడుఁ గావచ్చును. ఏది యేమైననుఁ గర్ణవంశీయుఁడైన దీపు నంటఁ జేరిన బాలుఁడు తన పూర్వవంశము యొక్కయుఁ, దత్తవంశముయొక్కయు గౌరవం కాపాడుటకొఱకే సాతకర్ణి నామమును ధరించె ననుటలో నెక్కువ యౌచితి గానుపించుచున్నది. తన వంశీయుల కెల్లరకీ నామమే కులనామమై చరిత్రప్రసిద్ధమై యాంధ్రజాతికి గర్వకారణమైనది. పురాణము లీమహారాజుల పేళ్ళనుఁ జెప్పుచు నందు, శాతకర్ణి, మృగేంద్ర స్వాతికర్ణి, కుంతలస్వాతికర్ణి, స్వాతికర్ణి, శాతికర్ణి, చకోరశాత

కర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణి, చంద్రశ్రీ శాతకర్ణి యను సంపూర్ణ నామములనుఁ జేర్కొనినవి. ఈ వంశీయులనే చెక్కండ్రను, గోతమిపుత్రుడు, పులమాయి, శివశ్రీ మున్నగు మహారాజుల పేళ్ళను, క్రమయుక్తముగఁ జేర్కొనినవి. అనగా వీరి పేర్ల చివరనుఁగూడ శాతకర్ణి పదమునుఁ జేర్చుకొని పిలువవలయును. కాన నీ రాజవంశీయులు శాతకర్ణులనియే ప్రసిద్ధిగాంచిరి.

కావున సాతవాహనుఁడే, సాతకర్ణి, శాతకర్ణి, శాలివాహనుఁడని నా యభిప్రాయము. శాతవాహను నే శాలివాహనుఁ డని ప్రాకృతభాషలో వాడిరి. ఆ నామము ననుసరించియే శాలివాహన శక ముత్పన్నమాయెను. "అయినను హాలశాతవాహనునితో (క్రీ. శ. 52—79) శాలివాహన శకము ప్రారంభమాయెనని విశ్వసింపవచ్చును. శాలివాహన వంశజుఁ డగుటచే హాలశాతవాహన శాలివాహనుఁ డనవచ్చును గాని యాతఁడు మాత్రము మొదటి శాలివాహనుఁడు కాఁడు. (ఆంధ్రుల చరిత్ర ప్ర. భా. 9 ప్ర. పుట 162)

సార్థవాహులు సాతవాహులైరనియు, వారే సాదువాండ్లు, సాతుపెల్లు, పెటికరాజులనియు విపరీతార్థములుదీయుటకంటె, ప్రాచీనార్య — టిబెటను రాజవంశములసమ్మేళనమే 'సాతకర్ణి' వంశావతార మని నమ్మినచో మనమార్గము సుగమమగును. దీపకర్ణి కథ పై నిర్ణయమున కెంతయు సహాయపడుచున్నది.

భారతకాలమునుండి ముసల్మానుల ప్రవేశము వరకును మన ప్రాచీనార్య రాజవంశములతో గలసిపోయి తమ వ్యక్తిత్వమునే గోల్పోయిన విదేశీ రాజవంశములు పెక్కులు గలవు. హూణ, శక, యవన పహ్లవులగాథలే యిందులకు నిదర్శనములు. కావున చారిత్రికాధారములు లేని మన భారతదేశచరిత్రలో నొక యజ్ఞాతసంవత్సరమున కర్ణవంశీయుఁడగు దీప మహారాజుచే, టిబెటను జాతీయుఁడగు 'యూచీ' బాలుని స్వీకారమువలన సాతకర్ణులను ప్రఖ్యాత రాజవంశమునకుఁ బునాది వేయఁబడెను. దీపకర్ణి—వాని యనంతరము సాతకర్ణి—అతఁడే సాతవాహనుఁడు—వానియనంతరము పెక్కండ్రు సాతకర్ణులు, లేక సాతవాహనులు;—యీ సుదీర్ఘకాల భూమండలాధిపత్యము వహించి తమ యశోవల్లికలచే దిగంతము లాక్రమించిరని నమ్ముటయే యిప్పటికి సుచితమని తోచుచున్నది. ఇందలి గుణదోషనిర్ణయములను విజ్ఞుల పరిశీలనమునకే వదలివేయుచున్నాము.

# అశిక్ష - అవిద్య

శ్రీ కాళీపట్నపు రామారావు

## 1

శ్రీరామారావు తమ్ముడి పెండ్లికి ఏర్పాటులన్నీ మహా ఘనంగా జరిగినవి.

పెండ్లి, కన్యాదాతల స్వగ్రామంలో స్వగృహమందు జరపడానికి నిశ్చయించారు. వాళ్ళూ పెద్ద ముఖాసాదార్లు. వాళ్ళ కుటుంబం చాల పెద్దది.

శ్రీరామారావుగారి స్థితిగతులు కూడా తక్కువని కావు. అతని తమ్ముడు బి. ఎ., తప్పినా వాళ్ళకు చాలా భూవసతీ కొద్దిగా నిలవ పైకం ఉన్నవి.

అసలా భూములనూ మొదలైనవానిని సంరక్షించుకోవటంలోనే అతడు పోయిన పరీక్షకు మళ్లా కట్టటంకాని పై చదువులకు పోవటంకాని పడిందికాదుట. శ్రీరామారావు మట్టుకు—అతను ఒక పెద్ద కాలేజీలో లెక్చరర్ గా పనిచేస్తూ ఉన్నాడు. అతనికి ఏర్పూరివారి రెండవ ఆడబడుచు పెద్దకూతురు కూతుర్ని ఇచ్చి పెండ్లిచేశారు. అతను పట్టణంలోనూ ఇతను పల్లెటూరులోనూ ఉండటంవల్ల ఆ కుటుంబం రెండింటి ప్రయోజనాలనూ సమానంగా పొందగలదు.

వాళ్లకు ముగ్గురు అక్కచెల్లెళ్లు ఉన్నారు. వాళ్లందరూ ఇంతకుముందే పెండ్లిండ్లు అయి కాపురాలు కూడా చేస్తున్నారు.

ఇంతవఱకూ వాళ్లు చేసినవి అన్నీ పట్నపు సంబంధాలూ పట్నాలలో ఉండేవాళ్ళ సంబంధాలే. ఇది ఒక్కటే—వారు పల్లెటూరు సంబంధాన్ని వెతికి వెతికి చేస్తున్నారు. దానికి కారణం పూర్వం పల్లెటూరిలో 'శాశ్వతంగా' ఉండవలసినవాడు కావటమే.

ఈ సంబంధం పల్లెటూరి సంబంధమే అయినా సంప్రదాయ సంస్కారాల రెండింటి విషయంలోనూ వీరి కేవిధంగానూ తీసిపోదు. కట్నం కానుకల విషయంలో రెండువేల పదహార్లు కట్నం పెట్టడానికి అందుకు తగిన లాంఛనాలు జరపడానికి సిద్ధపడ్డారు ఆడపెండ్లివారు.

వివాహపు ఏర్పాట్లుకూడా అందుకు తగిన స్థాయిలోనే జరుపబడ్డాయి. మగపెండ్లివారి తరఫున వచ్చే మగవారుగాని ఆడంగులుగాని ఇలా తప్పుపట్టడానికి వీలులేకుండా సమస్తం ఏర్పాటుచేశాడు పెండ్లికూతురుయొక్క రెండవ అన్న.

పెండ్లివారి విడిదికి నూరు నూటయిరవైమంది వచ్చినా స్వేచ్ఛగా సరిపోయే పెద్దయిల్లు ఖాళీ చేయించాడు. వేడినీళ్లు కాచడానికే ప్రత్యేకం ఒక మనిషి. స్నానానంతరం ఆడవాళ్ల కట్టువిడుపు బట్టలూ మగవాళ్ల కట్టువిడుపు బట్టలూ తడపడానికి ఇంకో ఇద్దరు మనుష్యులు. తలంట్లూ కాళ్లుపట్టడాలూ మొదలైన భోగోపచారాల కొఱకు మంత్రులను సహితం ఇద్దర్ని ఏర్పాటుచేశారు. వీళ్లంతా ఆయాపనులకేకాక తక్కిన ఇంకే పనులకైనా ఎవరు ఎప్పుడుపిలిచినా పలకడానికి సిద్ధంగా ఉండాలి. అందుకొరకు వాళ్లు ఏపరిస్థితుల్లో కూడా విడిది విడిచి వెళ్ళరాదని గట్టికట్టడి చేశాడు 'చిన్నబాబు'

శ్రీరామారావుగారికుటుంబం, అక్కచెల్లెళ్లూ, ఏతత్సంబంధీకులూ, తల్లివంకా తండ్రివంకా చుట్టాలూ, వాళ్ళవాళ్ళ పిల్లలూ, ఊరిలో ఇద్దరు ముగ్గురు పెద్దరైతులూ, తక్కిన సన్నిహితులూ, నలుగురైదుగురు నౌకర్లూ చాకర్లూ—అంతా కలసి దగ్గర దగ్గర నూరు నూటఇరువదిమంది వరకూ ఉంటారు—వీళ్ళంతా 'ఝాం' మంటూ అందుకుతగినహంగుతో తరలివచ్చారు.

ఇచ్చిపుచ్చుకోవడాలలోకాని భోజన భాజనాదులలోగాని అంతవరకూ ఎట్టి ప్రతిబంధకాదులూ సంభవించలేదు. పూటకు దగ్గరదగ్గర నాలుగువందల

వరకూ విస్తర్లు తీస్తున్నా సమస్తం సాఫీగానే సాగి పోతున్నది.

మగపెండ్లివారు పెండ్లికి తరలివచ్చిన సాయంత్రమే తోటలో దిగారు. మరునాడు ఉదయం స్నాతకమహోత్సవం. రాత్రి సరిగా ఎవ్వరికీ నిద్దర్లు లేవు. ఆ తెల్లవారుజామున మూడుగంటల ముప్పదిఐదు నిమిషాలకు వివాహలగ్నం.

## 2

మొఖాసాదారుగారి లోగిలి ఇంటి పెద్ద వాకిలి నిండా వేసిన పందిట్లో పదహారు పెట్రోమాక్సులైట్లు వెలిగిపోతున్నాయి దేదీప్యమానంగా.

పందిరిక్రింద అంతా మగవారు — చుట్టపక్కాలూ, స్నేహితులూ, ఊరిపెద్దలూ, దగ్గరదగ్గర మూడువందలమందివరకూ కూర్చొని ఉన్నారు. వాళ్ల మధ్య వేదికపై వరుణ్ణి కూర్చుండజేసి పురోహితుడు వైవాహికమంత్రాలను ఉచ్చస్వరంలో పఠిస్తూ మధ్య మధ్య మంగళవాయిద్యాలతో అతనిచేత రక్షాబంధన చేయిస్తున్నాడు.

ఆడవాళ్ళంతా సువిశాలమైన లోగిలి వరండా నిండా క్రిక్కిరిసి కూర్చొని ఉన్నారు. రంగురంగుల పట్టుచీరలూ బంగారపు టాభరణాలూ వాళ్ళ దేహాలపై మెరిసిపోతున్నవి. లోపల దేవుని గదిలో వధువు గౌరీదేవి పూజచేస్తూ ఉన్నది. కొందరు ముఖ్యులు అనబడేవారు అక్కడకూ ఇక్కడకూ తెగతిరుగు తున్నారు. సభలో ఉభయపక్షాలకు చెందిన ప్రతినిధులూ వేర్వేరుగా సదస్యులకు చందన తాంబూల సుగంధద్రవ్యాదులు సమర్పిస్తూ వాతావరణమల్లా పరిమళనుమయం చేస్తున్నారు.

ఒకస్థితిలో పురోహితుడు అకస్మాత్తుగా చదువుతున్న మంత్రం ఆపి "ఏరీ? పిల్లపెద్దలేరీ? ఎక్కడా కనుపించరేం?" అన్నాడు శ్రీ రామారావును ఉద్దేశిస్తూ.

దగ్గర్లో ఉన్నవారు శ్రీ రామారావుకోసరం చుట్టూ చూశారు. అతడు వారికెక్కడా ఆ చుట్టుపట్ల జనంలో ఉన్నట్టు కనుపించలేదు.

ఈ అలజడి విని ఎవరితోనో మాట్లాడుతున్న శ్రీ రామారావు చినబావమరది "ఏం కావాలి...డబ్బు లేనా? ఇదుగో ఇక్కడ వున్నాయి" అంటూ చేతను ఉన్న మనీపర్సు తెరచి పురోహితుడికి కావలసినది తీసియిచ్చాడు. ఆయన ఆ డబ్బులు పుచ్చుకొంటూ మర్యాదదెబ్బతిన్నట్టు "డబ్బులమాటకేం ఆయనను పిలిపించండి. ఇంకొక్క పది పదిహేనునిమిషాల్లో కన్యాదానం జరుగనున్నది. వారుపోయి యెక్కడో కూర్చుంటే ఎలా?" అన్నాడు దీర్ఘాలుతీస్తూ.

కాని అతనిమాటలు ఎవరూ పట్టించుకో లేదు. ఆసరికి శ్రీ రామారావు అతనిభార్యతో విడిదిలో ఉన్నాడు. విడిది బయటి వరండాలో ఇద్దరు దాసీలు మాత్రం అక్కడ కన్నిపెట్టుక ఉండవలసినవారు కూర్చొని ఉన్నారు. వాళ్ళు మాట్లాడుతూ మాట్లాడుతూ క్షణకాలం మాట్లాడేవిషయ మేమీ లేక అలా ఇద్దరూ మౌనంగా ఎక్కడెక్కడికో చూస్తూ ఉన్నారు. కిటికీఊచలలోనుండి వస్తున్న పెట్రోమాక్సు లైటు వెలుతురుతప్పిస్తే బయటఅంతా చిమ్మచీకటి. దూరం నుండి మంగళవాయిద్యాలు ఉండీ ఉడిగీ వినపడుతూ ఉన్నవి. సర్వత్రా జాగరణానుభూతి ప్రస్ఫుటిస్తున్నది.

గదిలో శ్రీదేవి ఒకపెట్టె ముందువేసుకొని అందులో గల బట్టలన్నీ ఒకటొకటే తీసి ఆత్రతతో దులుపుతున్నది. అనతిదూరంలో కిటికీసమీపాన పెట్రోమాక్సులైటు ఉన్నది. దగ్గరలోనే శ్రీ రామారావు ఒకపెట్టెమీద కూర్చొని భార్య దులుపుతూ ఉన్న బట్టలవంక చూస్తున్నాడు. అతనిది తెల్లని దేహయష్టి. అది ఎన్నడూ లావుగానూ కాకుండా సన్నంగానూ కాకుండా ఆరోగ్యవంతమైనదిగా ఉంటుంది. అతని నుదురు చాలా ఎత్తైనదేకాని విశాలమైనది కాదు. పలుచని పెదవులు ఎల్లవేళలా దగ్గరగా మూసివుంటాయి. కండ్ల అద్దాలవెనుక కన్నులు తొలి యవ్వనపు తేజస్సును కోలుపోతూ ఉన్నవి. అతడు కాలేజీకిపోయేటప్పుడెల్లా సూట్లే వేస్తాడు. కాని సభలూ మొదలైన సాంఘిక సమావేశాలకు పోయే టప్పుడు ధోవతులు కట్టుకపోవడానికి ఇష్టపడతాడు. అప్పుడప్పుడు అటువంటి సమయాలలో వాణీలు వెయ్యటంకూడా కద్దు. ఇప్పుడట్లానే తెల్లని గ్లాస్గో పంచా సిల్కుకమీజూ కండువాలలో ఉన్నాడు. కాళ్ళకు చెప్పులతో ముడుకులపై మోచేతులను ఆనుకొని అతడు భార్య చేస్తున్న పనివంక దృష్టినంతా పెట్టి పరికిస్తున్నాడు.

శ్రీదేవి ఆఖరు చీరకూడా దులిపి అది అట్లానే పెట్టెలో జారవిడిచింది. అంతటితో ఆమె పెట్టెను గాలించడం అప్పటికి మూడవసారి. అంతవరకూ తీసిన ఆ పెట్టెలోని తక్కినగుడ్డలన్నీ ఆమె చుట్టూ చిన్న చిన్న మేటలుగా పడిఉన్నవి. ఆమె వాటి అన్నింటిమధ్యా చూడటానికి ఒక బొమ్మలా కూర్చుని ఉన్నది.

శ్రీదేవిలో నాగరక తరుణులకు ఉండవలసిన లక్షణాలు చాలా కనిపిస్తూ ఉంటవి. ఆమె పెద్ద అందమైన మనిషి కాదు గాని కనుముక్కు తీరులో లోపం లేకుండా సామాన్యంగా ఉంటుంది. మొహం కోలమొహం—మనిషికూడా ఏమాత్రమో ఎత్తరి. శరీరం పలుచనేకాక దుర్బలంకాగా తెల్లగా పాలిపోయి ఉంటుంది. జీవితం పాడయ్యిందనే అక్కసుతో మనసునూ శరీరాన్నీ పాడుచేసుకుంటున్న లక్షణాలు ఆమెలో బీలగా కానవస్తవి.

కొంతసేపు అటూ ఇటూ చూశాక శ్రీదేవి తన దృక్కులను భర్త మొహంలోకి మరల్చి అటు చూసింది. శ్రీరామారావు ఆలోచిస్తున్నవాడల్లా ఆమె చూపులయొక్క స్పర్శచే ప్రేరితుడై ఆమెవంక తిరిగి ఏదో అనగబోతూవుంటే పెండ్లి పందిరినుండి కబురు వచ్చింది.

అతడు వస్తాను పదమంటూనే లేచి ఆ మనిషి వెళ్ళిపోనిచ్చాక కాస్తసేపు ఇటూ అటూ తిరిగాడు. తరువాత సరిక్రొత్త ఆలోచనలతో అన్నాడు.

"ఇప్పట్లో మనం చేయగలిగిందల్లా నోరు మూసుక పడిఉండటమే. తొందరపడి ఎవరైనా ఏమన్నా అడిగామా సొమ్ము మానాన సొమ్ము పోతుంది. పైగా నానా యాగీజరిగి పెళ్లంతా అభాసై ఊరుకుంటుంది."

ఈమాటలు ఏ కాస్త ఉద్రేకంతో అని కొంచంసేపు తాళాక మళ్ళా అన్నాడు. ఈసారి అతని గొంతులో తెచ్చికోలు ప్రసన్నత కానవస్తున్నది. అన్నాడు—

"మళ్ళా ఆలోచించి ఏం చెయ్యవలసిందీ చెప్తాను. అంతవరకూ నువ్వు ఏమీ మాటాడకు" ఇట్లా అని అతడు అక్కడనుండి వెళ్లిపోయాడు.

శ్రీరామారావు వెళ్లిపోయినవెనుక శ్రీదేవి కొంత సేపటివరకూ అతను వెళ్లిపోయిన మార్గం వంకనే చూస్తూ కూర్చొన్నది. తరువాత తిరస్కార తీవ్రావేగ మలినమైన తన ముఖాన్ని పెట్టెవంక త్రిప్పుకొంటూ అంతకంటె తీవ్రతరములైన ఆలోచనా పరంపరల సంకులసంక్షోభంతో మనసు కొట్టుమిట్టాడుకపోతూఉండగా ఆమె బట్టలన్నీ పెట్టెలో సర్దసాగింది. ఆపని అయినవెనుక కొంతసేపు పెండ్లి పందిరిదగ్గరకు పోవడమా మానడమాఅని ఆలోచించింది. మానటానికి ధైర్యంచాలక, పోవటానికి ఇష్టంలేక, తిట్టుకొంటూ చివరికొక పావుగంట గడిచాక నెమ్మదిగా బయలుదేరింది.

## 3

శ్రీరామారావుకూ అంతకంటె శ్రీదేవికీ ఆ యింట గల స్థానాలు అతిచిత్రములైనవి.

కోడలుగా శ్రీదేవి ఆయింటికాపురానికివచ్చి దగ్గరదగ్గర ఆరుసంవత్సరాలు కావస్తూఉన్నది. ఇంతకాలనకూ ఆమె ఏమాత్రమో అయితే తనభర్తనుతప్ప ఆఇంట ఇంకొకవ్యక్తినైనాసరే తనకు సన్నిహిత బంధువుగా చేసుకోలేకపోయింది.

దీర్ఘంగా ఆలోచిస్తే ఇందుకు ఆమె ఎంతవరకూ బాధ్యురాలో ఆ యింట గల తక్కిన అందరూకూడా అంతమేరకూ బాధ్యులేననాలి. కాని చూసేవారందరి స్థూలదృష్టికీ అందులో శ్రీదేవిపాలే ఎక్కువలా కానవస్తూఉంటుంది.

ఇందుకు కారణమేమని వితర్కిస్తే ఆ యింటివారు 'ఆమె గుణాలు' అంటూ శ్రీదేవి గుణాలను వేనినో ఎత్తి చూపుతారు. శ్రీదేవి తాను నాగరికురాలు కావడంవల్లా స్కూలుఫైనలు వరకూ చదివి ఉండటంవల్లా 'ఆ పల్లెటూరి మూకకు పనికివచ్చాను కాను' అంటుంది. ఉభయపక్షాలవారికీ సామాన్య బంధువైన శ్రీరామారావును ప్రశ్నించగలుగుతే అతను దీనికి కారణం ఇదమిత్థమని తేల్చి చెప్పడం కష్టమంటాడు. తన భార్యయొక్క చదువు ఆమెదైన ఆడితనాన్ని మార్చగలిగివుంటే ఇన్నిచిక్కులు వచ్చివుండేవి కావని ఆ భావుకుని అభిప్రాయం. ఇది తెలుసుకుని అతని బావమరిది—అంటే శ్రీదేవి అన్న—అతని గురించి "శ్రీరామారావుకు ఎదరి లోపమేగాని తన లోపంగాని తనవారి లోపంగాని చూడగలిగే" ఆత్మస్థైర్యం సంస్కారపూర్ణత్వం చాలవంటాడు.

వైవిధ్యంతోపాటు ఏకత్వాన్ని సహితం స్ఫురింపజేసే ఈ వాదనలన్నీ వింటే పిల్లిందరు చూసినదీ ఒక్క పేనుగేనని తెలిసిపోతుంది. అసలు మూల కారణం శ్రీదేవి పుట్టిన కుటుంబం ఆమె మెట్టిన కుటుంబంనుండి అత్యంత విభిన్నం కావటంలో ఉన్నది.

శ్రీదేవికుటుంబం తన అత్తవారికుటుంబంలా మధ్యతరగతి పల్లెటూరి భూస్వామ్య కుటుంబం కాదు. ఆమె నాగరికమైన ఒక "గొప్పకుటుంబానికి" అనుబంధంగాఉండే వేరొక "చిన్న గొప్పయింటి" బిడ్డ. ఆమెతల్లి మేనమామలందరూ — ఆమె మేనమామలుకూడా — దేశమందంతటా పెద్దపెద్ద మహానగరాలలో ఉన్నతములైన పదవులను ఆక్రమించి ఉన్నవారు. ఆమె అన్నదమ్ములుకూడా ఢిల్లీ సెక్రటేరియట్‌లో ఒకరూ మద్రాస్ సెక్రటేరియట్‌లో ఒకరూ—ఆ నడుమనే ఉద్యోగాలు సంపాదించి ఉన్నారు. వాళ్లిద్దరూ జీవితంలో పెద్దపెద్దఆశలు పెట్టుకొని వాటివిజయానికై తమ శక్తివంచన లేకుండా సర్వవిధాలా కృషిచేస్తూ ఉన్నారు. ఏనాటికైనా తాముకూడా తమ తల్లివంశ చుట్టాలంతటివాళ్లు కావాలని వాళ్లకూ వాళ్లతల్లికీకూడా ఒక గట్టిపట్టుదల.

కాని శ్రీదేవి తండ్రిమాత్రం యీవర్గానికి చెందిన మనిషి కాదు. ఆయన "లా"చదివి పట్టణంలో ప్రాక్టీసు పెట్టి నాగరికుడుగా చలామణీ అవుతున్నా పుట్టుకచేతా వస్తుతఃకూడా పల్లెటూరివాడే. అందుచేతనే ఆయన తనకూతుళ్లకు ఇద్దరికీ వివాహాలు చేయవలసి వచ్చేసరికి సహజంగా పల్లెటూరివాళ్ళనే వెదికిచేస్తూ వచ్చారు. సహజమైన యీ సంఘటననుండి శ్రీదేవి తల్లి తనయొక్క కల్పనాచమత్కృతి అంతా వీర్పడేటట్టు చక్కని కథ నొకదానినిఅల్లి అందరికీ చెపుతూ వుంటుంది. ఏరూర్వారివారి (శ్రీదేవితల్లుల తల్లుల వరుసలనుబట్టి ముత్తాతలు) వంశాగతలైన ఆడపడుచులకు ఈ రెండుమూడుతరాలనుండీకూడా పల్లెటూళ్ళనుండి వచ్చి పట్టణాలలో స్థిరపడిమన్న భర్తలే దొరుకుతున్నారటగాని పుట్టుకతోనే పట్టణవాసులైన భర్తలు దొరకటంలేదట. ఆమెమాటలలోనే చెప్పవలసివస్తే అది మాతామహుడు ఆ యింటి ఆడపడుచులకు తెచ్చిపెట్టిన 'శాపం'. శ్రీదేవి తల్లితండ్రికూడా శ్రీదేవితండ్రిలాగే పల్లెటూరిపుట్టుకా పట్టణం కాపురం. అందుచేతనే వాళ్లు ఏళ్లుగడిచినవెనుకనైనా ఆ వాసనలు విడువలేక కూతుళ్ళను మళ్లామళ్లా తమబోటి పల్లెటూరి వారికే వెతికి ఇస్తూఉంటారట.

ఈ విచిత్రవ్యాఖ్యలో యథార్థత వివరించటం ఎంత ఉన్నదో దానిని మభ్యపుచ్చటం కూడా అంత ఉన్నది.

నిజానికి శ్రీదేవి తల్లి అంగీకారంలేనిదే ఈ పెళ్లిళ్ళు రెండూ జరిగిఉండలేవు. కాని ఆమె ఆ విషయాన్ని అట్లా బాహాటంగా అంగీకరించటానికి ఎంతమాత్రం ఇష్టపడదు.

శ్రీదేవి తల్లిలో ఆమెకే తెలియని ఒకానొక విచిత్ర ప్రవృత్తి—ఆమె నాగరికతకు సంబంధించినది రహస్యంగా దాగిఉన్నది. దాని స్వరూపస్వభావాదులామెకు విస్పష్టంగా తెలియకపోయినా దాని ప్రేరణతనే ఆమె అనేక విషయాలలో తన కాయుష్కరమేదో తన అభివృద్ధి కేదిదోహదకారి కాగలదో అతి సులభంగా తెలుసుకుంటూ ఉంటుంది.

అట్లా తెలుసుకునే ఆమె—తన భర్త తమకున్ననీ చెందినవీ అయిన అభివృద్ధిమార్గాల నన్నింటిని పుత్రులకోసరమే మూటగట్టినట్టు కూతుళ్ళకు వారు కోరగల వివాహాలు కాకుండా ఇవ్వగల వివాహాలు చేస్తూఉంటే తాను మాటాడక ఉదాసీనత వహించి ఊరుకున్నది. కాక—అనేక విషయాలలో తన అభిమతానికి పరిస్థితులు విరుద్ధంగా ఉన్నట్టు తోస్తే వాటితో పోట్లాడి ఎల్లాగో నిగ్రహించుకుంటూ వచ్చిన ఆమెది ఇప్పుడిట్లా భర్తృనిర్ణయానికి అకస్మాత్తుగా కట్టుపడిపోయిందంటే అర్థంలేదని చెప్పాలిసి ఉంటుంది.

ఈ విషయం మొదట్లో కాకపోయినా తరువాత తరువాత ఆమె కూతుళ్లుకూడా నెమ్మదిగా గ్రహించ సాగారు. వాళ్ళకు ఏళ్లు పైబడుతున్నకొద్దీ—లోకాన్ని చూచినకొద్దీ—తల్లిలోగల—పరిస్థితులను మార్చుకోగల చాకచక్యం—పట్టుబడకపోయినా తమ మంచిని సూచించే ప్రవృత్తిని వినగలగడం బాగా పట్టుబడుతూ ఉన్నది.

'మంచి' అనేది మనుష్యకోటి కంతటికీ ఒక్కటేకాదనీ మనుష్యుల స్వభావ సంస్కారాదులనుబట్టి అది మారుతూఉంటుందనీ గ్రహించగలుగుతే

శ్రీదేవి అసంతృప్తి కారణం ఏమన్న ప్రశ్న కలుగదు. పెండ్లినాటికి కాలేజీ లెక్చరర్లంటే ఉండే అభిప్రాయం పెండ్లైన తరువాత లోకం చూచాక అంతకన్నా నలుగురు మాటలూ నాలుగు రకాల విన్నాక చాలా మారిపోయింది. తనకు లభించిన జోడు తాను కోరగలది కాదని తెలుసుకున్నది లగాయితూ శ్రీ దేవిలో ఒక విధమైన ఆక్రోశం పెరగసాగింది. ఆ ఆక్రోశాన్ని బహిర్గతం చేసుకోవడంలో ఆమె తనలో అంతకు ముందు లేనివికూడా అనేక దుర్గుణాలు ఒక్కొక్కటే అలవాటుచేసుకొని వాని నన్నింటినీ ప్రదర్శిస్తూ ఆ యింటి అందరికీ ఆ విధంగా చెడ్డదయి కూర్చొన్నది.

4

శ్రీ దేవిని లాగే శ్రీ రామారావునుకూడా ఆ యింట అందరూ పరాయివాణ్ణిగానే చూస్తారు.

దానికి హేతువుకూడా శ్రీ దేవిరాకయేగా కనిపించినా అసలు కారణాలు చాలావఱకూ వేరుగనే ఉన్నవి. వానిలో కొన్నింటి బీజాలు శ్రీదేవి భూదేవిపై పడకముందునుంచీ ఆ కుటుంబంలో పడిఉన్నవన్నా చింతలేదు.

శ్రీదేవి అత్తవారియింట పాదంపెట్టిన ఆ యేడాదే శ్రీ రామారావు తండ్రిగారు కాలంచేశారు. ఆయన పోయేసరికి వారిని కొన్ని భూముల వ్యవహారాలూ మరికొన్ని నగదు వ్యవహారాలూ అపరిష్కృతములుగా ఉండి పరిష్కారోన్ముఖమైనవి ఉండెను. వానిని చక్కబెట్టడానికైతే నేం తక్కిన వ్యవసాయం మొదలైన యింటిపనులు చూడటానికైతే నేం మొగపిల్లలిద్దర్లో అక్కడ ఎవరు ఉంటారనే ప్రశ్న సహజంగా ఉద్భవిల్లింది. క్రొత్తగా ఉద్యోగం ప్రవేశించిన శ్రీ రామారావు తనకు తండ్రి శ్రాద్ధకర్మలకు శెలవు దొరకడమే బ్రహ్మాండమైపోయిందనగా అతడు రాకపోవటమే మంచిదిగా తలుస్తూ అప్పటికి బి. ఎ., సెప్టెంబరు పరీక్షలకు ట్యుటోరియల్ కాలేజీలో చదువుతున్న సూర్యాన్నే చదువు మానిపించి ఇంటివద్ద పెట్టింది వెంకటనరసమ్మగారు.

సూర్యానికీ శ్రీ రామారావుకూ అనేక విషయాలలో తేడాఉన్నదన్న సంగతి ఆదినుండీకూడా ఆ యింట ఒక విధంగా గుర్తింపబడే ఉండెను. ఆ యింటికి సంబంధించిన వ్యవహారాలూ లావాదేవీలూ ఐతేనేం లోకంలో మసలుకోవలసిన పద్ధతీ మాటాడవలసిన వైఖరి ఐతేనేం సూర్యానికి తెలిసినంత చక్కగా శ్రీ రామారావుకు తెలియదని ఆ యింట అందరిలోనూ ఒక గాఢమైన విశ్వాసం శ్రీ రామారావు తండ్రిగారే బ్రతికిఉన్న రోజులలో బాగా కలిగించిఉన్నారు. దానికి తోడు శ్రీదేవి రాకకూడా కొంత తోడుకాగా వాళ్ళప్పట్లో సూర్యం ఇంటికి రావడమే మంచిదని ఏకగ్రీవంగా అందరూ తలంచారు, సూర్యంకూడా తనకు లభించిన గౌరవాన్ని దక్కించుకుంటూ అందుకు తగిన విధంగానే అన్ని విషయాలలోనూ చాలా జాగ్రత్తగా ప్రవర్తిస్తూ వచ్చాడు.

చిన్నకొడుకు ఇంటికివచ్చిన వెనుక ఆ తల్లికీ అతడికీ ఉంటూవచ్చిన సాన్నిహిత్యం ఇతోధికంగా ఎక్కువ అయ్యింది. ఆ కొడుకు ప్రతివిషయం లోనూ తన సలహా తీసుకుంటూ సర్వం చక్కదిద్దుక వస్తూవుంటే ఆమెకు సహజంగా అతనిపై ఒకవిధమైన సానుభూతీ అపేక్షా క్రొత్తగాపుట్టి వృద్ధికాసాగాయి. ఆ వెలుతుర్లో చూస్తే ఆమె తన యిద్దరుకొడుకులను గురించీ పెట్టుకవస్తున్న భావాలన్నీ నిజంలా తోచడమేకాకుండా పెద్దకొడుకు మొదటినుండీకూడా ఒట్టి స్వార్థపరుడుగానూ డబ్బుకోసరంతప్ప యింకయెందుకూ ఆయింటివంక చూడనివాడుగానూ కనుపించసాగాడు.

అప్పట్లో పట్టణాలలో ఉంటూ చదువుకోవడంలో శ్రీ రామారావు తాను ఒక్కడూ ఉండేటప్పుడు తమ్ముడు వెంటనుండినప్పుడూకూడా తానే డబ్బుకోసరం యింటికి ఉత్తరాలు వ్రాసేవాడు. చదువుకొనే కొడుకులు శెలవుదినాలలో యిళ్లవద్ద అతితక్కువగా గడిపేదినాల ముద్రలకన్నా వాళ్లు దూరంగా ఉండినప్పుడు వాళ్లకోసరం ఎదురుచూచినప్పటి అనుభూతులముద్రలే—వాళ్లువ్రాసినఉత్తరాలముద్రలే—తల్లిదండ్రులహృదయాలపై ఎక్కుడు బలంగా ఉండిపోతవి. అదృష్ట్యా అప్పట్లో క్షేమసమాచారాలు వ్రాయటానికి బద్ధకించిన శ్రీ రామారావు ఇప్పుడిట్లా కనిపించసాగాడు.

అప్పటికీ ఇప్పటికీ తేడాఏమంటే ఆరోజుల్లో శ్రీ రామారావుపై తండ్రి యీ ఆరోపణనుచేయగా

వెంకటనర్సమ్మగారు అతడిపక్షం 'వకాల్తా పుచ్చుకొని' వాదించేవారు. బహుశా అందునుంచే నేమో ఇప్పుడిట్లా తానుగా ఆరోపణచేస్తూ దానిని తానే బలపరచుకవస్తున్నది ఆమె.

ఆతల్లి అట్టిభావనలను పెంచుకోవడానికి దోహదంగా శ్రీ రామారావులో ఇంకొక పెద్దలోపంకూడా ఉన్నది. అతడు తనకు కావలసినవారి ఎడలకాని— కనీసం ఆప్తులఎడనైనా ఎన్నడూ ఏవిధమైన ఆపేక్షలూ వెల్లిబుచ్చే స్వభావానికి చెందిన మనిషి కాడు. ఆరేళ్లయి ఉద్యోగం చేస్తున్నాడన్నమాటేగాని ఇంతవరకూ ఒక్కసారి అయినా తనయింటికి పిలిచి ఒక ఆడపడుచుకుగాని తల్లికిగాని ఒక్క గుడ్డముక్కైనా ఇచ్చినపాపాన పోలేదు. ఎక్కడకుపోయినా ఒట్టి చేతులలో వేపోయి ఒకపూటో ఒకరోజో కన్న ఎక్కువ వుండటానికి పెద్ద బ్రహ్మాండం వగల జేస్తాడు. కోరి తనయింటికి వచ్చినవారి విషయంలో కూడా అతడు యిట్లాంటి ఉదాసీనపద్ధతే అవలంబించి అందరికీ కోపం తెప్పిస్తూ ఉంటాడు. అదంతా అపేక్షలు లేకా, వెళ్ళబుచ్చటం తెలియకా అయితే అది వేరేసంగతిగా ఉండేది. శ్రీ రామారావు తన సంస్కారందృష్ట్యా ఇట్లాంటి వ్యవహారమంతా చాలా కృత్రిమమే కాక శుద్ధనటన అనికూడా అనుకుంటారు. కానీ పుస్తకస్థములైన అతని మనసంస్కారపు విలువల ఔన్నత్యం వానిని చదువని అతని తల్లికిగాని అక్కచెల్లెళ్లకుగాని తెలియటం అసంభవమని అతడు గ్రహించి ఉండవలసింది.

అట్లానే సూర్యంకూడా ఇంటికివచ్చాక తన అన్నగారిగురించి కొన్ని చిత్రములైన అభిప్రాయాలు ఏర్పరచుకో సాగాడు. ఊరివారిదృష్టిలో శ్రీ రామారావు అతి సజ్జనుడే కాక అమాయకుడు కాగా— సూర్యం దండశాసనత్వానికి తోడు మంచి గడుస్తనం కలవాడు. వాళ్లనేవారు, చిన్నబ్బాయిగారు మాటలు కాడికి 'మంచివాడైనా' డబ్బు దగ్గరకువచ్చేసరికి నిక్కచ్చిమనిషై కూసుకుంటారు.' నందిని పందినీ, పందిని నందినీ చేయగల సామర్థ్యం యీయనదైతే యింక 'అయినా—ఆయనదంతా మాయామర్మంలేని 'మారాజు' మనసు.

ఇచ్చకానికైతేనేం నిజంగానైతేనేం లేక పరిస్థితులు కలిగించిన భ్రమచే లోకులు మోహితులవడం వల్లనైతేనేం ఆ అన్నదమ్ములనుగూర్చి వాళ్ళంతా ఇట్లా అనుకోవడంవల్ల ఆ కుటుంబపు వ్యవహారాల చక్కబాటు విషయంలో అది చాలా మంచిగా పని చేసినా మన స్తత్వాలదగ్గరకు వచ్చేసరికిమాత్రం మహా విషంగా పనిచేయసాగింది. సూర్యం యువకహృదయంలో దీనివల్ల అన్నగారిపై ఏ విధానా అణచుకోవటానికి సాధ్యపడని ఈర్ష్య ఒకటి క్రొత్తగా మొలకెత్తి క్రమక్రమంగా అభివృద్ధి కాసాగింది.

అది తెచ్చిపెట్టే ఐంద్రజాలిక వర్ణాలలో అతనికి శ్రీ రామారావు ఒక మేక వన్నె పులిగనూ అతి కుచ్ఛితుడుగనూ కనిపించేవాడు. తన స్థానాన్ని తాను పదిలపరచుకొంటూ పైగా నంగనాచిలా సూర్యాన్ని మధ్యలో చదువు మానిపించి ఆ పల్లెటూరిలో ఉమ్మడి ఆస్తుల రక్షణకు పెట్టి కష్టనిష్ఠూరాలు అతడికి కాగా ఫలితంమాత్రం తాను పంచుకుంటూ— అతడు కోతీ, పిల్లీ, జడిపిక్కల కథలో పిల్లిని కోతిలా తనను ఉపయోగించుకుంటున్నాడు అనిపించేది సూర్యానికి.

ఇట్లా ఆ తల్లీ కొడుకులలో అతిసహజంగా అందులో వాళ్ళ ప్రయత్నమేమీ లేకుండానే అత్యంత అసహజమైన విద్వేషభావాలు ఆ ప్రవాసి శ్రీరామారావుపై నలుగుతూ వచ్చినవి. వాటిని చాలా కాలంవరకూ వారిద్దరూ ఎవరికుట్టుకు వారుగా లోలోన దాచుకుంటూ వచ్చినా ఒకనాటికవి వ్రణములలోనుండి పూయములవలె బయటకు రాక తప్పాయి కావు.

వెంకటనర్సమ్మగారు అంతో ఇంతో కోపిష్ఠీ పెద్ద గొంతుక పెట్టి అరిచి సాధించే రకం ఐతే అవవచ్చుకాని ఆమె వస్తుతః వట్టి భోళామనిషి. కాగా ఆమెలోని పెద్దకొడుకు తల్లి మొదట్లో అల్లా ఉదారంగానో బలహీనతచేతో దీనినంతా సహించుకూ ఊరుకున్నా ఒక స్థితిలో వెంకటనర్సమ్మగారొక అంతిమ నిర్ణయానికి వచ్చేసరికి, తిరగబడి ఇదంతా అన్యాయమంటూ ఆమె అంతరంగాన్నంతా కలచివేసే ధోరణిలో—'వీధిని జెట్టి' నానా హంగామా చేయసాగింది. అందుచేతనే ఆమె తనలో తాను పోట్లాడుకొంటూ అందరినీ తీర్పు చెప్పడానికి పిలిచినట్టు ప్రోగుచేసి వాళ్లముందు తన అభిప్రాయాలను సోదాహరణంగా వినిపించటం ఆరంభించింది.

ఆదిలో ఆమె శ్రీజీవిని సాకుగా చేసుకొని శ్రీరామారావును నిందిస్తూ వచ్చినా క్రమంగా ఆమె

నూటికిగాకూడా అతని స్వభావాన్ని మతాన్నీ విమర్శించటం ఆరంభించింది. సూర్యం యీ చర్చలన్నింటిలో శ్రీరామారావును సమర్థిస్తున్నట్టు కనబడుతూనే అతనిలోని లోపాలను అందరికీ వివరంగా ఎత్తి చూపేవాడు. క్రమంగా యీ భావనల బీజాలు ఆ బంధువర్గంలో ఒకరినుండి ఒకరికీ—వారినుండి వేరొకరికీగా ఆ వర్గంలో అందరిలోనూ వ్యాపిస్తూ అనేకవిధములైన పాఠాంతరాలు చెందుతూ వచ్చినవి. అట్టివానిలో కొన్నింటిని శ్రీరామారావు వినటంకూడా తటస్థించినది.

అతడు వీటి అంతరార్థాన్ని గురించి ఊహించడానికి ప్రయత్నం చేస్తూ ఒక్కొక్కసారి దీని కంతటికూ కారణం శ్రీదేవి తోడి వివాహం అనుకుంటాడు. వేరొకసారి తనవారి అజ్ఞానంతో పాటు తనయొక్క దురదృష్టమే తనకు చెందిన సర్వవిధములైన అనర్థములకూ మూలకారణాలు అనుకుంటాడు.

## 5

పరిస్థితులు ఇట్లాంటివి కాబట్టే శ్రీరామారావు గొలుసుపోయిన విషయం నలుగురుముందూ పెట్టడానికి ఎంతగానో వితర్కించవలసి వచ్చింది.

ఇంతవరకూ తమ కుటుంబంలో ఆ అత్తాకోడళ్ల నడుమగాని తన మధ్యా తక్కినవారిమధ్యనూ గాని ఎన్నడూ ఏ అప్రియసంఘటనా ప్రత్యక్షంగా జరిగిఉండనిమాట నిజమే. కాని ఇంతమంది బంధువర్గంవారు చుట్టూ ఉండటంవల్ల ఏ పరిస్థితులు ఎట్లా వచ్చి ఆగోడు కొస్తా చెడగొడతాయోనని శ్రీరామారావు చాలా భయపడసాగాడు.

అతడా ఉదయమల్లా యీ విషయంపై అతి దీర్ఘంగా ఆలోచిస్తూనే ఉన్నాడు. మనిషి పందిట్లోనూ విడిదిలోనూ మసలుతూనే ఉన్నా మనసల్లా దానిమీద పెట్టి ఏ యితర విషయమూ లోనికి పట్టించుకోవడంలేదు.

అతడికి ఏం తెలిసినా ఏం తెలియకపోయినా ఒక్క విషయంమాత్రం బాగా తెలుసు. వేయి రూపాయలంటే—అది తనకైనంత తక్కువ మొత్తంగా ఆ యింటిలో యింక యెవ్వరికీ కాదు. తన తల్లిగాని తమ్ముడుగాని యీ విషయం వింటే వాళ్లు తనలా నిదానిస్తారనే ధైర్యం అతడి కేవిధంగా చూసినా కలగటంలేదు. వాళ్ల అసలే కోతివంటి శ్రీదేవికి తేలు కుట్టిఉన్నదనే సంగతి గుర్తించక వాతకూడా పెట్టి రెచ్చగొట్టవచ్చును. దానిమీద ఎలాంటి సన్నివేశాలు ప్రభవించడానికి అవకాశమున్నదో—ఆ విషయం శ్రీరామారావు కూడా చెప్పలేడు.

ఒకవేళ వారు ఊరుకున్నా చుట్టూఉన్న మహాజన మండలి వారిని ఊరుకోనిస్తుందనే నమ్మకం ఏమాత్రం కూడా అతడికి కలగటంలేదు. అంతమంది బంధువుల నడుమ ఎవ్వరు ఏ నిష్కారణంవంటి, ఒక భావాన్ని ఎక్కడ విదల్చి ఏ మహాగ్నులను రగులజేస్తారో చెప్పడం కష్టం. దానితో అనుమానాలూ అయివుండటాలూ అపప్రథలూ ఆరోపణలూ అసత్యాలూ సత్యాలూ బుజువులూ ప్రామాణికాలూ పెట్టెలు తెరిపించి చూడడాలూ ఏడుపులూ మొర్రలూ పోలీసు రిపోర్టులూ మరిగి కంపుగొట్టే ఎవ్వరెవ్వరి ప్రాతకథలూ అలిగిపోవడాలూ బతిమలాడడాలూ అభోజనాలూ—ఒకటేమిటి ఏం జరిగినా ఎంత జరిగినా జరగడానికి అవకాశం ఉండినట్టే కనుపించింది. కొన్నికొన్నిచోట్ల ఇట్లాంటి సందర్భాలలోనే మనుష్యులు జన్మలకు సరిపడే వైరాలను సృష్టించుకొని వాటిని ఆ జన్మాంతం పరిపోషించుకుంటూ కూర్చోవడం కూడా కద్దని శ్రీరామారావు బాగా ఎరుగును.

కాగా అతడికి ఇంకొక ఆశకూడా లేకపోలేదు—

శ్రీదేవి ఆ నగను అక్కడా ఇక్కడా అజాగ్రత్తగా పారవేసినదేమీ లేదు. గతరాత్రి తొమ్మిది గంటలవరకూ నగ ఆమె మెడలోనే ఉండెను. అప్పుడు బట్టలు మార్చుకుంటూ ఆమె దానిని తీసి పెట్టెలో చీర మడతలనడుమ ఉంచింది. ఆమెకు సాధారణంగా ఆభరణాలను ఒక ప్లాస్టిక్ పెట్టెలో పెట్టి దాచడమే అలవాటు. అయినా దానిని యీ పెండ్లికి తెస్తే పల్లెటూరిమూకలో ఏ పేచగోడలైనా అడిగి పోతుందేమోనని ఆమె భయపడ్డది.

అట్లా దాచిన ఆ వస్తువును ఎవరో దొంగిలించి ఉంటారనడానికి ఏవిధమైన అవకాశం కానరాదు. పెట్టెకు వేసిన కప్పవేసినట్టే ఉన్నది—అది చాలా గట్టిది. శ్రీదేవి ఏ నెపానా దాని తాళం ఇతరులచేతికి యీయలేదు. శ్రీరామారావు దగ్గర డూప్లికేట్ ఉన్నా దానిని అతడు కూడా ఎవ్వరికీ ఇవ్వలేదు. పోనీ తాళాలే తస్కరించి ఎవ్వరో యీపని చేసిఉంటారనుకుంటే ఆ అవకాశంకూడా ఉండినట్టు కాన

రాదు. శ్రీదేవి తాళం పైటచెరగుక్రింద ఒక పిన్నులో రవికెకు తగిలింపబడి ఉంటుంది. శ్రీరామారావు దగ్గిర తాళం పర్సులో ఉంచబడి అతని పెట్టెలో ఉండగా, ఆ పెట్టెతాళం మళ్లా శ్రీదేవి తాళంతో జోడింపబడి ఉంటుంది.

ఎటువచ్చీ నగపోయిన విధం ఊహించడానికి రెండేరెండు మార్గాలు ఉన్నాయి. శ్రీదేవి బట్టలు సర్దుతున్నప్పుడు అక్కడ దగ్గరలో చేరిగాని లేక ఆ తరువాత ఆమె మళ్ళా దేవిడీగదిలో పెట్టె తెరచి వెతికినప్పుడు బట్టలు క్రిందా మీదా పెట్టడంలో పైన జారిపోతేగాని-ఎవరో దానిని సంగ్రహించి ఉండాలి. కాని శ్రీదేవి తాను పెట్టె రెండుసార్లు తెరచినప్పుడూ దగ్గరలో ఎవ్వరూ ఉండిన జ్ఞాపకం లేదంటుంది. కాబట్టి నిశ్చయంగా ఆ నగ రెండవపద్ధతినే పోయి వుండాలి.

ఇంక—

అట్లాంటివా రెవ్వరో—వారు వస్తువును దాచేసుకొనే ఉద్దేశంతో ఉంటే తమ జాగ్రతలో తాము ఉంచనే ఉంటారు. అమాయకులైఉండి అట్లా జాగ్రతపడకపోతే పైన పేర్కొనబడ్డ రభసల్లో ఏదో ఒక రభస తప్పక ఏర్పడి అత్యంత అవాంఛనీయములైన పరిస్థితులు కూడా ఒక్కొక్కప్పుడు అతి అసహ్యంగా కూడా ఏర్పడవచ్చును.

లేక అదృష్టమే బాగావుండి శ్రీరామారావు తొంబది తొమ్మిది వంతులుగా నమ్ముతున్నట్టు అది ఎవ్వరికో తమవారికే దొరికితే వాళ్లు ఒకపూటో రెండు పూటలో మాటాడక ఊరుకొని తరువాత చీవాట్లు పెట్టో పెట్టకో మొత్తానికి వస్తువును తిరిగి ఇచ్చివేస్తారు. ఈలోగా ముందుగా తామై కదపడం వల్ల మొదట్లో ఊహించిన అత్తా కోడండ్లమధ్య అసంబద్ధ పరిస్థితులు ఏర్పడి వికటించవచ్చు.

ఇట్లా ఆలోచించే శ్రీరామారావు ఏది ఏమైనా చివరకు వస్తువు పోయినా సరే పోనిమ్మని ఆ విషయం నలుగురిముందూ పెట్టకుండా ఉండటానికే నిశ్చయించాడు. కాని శ్రీదేవి చిత్తవృత్తి వేరుగా ఉండెను.

ఆమె—భర్త ఏ పరిస్థితులకైతే జడిచి వేయి రూపాయల నగనూ విడచుకోవటానికి కూడా సిద్ధపడ్డాడో ఆ పరిస్థితులనే అవసరమైతే తానుగా సృష్టించి ఎంత రట్టుపడ్డా అందరితోనూ పోరాడి అయినా తన వస్తువును తాను రాబట్టుకోవడానికే నిశ్చయించుకున్నది ఆమె. ఆమె ఊహల ప్రకారం నగను ఎవ్వరో దొంగిలించి ఉంటారనటమే తథ్యం. అది ఎవరైనా తీసి జాగ్రతచేసి ఉండవచ్చునే ఊహ ఆమెకు కలుగలేదు సరికదా శ్రీరామారావు దానిని సూచించిన వెనుకనైనా అది ఒక అసంబద్ధపు పిచ్చి ఊహగానే నమ్మింది. అందుచేతనే ఆమె శ్రీరామారావు నగపోయిన విషయం ఎవరితోనూ చెప్పవద్దని చెప్పినప్పుడు ఎటూ చెప్పకుండా మాటాడక గుంభనగా ఊరుకొన్నది. తరువాత మాత్రం తన ఊహలూ ప్రయత్నాలూ ఎప్పటిలా సాగించుకొనిపోతూ తన పద్ధతి తాను విడిచిపుచ్చలేదు.

ఆమె ఆ పెండ్లియింటగల మూడునాలుగు వందల మందినీ వాళ్లవాళ్ల ముఖకవళికలనుబట్టీ చేష్టలనుబట్టీ తనకు తెలిసిన మేరకు తన ఊహకందిన మేరకు వాళ్ల వాళ్ల చరిత్రలూ స్వభావాలనుబట్టీ ఆపని చేయడానికి వాళ్ళకుండగల అవకాశాలనుబట్టీ ఎవరు తీసి ఉంటారా అని చాలా జాగ్రతగా ఆలోచించింది. చివరకు ఆమె పెద్దాడబడుచు—శ్రీరామారావు పెద్ద చెల్లెలు—విశాలాక్షిపై తన అనుమానాల నన్నింటినీ క్షణక్షణంకూ కేంద్రీకరించుకోసాగింది.

## 6

విశాలాక్షి శ్రీరామారావు తల్లిగన్న సంతానం. ఐదుగురులోనూ రెండవబిడ్డ. శ్రీరామారావు ఆమె కన్న పెద్దవాడు కాగా తక్కిన ఆడపిల్ల లిద్దరూ సూర్యానికీ ఆమెకు తరువాతివారు. సూర్యం ఆ ఆడపిల్ల లిద్దరిలోనూ మధ్యవాడు. విశాలాక్షిని గూర్చి లోకంలో ఎన్నో చిత్రవిచిత్రములైన కథలు ఉన్నవి.

లోకులు ఆమె భర్త మహావ్యసని అనీ ముందూ వెనకా చూసుకోకుండా చిన్నప్పుడే పెండ్లిచేసి ఆమె తండ్రి కూతురుగొంతును చేజేతుల కోసిపెట్టుకున్నాడనీ ఇంకా ఏమేమో చాలా అంటారు. శ్రీరామారావు తండ్రి ఆమెను పాతికేండ్ల క్రితం శారదాబిల్లు హడావుడిలో అప్పటికి బ్రతికున్న ఆయన తల్లిగారిపోరు పడలేకనైతేనేం తనకు కూడా అంతో ఇంతో ఒక కార్యంచేసి చూడాలనే ఉత్సాహం కలగడంవల్లనైతేనేం అప్పటికి ఐదారేండ్ల వయసుగల ఆ పిల్లను వేలువిడిచిన మేనల్లున కొకనికిచ్చి పెండ్లిచేసినమాట నిజం. అప్పట్లో విశాలాక్షి భర్తది సుమారు లక్షరూపాయల పైచిలుకు ఆస్తి చరస్థిర రూపేణ ఉండగా పిల్లవాడు తండ్రికి

ఒక్కడే ఒక మగబిడ్డగా ఉండెను. అంతకుముందూ దరిమిలానూ పుట్టిన అతని తోడబుట్టువులు అందరూ ఆడపిల్లలు—వాళ్లయినా పుట్టగానే కొందరూ అంతో ఇంతో పెరిగి కొందరూగా మొత్తానికి అందరూ అర్ధాయుష్కులే అనిపించుకున్నారు. ఇట్లా పిల్లవాడు ఆస్తికంతటికీ ఏకైకవారసుడు కావటమే కాకుండా పైగా అతడు చదువుకూడా వెలగబెడుతూ ఉండెను. ఎటువచ్చీ వివాహం నాటికి ఆ సంబంధంలోగల ఒకే ఒక లోపం పిల్లవాడు విశాలాక్షి సౌందర్యానికి తగినంతటి చక్కనివాడు కాకపోవటం. కాలగతిలో ఈ అసలు లోపం ఎవరికోతప్ప ఒక పెద్ద లోపంగా కనుపించడమే మానుకొన్నా కొన్ని క్రొత్తలోపాలు ఎవ్వరూ ఊహించి ఉండనివి విశాలాక్షి భర్తలో పొడచూపి వాటి పుట్టుకకు ఏవిధానా బాధ్యులుకాని ఆ ముసలాయన చరిత్రపై నిష్కారణంగా నిందలుమోపి విడచిపెట్టినవి.

విశాలాక్షికి పంద్రెండేండ్ల వయసులో ఆమె మామగారు ఎవ్వరూ ఊహించని విధంగా పక్షవాతంతో కొద్ది దినాలు తీసుకొని బ్రతుకుతాడని ఆశ కలిగిస్తునే బ్రతక్కుండాపోయారు. ఆసరికి నరసింగరావు ఆ నడుమనే చదువుమానుకొన్న నిండా ఇరవై సంవత్సరాలైనా దాటని ఒక ధనవంతులయింట దక్కక దక్కక దక్కిన ఒక్కగాని ఒక్క మొగ పిల్లవాడు. తండ్రి బ్రతికిఉండగా ఆ పిల్లవానికి లోకజ్ఞానం సంపాదించే అవకాశం ఏమాత్రంకూడా లేకపోగా ఆయన పోయాక అతడు దానిని సంపాదించే ప్రయత్నం నెమ్మదిగా ప్రారంభించాడు. ఆ ప్రయత్నంలో ఆస్తి అంతా హరించుకపోగా చివరి కొకనాటికి మనిషిమాత్రమే ఎట్లానో మిగిలిపోయాడు.

నరసింగరావు తండ్రి గడించిన ఆస్తి చాలావరకూ బ్యాంకు నిలవల రూపంలోనూ కొద్దిగా ఋణపత్రాల రూపంలోనూ ఉండెను. పిత్రార్జితంగా ఆయన విడిచిన స్థిరాస్తి అల్లా—వాళ్లు ఉంటూవచ్చిన ఒక మేడా, అద్దెకు ఇచ్చిన ఒక చిన్న డాబా. వాళ్లకు భూములుకూడా ఉండెనుకాని వానిని అమ్మే నరసింగరావు తండ్రి వర్తకంలో ప్రవేశించారు. నరసింగరావు ముద్దుబిడ్డ కావటంవల్ల ఇప్పుడల్లా తొందరేమివచ్చె అంటూ ఆయన ఆ పిల్లవానికి ఎన్నడూ డబ్బు సంపాదించే మార్గాలు నేర్పలేదు. ఏతావాతా ఆయన పోయిన యీ పద్దెనిమిదేళ్లలోగానూ నరసింగరావు బ్యాంకు నిలవలను ఋణపత్రాలనూ చెల్లగొట్టడమేకాక మేడపైనా డాబాపైనా ఎంతవరకూ అప్పు పుట్టగలదో అంతవరకూ పూర్తిగా అప్పుచేసి ఊడిచిపెట్టాడు.

నరసింగరావు చిత్తుగా త్రాగుతాడనీ వ్యసనాలకు దోచిపెట్టాడనీ హద్దూపద్దూ లేని జూదం ఆడుతాడనీ 'ప్రజలు' పదినుండీ పదిరకాలుగా చెప్పుకుంటారు. కాని ఇందులో నిజం ఎంతఉన్నదో అతిశయోక్తి ప్రాబల్యం కూడా అంతకు అనేకరెట్లు అధికంగా ఉన్నదనే అనాలి.

నరసింగరావు త్రాగి ఉండగాగాని త్రాగుతూ ఉండగాగాని చూసినవాళ్లు ఎవ్వరూ లేరు. ఎప్పుడైనా ఏ స్నేహితుల ఒత్తిడివల్లనో దానిని కాస్త మచ్చు చూశాడేమో ఆ సంగతి అతనికీ అతని స్నేహితులకూ మాత్రమే తెలియాలి. అట్లానే స్త్రీ వ్యసనము ప్రథమ యవ్వనంలో కాస్తో కూస్తో వుండిన మాట నిజం; కాని నిండుయవ్వనంలో అంతకన్నా నిండు సౌందర్య లావణ్యాలతో విశాలాక్షి ఆ యింట ప్రవేశించాక అతడు క్రమక్రమంగా ఆ వ్యసనానికి తనమండి స్వస్తిచెప్పకో సాగాడు—

ఎటువచ్చీ అతడు భోగి; జూదం ఆడతాడు. మూడవ వ్యసనంగా లోకంచే గుర్తింపబడనిదీ అతనిలో ఉన్నదీ మనుష్యులంటే అతడికి ఉండే గాఢమైన అపేక్షలు.

నరసింగరావు తన ఆస్తిలో నూటికి తొంబది ఐదుపాళ్లు వీటిక్రిందనే ఖర్చుచేశాడు. అందులో నాలుగింట మూడుపాళ్లు అతడు అడిగినవాళ్లకూ అడగనివాళ్లకూ పంచియీయటంవల్లనూ దరిద్రులైన స్నేహితులూ కృతఘ్నులైన చుట్టాలుక్రింద వ్యయపరచటంవల్లనూ తాను పుష్కలంగా అనుభవించటం వల్లనూ పాడైపోయింది. ఒక సినిమా చూపదలచి పదిమంది స్నేహితులను వెంటబెట్టుకొని వందకి తక్కువ కాకుండా ఖర్చుచేసిన సందర్భాలు ఎన్నో ఉన్నవి. ఒక్క కానీ పోగొట్టుకొని రోడ్డువెంబడి ఏడుస్తూ పోతున్న ఏ పసిబిడ్డనో చూచి జాలిపడి గుప్పెడు కానులు దాని జేబులో పోసినవంటి ఘట్టాలూ బీద బంధువుల ఆడపిల్లలకు పెళ్ళిళ్లు కావలసిఉంటే తానుగా పూనుకొని వందలకు వందలు వదిలించుకొన్న ఘట్టాలూ చాలా ఉన్నవి.

అయితే లోకం మొదటిరకం ఖర్చులను లెక్కవేసుకున్నంతగా రెండవరకం ఖర్చులను లెక్కవేసు

పోదు. ఒకవేళ వేసుకున్నా దూబరాఖర్చు అంటూ చెడుకు చేసిన దుర్వ్యయంలా దానిని లెక్కవేస్తుందిగాని మంచికి వేయదు.

ఇట్లా తాను మహా ప్రవాహంగా కోలుపోతూ వచ్చిన సంపదను తిరిగి గడించడానికి అతడు జూదం ఆడి మిగతా ఆస్తినంతా కోలుపోయాడు.

జూదం అంటే అందరూ అనుకునేటట్టు అది పేక ఆట ఒక్కటిమాత్రమే కాదు. పేకాటా, కాటన్ మార్కెట్, రేసెస్, క్రాసువర్డ్స్ పజిల్సు—ఒకటేమిటి ఇలాటివి ఎన్ని ఎన్ని రకాలు ఉన్నవో అన్నిను. వీటన్నింటినీ అతడు ఆదిలో ఉబుసుపోకకు అలవాటు చేసుకొన్నా కొంతకాలానికి అవి వ్యసనాలుగా పరిణమించి కాలక్రమేణా అందులో అతడికి ప్రావీణ్యం లభించడంతో ఇప్పుడతడు వానిని వృత్తిగాకూడా స్వీకరించాడు.

జూదం నిశ్చయంగా అవాంఛనీయమైన వ్యసనమే ఐనా అది అందరూ అనుకునేటంత ప్రమాదకరమైన వ్యసనం కాదని నరసింగారావు ప్రగాఢ విశ్వాసం. అందులో ఒకనాడు నాలుగువందలు పోయినా యింకొకనాడు మళ్ళా ఆ నాలుగువందలూ వచ్చే అవకాశం కూడా లేకపోలేదు. ఏండ్లకొద్ది సాధనవల్ల ఎల్లప్పుడూ కాకపోయినా తరచు లాభాన్ని మాత్రమే పొందే ప్రయోజకులు కొందరైనా తయారై ఉండగలారు. లేకపోతే ఓడిపోయే వాళ్ళు పోగొట్టుకొంటున్న డబ్బు ఎక్కడికి పోతున్నదన్న ప్రశ్న ఉద్భవిస్తుందంటాడు నరసింగరావు.

నరసింగరావు తాను యిప్పుడట్టి ప్రయోజకులలో ఒకడుగా తయారైనట్టు తలంచడంవల్లనైతేనేం అతడింకొక వృత్తినీ దేనినీ అంతపాటి ఆదాయం యిచ్చేదానిని చేయటానికి తగిన సామర్థ్యంగాని నైపుణ్యంగాని కలిగిఉండకపోవటంవల్ల నైతేనేం దీనినే అతడు వృత్తిగా పెట్టుకొని నిర్వహిస్తున్నాడు. అయితే అందులో సుగుణమేమంటే అతని యీ వ్యసనాలలోని ఏ ఒక్కటి కూడా ఇంతవరకూ అతనిలోని మానవత్వాన్ని పాక్షికంగానైనా ఆహరించుకొని ఉండకపోవడం.

నరసింగరావు చామనచాయరంగులో సన్నంగా రివటల్లే ఎల్లప్పుడూ విలువైనబట్టలలో అతిపరిశుభ్రంగా ఉంటాడు. అతడు రోగంతో బాధపడుతుండినప్పుడైనా రోగగ్రస్తుడుగా కనుపించగలుగుతాడా అనిపించేటంతటి ఆరోగ్యవంతుడు. అతనిలోని జీవశక్తి క్షణం ఒకచోట నిలవనివ్వని చైతన్యాన్ని ఎల్లప్పుడూ కలిగిఉంటుంది. లోకంలోని గెలుపోటములూ సుఖదుఃఖాలూ రాగద్వేషాలూ మొదలైన సమస్తద్వంద్వాలకూ అతీతుడా అనిపించేటట్టు ఎల్లవేళలా నవ్వుతూ వుంటాడు.

అంతేకాదు—అతను బయట ఎట్లా సంచరించినా అతనికుండే వ్యసనాలవృష్ట్యానైతేనేం యితరకారణాలవల్లనైతేనేం లోకుల కతను చెడ్డవాడైనా మంచివాడైనా ఇంటికివచ్చేసరికిమాత్రం అతను అందరు గృహస్థులవలె సంసారంమీద చూపవలసిన ఆసక్తీ బంధువులఎడ స్నేహం ఆలిపైఅపేక్షా కనుక్కున్న బిడ్డలమీద వాత్సల్యం సమస్తం లోకసామాన్యమైన గార్హస్థ్యోచితంగానే ప్రసరిస్తూఉంటాడు. విశాలాక్షి వరుసబెట్టి నలుగురినీ ఆడపిల్లలనే కన్నా వెనుకనైనా అతడి కామెపై గల అపేక్షలలో గాని ఆ పిల్లలయందు గల శ్రద్ధాసక్తులలో గాని వచ్చిన మార్పు ఏమీ లేదు. ఎటువచ్చీ అతను గార్హస్థ్య పరిపాటికి విరుద్ధంగా ప్రవర్తించేది ఒక్క అత్తవారియింటి విషయాలలోనే.

అతడికి తన అత్తవారివంక మనుష్యులన్నా వారి వూరన్నా ఆ వూర్లో వ్యవహారాలన్నా అక్కడికి సంబంధించిన విషయం ఏది తీసుకున్నా అది అతనిలో చాలా చిరాకు కలిగిస్తుంది. అందులో మళ్ళా శ్రీరామారావు విషయంవస్తే దాని పద్ధతిఅంతా —వేరేగా వుంటుంది.

## 7

నరసింగరావుకు తన అత్తవారన్నా వాళ్ళ వ్యవహారాలన్నా ఒట్టి చిరాకూ ఇంతో అంతో కోపమేగాని ఆ అత్తవారికి అతనన్నా అతడి వ్యవహారాలన్నా చాలా ద్వేషంకూడా.

అతని విషయం వచ్చేసరికి వాళ్లు తమ పిల్ల సౌందర్య గుణగణాల నన్నింటినీ పేర్కొని అట్టి పిల్లకు అటువంటి 'నిర్భాగ్యుడు' భర్తగా దొరకడాన్ని గురించి—'కాకి ముక్కుకు దొండపండు కట్టినట్టు కట్టేశాము' అంటూ 'దాని' తలవ్రాత అలా ఉన్నది అని నిట్టూరుస్తారు. ఇందులో కట్టినవారిని నిందిస్తున్నట్టు వాచ్యార్థం నిరూపిస్తున్నా దాని వెనుక ధ్వనించే వ్యంగ్యార్థం కట్టుకొన్నవాడిని నిరసించటమే.

విశాలాక్షి పెండ్లి సందర్భంలోనే వెంకటనర్సమ్మగారు వారి యీ మేనరికపు సంబంధం యెడల తమ అయిష్టతను చాలా బలంగా ప్రకటించి ఉన్నారు. కాని అప్పట్లో ఆ యింట హుకుం చలాయిస్తూ ఉండిన ఆమె అత్తగారు మొగవాడికి అందమెందుకనీ, అందం కొరుక్కుతింటారా అనీ ఎక్కడెక్కడి అడ్డమైన కుతర్క కుఠారాలనూ ఎదురు తెచ్చుకొని వాడి, ఆమె వాదనలన్నింటినీ ఖండించి ఆమె నోరు మూయించింది. వెంకటనర్సమ్మగారి భర్త కూడా పిల్లవాని ఆస్తిపాస్తులూ ఏకైక వారసత్వం ప్రలోభాలుగా చూపి ఆమె నెట్లానో మెడలు విరిచి తమ పనిని పూర్తిచేసుకున్నారు. కాలగతిని సమస్తం తారుమారు కాగానే 'నే నప్పుడే అన్నాను విన్నారు కారు.' అంటూ నెత్తీ నోరూ మొత్తుకోవడం ఆరంభించింది.

తండ్రిపోయాక నరసింగరావు ప్రవర్తనలో వస్తూవుండిన తీవ్రమైన మార్పులను గురించి విశాలాక్షి కాపురానికి వెళ్లిన ఏడాదీ ఏడాదర్థం వరకూకూడా ఇక్కడివారికి ఎవ్వరికీ వాని ఆచూకీ ఏమీ అంతుపట్టలేదు. ఆపిల్ల రెండుమూడుసార్లు అత్తింటికిపోయిరావడంతో ఆమెద్వారా కొంతా ఆమెవెంట వెళ్లివచ్చేవారిద్వారా మరికొంతా చొప్పున క్రమక్రమంగా విషయమంతా అందరికీ తెలియసాగింది.

శ్రీ రామారావు తండ్రికి మొదట్లోనేం చేయాలో పాలుపోలేదు కాని ఒక ఏడాదిపాటు నరసింగరావును సంస్కరించడానికి ఎన్నెన్నివిధాల ఎందరెందరి ద్వారా ప్రయత్నించాలో అన్నన్నివిధాల అందరందరిద్వారానూ ప్రయత్నించి ఫలితం లేకపోగా ఆయన కొంతకాలం కూతుర్ని తనదగ్గర అట్టే పెట్టుకున్నారు.

ఆరోజుల్లోనే అసలు, వాళ్ళు, పిల్లను కాపురానికే పంపించరుట 'అంటే' నరసింగరావు రెండవ పెండ్లిచేసుకుంటాడుట 'అనీ' విశాలాక్షి తండ్రి మనోవర్తి దావా తెస్తాడు 'అంటే' 'ఆమాత్రం తెలివితేటలు నరసింగరావుకుకూడా లేకపోలేదు' అని ఇట్లా ఎన్నెన్నో లోకప్రవాదాలు రకరకాలుగా బయలుదేరినవి.

చివరకు ఎవరో పుణ్యాత్ములు దేవుడుపుట్టించిన సద్బుద్ధితో ఆ అల్లుడు మామలమధ్య ఎట్లానో రాజీనామా కుదిర్చి పెట్టారు. దానివల్ల ఆ రెండు కుటుంబాలమధ్య ఏర్పడ్డ పొరపొచ్చాలు నశించకపోయినా విశాలాక్షి కాపురం కుదుటపడ్డది.

ఆనాటి దుమారాల ఫలితంగానే నరసింగరావు ఇప్పటికీ ఏవో పెద్దపెద్ద కార్యాలూ కథలూ అయితే తప్ప ఆ యింటికి బంధు సరళిగారాడు. అతడి భార్య విశాలాక్షి రాకపోకలు కూడా తక్కిన ఆడపిల్లలతో సరిపోల్చి చూస్తే చాలా తక్కువనాలి.

వెంకటనర్సమ్మగారు కూడా వీని నన్నింటినీ పూర్తిగా మరచిపోలేదు. సహజమే. విశాలాక్షి భర్తగా నరసింగరావే జరిగినదల్లా మరచిపోలేనప్పుడు తల్లిగా ఆమె మరచిపోలేకపోవటంలో వింతలేదు. ఆమె ఇప్పటికీ తమ అల్లునిపైగల ఆక్రోశాన్ని తీర్చుకోవటానికి ఏమాత్రం అవకాశం దొరికినా జారవిడవకుండా జాగ్రత్తగా పట్టుకొంటుంది.

విశాలాక్షి వచ్చినప్పుడల్లా వెంకటనర్సమ్మగారు ఆమె అత్తవారింటి భోగట్టాలూ నరసింగరావు ప్రవర్తనా విశేషాలూ తరచి తరచి అడుగుతూ ఉంటుంది. చెపితే వాటికి అన్నింటికీ చిలవలకు పలవలూ పలవలకు చిలవలూ చేర్చి ఇంట ఇంటా వాడవాడా ఆ విషయాల నన్నింటినీ ప్రచారంచేసి అనవసరపు ద్వేషాల నన్నింటినీ పెంచుకుంటూ వస్తుంది. గతం నుండి నేర్చుకున్న పాఠాలతో జాగ్రత్తపడి విశాలాక్షి ఏమీ చెప్పకపోతే అది కూడా ఒక చెప్పరాని గట్టి చిక్కే. ఒకసారి మనసు కష్టపెట్టుకొని కనుక్కున్న తల్లికంటే కట్టుకొన్న మొగుడు తనకు దగ్గరవాడు అయ్యాడా అన్న ధోరణిలో "ముండా మొగుడు!— ఆ మొగుడు తన బ్రతుకు నలా బ్రద్దలుచేస్తూవుంటేనే వాడికోసరం పడి చస్తున్నదిది. నిజంగా వాడే నిరశాకంచేసే మొగుడైతే ఇంకెంతగా పడి చచ్చిపోయేదో" అంటూ విశాలాక్షిని బజాయిస్తుంది. వేరొకసారి "చెప్పనివ్వదే! చెపితే దానిని ఉంచుతాడటే- తాడట్టుక తెంచుతాడు" అంటూ అప్పుడుకూడా నిందంతా అల్లునిమీదే త్రోసివేసి ఆ విధంగాకూడా అతనిపై దుష్ప్రచారమే కొనసాగిస్తుంది.

నిజానికి శ్రీరామారావు అభిప్రాయపడేట్టు లోకం దృష్టిలో కావలసినదానికన్నా ఎన్నోరెట్లు ఎక్కువగా చెడ్డవాడైన నరసింగరావు అట్లా కావడానికి ప్రధానహేతువు వెంకటనర్సమ్మగారే. దూరదృష్టి రహితములైన తమ ఆ దుష్ప్రచారాలతో

తానేం చేస్తున్నదో తెలుసుకోగల ఓపికగాని తెలివిగాని అతల్లికి ఆమె లోకజ్ఞానం సంస్కారం ఏమాత్రం కూడా ప్రసాదించి ఉండలేదు.

ఒక్క శ్రీ రామారావు తప్ప ఆ యింట తక్కిన వాళ్లంతా కూడా ఆమెకే వత్తాసిచ్చి ఆమెలోవి యీ అన్నిని తాము సహితం యథాశక్తిని రాజవేస్తూ అనేకమైన అపోహలకూ అసంబద్ధ సంఘటనలకూ తాము కూడా కారణమౌతుంటారు. వాళ్లు ఇట్లా చేయడంలో కొంత ఇచ్ఛకం మరికొంత అజ్ఞానం హేతువులుకాగా అన్నిటికన్నా బలవత్తమైన ప్రేరేపణ వాళ్ళందరకూ ఆ నరసింగరావుపై గల విద్వేషం. తమకు నరసింగరావుతో గల బాంధవ్యంవల్ల తాము కూడా లోకుల దృష్టిలో చారిత్రికంగా హీనులవకలసి వస్తున్నదని వాళ్లు అందరూ భావిస్తూవుంటారు. అట్లాంటి భావనలవల్ల ఆ యింట అందరికన్నా ఎక్కువగా బాధపడే వ్యక్తి తాను ఉన్నత వంశపురాలనని భావించే ఆ యింటివారి పెద్దకోడలు శ్రీ దేవి.

## 8

శ్రీదేవికి విశాలాక్షి సంబంధమైన యీ చరిత్ర విశేషమంతా సవిస్తరంగానూ సత్యసమ్మతంగానూ తెలియకుకాని ఇంటులో లోకు లేయే ఘట్టాలను గూర్చి వివిధ పాఠాంతరాలలో విశేషంగా చెప్పుకుంటారో ఆయా ఘట్టాలనుగూర్చి ఆమెకు కూడా చాలా తెలుసు. అందుండి ఎవరికైనా ఆమె చరిత్ర ఎంతవరకూ ఏవిధంగా వ్యక్తమౌతుంటుందో ఆ విధంగానే అది అంతా ఆమెకుకూడా వ్యక్తమయ్యింది.

శ్రీదేవి పుట్టిన యింటివారి ఊరిలో వారి పొరుగున ఒక 'అమ్మలక్కల జాతి' వనిత ఉండెను. ఆ 'తల్లి' ఆడపడుచుగారిదీ విశాలాక్షి అత్తవారి కుటుంబానిదీ ఒక్క ఊరేకాక ఒక్కటే వీథి. ఆమె ద్వారా శ్రీదేవి తన ఆడబడుచుగారి కుటుంబాన్ని గూర్చి చాలా తెలుసుకొన్నది. శ్రీరామారావుకూడా తెండ్లి అయిన క్రొత్తలో కొంత చెప్పి ఉన్నాడు. ఆ రెండింటిమధ్య వైరుధ్యం చాలా ఉన్నా అందు ఎవరిమాటలు నమ్మాలో శ్రీదేవికి బాగా తెలుసు. అది కాక శ్రీదేవి అధికంగా తెలుసుకొన్నది—గత సంవత్సరం యీ వదినగారు విశాలాక్షి భర్తయొక్క ఆర్థిక దుస్థితి దాని పొలిమేరలు దాటి నేడో రేపో గా పుట్టి ముంచడానికి సిద్ధమై ఉన్నదని.

ఈవిధమైన చరిత్ర దృష్ట్యానే ఆమె మొట్టమొదట విశాలాక్షి ననుమానించగలగడానికి సాహసించింది. దానికితోడు ఆమె తనకుతాను సమర్థించుకోవడానికి కొన్ని--బలహీనమైనవే అయినా—ప్రత్యక్ష కారణాలుకూడా లేకపోలేదు.

విశాలాక్షిపై ఆమె మొట్టమొదటి అనుమానాలు ధ్రువపరచుకోవడానికి ప్రారంభించినది—లగ్నం వెళ్లిన మరునాడు పగలు భోజనాల వేళకు కాస్త ముందుగా ఆవేళప్పుడు తాను ఏకో మరచి విడిదికి రాగా అక్కడ ఒంటరిగా ఉన్న విశాలాక్షి తనను చూచి ఉలిక్కిపడినట్లు అనుమానం కలిగింది శ్రీదేవికి.

అంతకుముందే ఆమె ఆ ముందురాత్రి జరిగిన విచిత్ర సంఘటనను ఒకదానిని జ్ఞాపకం తెచ్చుకొని ఉన్నది. విడిదిలో దిగిన మరునాటి రాత్రి అంతా నగ పోయినవాటి రాత్రే పదీ పదిన్నర గంటలప్పుడు విశాలాక్షి చీకటిలో పెరట్లోకి పోయివస్తూ—వచ్చి వచ్చి పెరటి వరండాలో ఒక స్తంభానికి చేరబడి పోయి మెడలు వ్రేలాడవేసేసిందట. ఎవళ్లో ఎందుకో పెరట్లోకి పోయినవాళ్లు ఆమెను పలుకరించారు. ఆమె పలుకకపోగా వాళ్లు భయపడి గోలచేశారు. పరుగుపరుగున ఆమె చుట్టూ చేరిచూస్తే మనిషి అప్పటికింకా కండ్లు తెరుచుకొనే ఉన్నది. చూస్తూ ఉండగనే ఆమె విశాలములైన కన్నులు మూతలుపడుతూ ఉండగా శరీరమల్లా—ఆపాదమస్తకం—చెమటలు పోయసాగాయి. ఇంతలో ఎవరో నీళ్లు—నీళ్లు తెండ్రా అని కేకవేశారు. శైత్యోపచారాలు చేయగా ఆమె తేరుకొన్నది.

ఆ రాత్రే పన్నెండూ ఒంటిగంట నడుమ ఆమెకు పయ్యెం పట్టినట్టు ఉందనికూడా కొందరు ఆడవాళ్లు గోలచేసినట్టు జ్ఞాపకం. శ్రీదేవికి నిద్రమత్తు భారంగా ఉండటంవల్లనైతేనేం ఇట్లాంటి వాటిలో నమ్మకం లేకపోవడంవల్లనైతేనేం అప్పుడు దాన్ని అంత విషయమై పట్టించుకోలేకపోయింది. ఇప్పుడీ సంఘటనల దృష్ట్యా దానిని విచారిస్తే దాని అంతరార్థం నిశ్చయంగా ఇదే అయివుండాలనిపించింది శ్రీదేవికి.

తదాదిగా ఆమె విశాలాక్షి ఎక్కడకుపోతే అక్కడికల్లా పోయి తనక్కడ కూర్చుంటే అక్కడల్లా కూర్చొని వెన్నాడటం అరంభించింది. విశాలాక్షి ప్రవర్తనకూడా అందుకు తగినట్టే ఆమె అనుమానాలను క్షణక్షణం బలపరుస్తునే ఉండెను.

శ్రీదేవి తనవంక చూసినప్పుడల్లా విశాలాక్షి తన పెద్దకన్నులను అర వాల్చి ముఖం ప్రక్కకు మరలించు కొంటుండేది. ఆమెను తాను చూచే చూపులతో విశాలాక్షి విలవిలలాడి పోతున్నదా అనిపించేది శ్రీదేవికి. దగ్గరకుపోతే ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గతితప్పుతున్నట్టు స్పష్టంగా కనుపట్టేవి. పరధ్యానంగా ముట్టుకున్నట్టు చూసి ఒళ్లు కూడా వేడిగా ఉన్నట్టు గ్రహించింది శ్రీదేవి. ఆతరువాత విశాలాక్షి ఉష్ణం వచ్చిందంటూ తల్లిచేత దిష్టి తీయించుకొని పండుకొన్నది. కాని అందులోని అంతరార్థాన్ని గ్రహించలేనంత మూర్ఖురాలు కాదు శ్రీదేవి.

ఆవాళల్లా ఇంట్లో విశాలాక్షిని వెంటాడుతూ వుంటే శ్రీదేవికి యింకొక విషయంకూడా గుర్తుకు వచ్చింది. నరసింగరావు ఈ పెండ్లికి రాకపోవడానికి కారణం కూడా అదే ఐఉండాలి.

ఆనడుమ ఆరేడు నెలలక్రితం శ్రీరామారావుకు కాలేజీ ఎడ్రసుతో విశాలాక్షివద్దనుండి ఒక వైరు వచ్చింది. అందులో తక్షణం ఐదువందల రూపాయలు పంపమనీ ఉత్తరం తరువాత వస్తుందనీ వ్రాసివున్నది. ఈ విషయం శ్రీరామారావు ఎన్నడూ శ్రీదేవితో చెప్పి ఉండలేదు. వైరు ఇంటి యడ్రసుకు రాకపోటంలోని అంతరార్థమే అది. కాని ఒక వారం రోజుల తరువాత అనుకోనివిధంగా దాని సంగతి శ్రీదేవికి పట్టుపడ్డది. ఆ సందర్భంలో తనకూ భర్తకూ జరిగిన సంఘర్షణను శ్రీదేవి మరచిపోలేదు.

శ్రీదేవికి నీతినియమాలను గూర్చిన ఉద్దేశాలు కొన్ని తీవ్రమైనవి ఉన్నవి. ఆమె తెలుసుకున్న విలువల ప్రకారం దొంగతనం వ్యభిచారం మొదలైన దుర్వృత్తులకు లోనయ్యే వాళ్లు ఎవరైనా ఏ పరిస్థితుల్లోనైనా వాళ్లు నిందార్హులే కాని క్షమార్హులు కారు.

వాళ్లను క్షమించటం అంతకన్నా వాళ్లను క్షమిస్తున్న విషయం బయటకు వ్యక్తం చేయటం వాళ్లను సన్మార్గంలో పెట్టడానికి తోడుపడవు సరికదా పైగా వాళ్లకు ప్రోత్సాహానికి కారణాలవుతాయి. అన్నిటినీ మించి అట్లా చేయటంలో తమ విశాల హృదయాన్ని ప్రకటించుకోవటమనే పరవంచనతోపాటు ఇతరులా హృదయవైశాల్యాన్ని చూచి మూర్ఛపోతారనుకునే ఆత్మవంచన కూడా ఎంతో ఉన్నది.

ఇట్టి విలువలూ భావాలూ ప్రాతిపదికలుగానే ఆమె ఆనాడు తన భర్తతో నరసింగరావును గురించి వాదనకు తలపడి అతి తీవ్రంగా వాదప్రతివాదాలు జరిపి ఉన్నది. ఆ సందర్భంలో శ్రీరామారావు ఆమె వాదనలను ఎదుర్కొనలేక అత్యాచారానికి పోయి కూటవాదనల సహాయంతో ఆమెను అన్యాయంగా మర్మాంతికములైన ఒక రకపు గూఢవేదనలకు ఎరజేసి మానసికంగా బాగా గాయపరచి ఉన్నాడు.

దానా దీనా ఆమె తన పగను తాను మళ్ళా చిక్కించుకోవటంతోపాటు వీలైతే యీ దొంగతనాన్ని సాధ్యమైనంత బాహాటంగా పట్టుకొని తద్వారా శ్రీరామారావుదైన ఆత్మోత్కర్షపై గాఢమైన దెబ్బ వేయాలని నిశ్చయించుకొన్నది. చివరి కామె సర్వ కామనలనూ పరితృప్తి చేస్తూ ఆ మరునాడు మధ్యాహ్నం మూడవయామం అత్యంత బీభత్సకరమైనది ప్రవేశించింది.

## 9

పెండ్లి బాగానే జరిగిందని మగపెండ్లివారనుకుంటే చాలా బ్రహ్మాండంగా జరిగిందని ఆడపెండ్లివారి తరఫున వచ్చినవారంతా అన్నారు. ఊరువాడునా ఉండే ప్రజలంతా యీ పెండ్లి తక్కిన ఆయింటి పెండ్లిండ్లన్నింటికన్నా ఘనంగా జరిగిందని ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ కూడా మెచ్చుకున్నారు.

మగపెండ్లివారి తరఫున వచ్చినవారిలో మగవాళ్ళ సంఖ్య తక్కువ. ఆడవాళ్ళ సంఖ్య హెచ్చు. అందుచేత యే కాస్త సందడిచేస్తే వాళ్ళే చేస్తూ వచ్చారు. వాళ్ళ తరఫున వచ్చిన మగవాళ్లంతా పెద్దమనుష్యులుగా కూర్చోవటంలోగల సరదా,హాస్యాలూ పరాచికాలూ ఆడుకోవటంలో పొందలేనట్టు కనుపించారు.

ఆడపెండ్లివారి తరఫున వచ్చిన బంధువులలో ఆడవాళ్ళ సంఖ్యా ఇంచుమించు సమానం. అసలు వాళ్ల కుటుంబం కూడా శ్రీరామారావుగారి కుటుంబం కన్నా ఇంతో అంతో పెద్దది. పెండ్లికూతురుకు నలుగురన్నలూ ముగ్గురు అక్కలూ ఉన్నారు. ఆ అక్కల మొగుళ్లూ అన్నదమ్ములూ అంతా సమానవయస్కులు. వాళ్ళందరూ ఏళ్లు మీరినవారూ ఉద్యోగస్థులే అయినా ఆ నాలుగు రోజులూ తమ వయ

సులూ ఉద్యోగాలూ మరచి చిన్నపిల్లల్లా మసలుతూ వచ్చారు.

వాళ్లు పెళ్ళిపందిళ్లోనూ అక్కడా చేసిన అల్లర్లూ ఆగడాలూ ఇన్నీ అన్నీ కావు. కొట్టుకోవడం, ఒకర్నొకరు వెంటదరమడం, విరగబడి నవ్వుకోవడాలూ దొంగ దొంగ వినుపులూ, బీరాలు పలకడాలూ, కుహనా రోష ప్రదర్శనాలూ, ఉడికింపులు, —ఒకటేమిటి ఎన్నెన్ని పోకిళ్లు పోవగలరో అన్నన్ని పోకిళ్ళూ పోతూవచ్చారు.

వాళ్ళ భార్యలూ ఇతర బంధువులూ మొదలైన వాళ్లు ఒకవంక సామానుల అందింపులూ వంటలూ వడ్డనలూ మొదలైన పెళ్లిపనులు చూసుకుంటూనే వేరొకవంక ఉండీ ఉడిగీ వాళ్ల చిలిపిచేష్టలలోనూ పోకిరీ వేషాలలోనూ పాల్గొంటూ వాటిని మరింత రసవత్తరములు చేసేవారు. పెండ్లికూతురు తల్లీ తండ్రీ అరవయ్యేవపడిలో పార్వతీ పరమేశ్వరుల్లా ఉంటారు. వాళ్లు చిన్నవాళ్లల్లా ప్రవర్తించే తమ ఈ పెద్దపిల్లలను చూచి "ఏమిట్రా అదీ!" అని ఒకవంక అలవాటుకొద్దీ అదిలిస్తూనే వేరొకవంక వారు పొందే ఆనందం ఇంతా అంతా కాదు.

శ్రీరామారావు ఆ కుటుంబాన్ని చూశాక తమ కుటుంబ జీవితం దాని బంధుబాంధవ్యాలూ వానితో పరిపోల్చుకొని తమది ఎంత రసహీనంగానూ విషాదభరితంగానూ ఉన్నదో అర్థం చేసుకొన్నాడు. తాను పొందిన సంస్కార ఫలితంగా అటు ఇట్లాంటి వాటిని స్వయంగా అనందించే శక్తిని కోల్పోయినా ఇతరులానందిస్తూఉంటే చూచి సంతోషించే శక్తి మాత్రం ఇంకా కోలుపోలేదు.

శ్రీదేవికి ఇదంతా శుద్ధ మొరటు వ్యవహారం అవటంవల్ల ఆమె మార్గంలో ఇట్లాంటివి తారసపడితే మొహం చిట్లించుకొనేది. వారు కూడా ఆమెను చూడగానే ఒకరికొకరు సైగలు చేసుకొంటూ ఆమె యొక్క ఆ నాగరిక వైఖరిని తమ తమ సాంకేతిక పరిభాషలలో పరిహసించి నవ్వుకునేవారు.

ఊళ్లోవాళ్లకు పెద్ద 'బ్రహ్మాండంగా' లగ్నం, మందుగుండు సామానుతో, మంగళ వాయిద్యాలతో ఇరవై ముప్ఫై పెట్రొమేక్సు లైట్లూ గ్యాస్ లైట్లతో ముత్యాలపల్లకిలో వధూవరుల ఊరేగింపూ, 'పండితుల'తో సదస్యం పెద్ద పేరెన్నికగన్న దాసుగారిచే హరికథా సమస్తం చాలా దక్కగా అమరినాయనిపించినవి. నాగవల్లి నాడు ఊరిలో మిగిలిన వర్ణాలవారి కందరికీ పెద్ద ఆమెత కూడా ఏర్పాటుచేశారు ఆడపెండ్లివారు. నాగవల్లి నాడు అప్పగింతలు యథావిధిగా జరిగినవి. నాగవల్లితో వివాహకాండ సమస్తం పరిపూర్తి.

* * * *

ఆ మధ్యాహ్నం పెండ్లివారి యింటిదగ్గర పెద్ద ఊరామెత జరుగుతూవుంటే విడిదిలో ప్రయాణాలై వెళ్లగా మిగిలినవాళ్లు రాత్రి హరికథ కారణంగా నిద్రలేమి వల్ల నేమి సాధారణంగా మధ్యాహ్న భోజనానంతరం కలిగే భుక్తాయాసం వల్ల నేమి పడి నిద్రపోతున్నారు.

నిజానికి లోకం పరిపాటిని అపరికి పెండ్లివారంతా ప్రయాణోన్ముఖులై ఆ సన్నాహాలలో ఉండాలి. కాని అనాడే పునఃసంధానానికి ముహూర్తం పెట్టబడటంవల్ల పెండ్లికూతురు తండ్రీ అన్నదమ్ములూ తాము చేయగల శుభకార్యాలన్నింటిలోనూ అదె కడపటిదంటూ ఆ ఒక్కపూటకూడా అందరూ ఉండిపోయి వధూవరులను ఆశీర్వదించి పొమ్మంటూ మనిషి మనిషినీ బలవంతంచేసి చాలా మందిని నిలిపివేశారు. ఆడపెండ్లివారిలో కూడా మిగిలినవారు అధికంగానే ఉన్నారు. వాళ్లంతా ఆమెతకు సంబంధించిన వంటలో వడ్డనలో ఉన్నారు.

మూడూ మూడున్నర గంటలయ్యేసరికి విడిదిలో ఇంకా ఎవ్వరూ లేవలేదు. నీరవంగా ఉన్న విడిదిలో నిద్రపోతున్న శ్రీదేవికి నిద్ర ఎలా అనుకోకుండా పట్టిందో తెలివికూడా అలానే అనుకోకుండా కలిగింది. కొంతసేపటివరకూ తానానాడు నిద్రపోతూన్న దనుకుంటూనే నిద్రపోయిన సంగతి జ్ఞాపకం చేసుకోలేదు. తిరువాత అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చేసరికి ఆమె దప్పున లేచి కూర్చున్నది.

ఆ రెండు రోజులనుండీ తాను పడుతూ వచ్చిన జాగరూకత అంతా శుద్ధ నిష్ప్రయోజనమై ఉంటుందనుకుంటూనే ఆమె విశాలాక్షి పండుకున్న ప్రక్కవంక చూసింది. విశాలాక్షి అక్కడ లేదు.

అంతే. అంతటితో సర్రున ఆమెలోని చైతన్య స్రవంతి సర్వస్వం ఒక్క ఆదటున ఆమె హృదయ

కుహరంలో ప్రవేశించి అక్కడ ఆమెలో సుడులు తిరగ నారంభించింది. ఆ అదటుకి కొంతసేపు ఆమె స్తబ్ధత వహించి అట్లానే ఉండిపోయింది. తరువాత ఆమె ఒక్క లిప్తకూడా వృథా చేయరాదనే ధోరణిలో పెరటి వరండాలోకి పోయింది. అక్కడ ఆ పెరటిల్లా ఫాల్గుణమాసపు మధ్యాహ్నపు ఎండలో ఒక చిత్రమైన అనుభూతిని—శ్రీదేవికి కూడా ఆ స్థితిలో సహితం కలిగిస్తూ ఉన్నది. కాని అందందు ఎక్కడా విశాలాక్షిమాత్రం శ్రీదేవి కంటికి కానరాలేదు.

ఆమె వరుసపెట్టి గదులన్నీ ఒకటొక్కటే చొప్పున వెదుకుతూ వచ్చింది. వాటిల్లో ఎందరెందరో నిద్రపోతున్నవారు కనుపించారుగాని విశాలాక్షి మాత్రం నిద్రపోతూ ఎక్కడా కానుపించలేదు. మరి ఒకసారి పెరడల్లా వెతికి 'అటుపోయి ఉండదు' అనుకుంటూనే పెరట్లోంచి నట్టింటి గదికిగల ద్వారం దగ్గరకు వచ్చేసరికి వీధిలోంచి నట్టింటిలోకి వస్తున్న విశాలాక్షి వీధి ద్వారం దగ్గర ఎదురుపడ్డది శ్రీదేవికి. ఇద్దరూ గదికి ఈ ద్వారంవద్ద ఒకరూ ఆ ద్వారంవద్ద ఒకరూగా అట్లా ఒకరివంక ఒకరు చూస్తు క్షణకాలం నిలుచుని ఉన్నారు.

చివరకు శ్రీదేవే ముందుగా కదిలి గదిలో ప్రవేశించగా విశాలాక్షి కూడా ఇంక తప్పని సరికాగా ముందుకు జరిగింది. ఇద్దరూ గది నడుమ ఒకరికొకరు గజమూ గజమున్నర దూరానికి వచ్చి ఆగిపోయారు. వాళ్ళకు ఒక దిశగా పొడవునా ఉన్న గదిలో పది పదిహేనుమంది వరకూ పండుకొని ఉన్నారు. రెండవ దిశగా గజందూరంలో ప్రక్క గదిలోనికి పోయే ద్వారమున్నది.

శ్రీదేవికి తన ఆడపడుచును చూడక ముందు నుంచీ ఆ క్షణాన ఆమెవద్ద తన చోరీ ఆస్తి తప్పక దొరుకుతుందని తెలుసు. ఎట్లా తెలుసునంటే మాత్రం ఆమె చెప్పలేదు. ఇప్పుడు విశాలాక్షి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీసే పద్ధతీ, చూసే చూపూ, ఆ విశాలమైన నుదురు కొంచం కొంచంగా చెమటపట్టడం, ఇవన్నీ ఆమె ఊహను బలపరచడానికి ఉపయోగపడేవే కాని వాటినిబట్టి క్రొత్తగా ఊహించవలసినది ఏమీ లేదు. అంతేకాదు ఆ వస్తువు ఎక్కడ ఉన్నదో కూడా ఆమెకు బాగానే తెలుస్తూ ఉన్నది. ఆమె ఎరిగినది స్వల్పమే ఐనా అందులోనే ఆ ఆడుబిడ్డ పైటచెరగు వీపు చుట్టూ త్రిప్పి కుడిచేతి క్రిందనుండి ముందుకుతీసి బొడ్డు కొంచెం క్రిందికి పెట్టుకొని ఉండగా చూడటం ఇదే మొదటిసారి. అందుచేత వస్తువు అక్కడే ఉన్నదన్న సంగతి కూడా ఆమె ఆమెను చూడగానే గ్రహించి ఉన్నది.

క్షణకాలం ఇద్దరూ అట్లా మౌనంగా నిల్చుని ఉన్నాక శ్రీదేవి పట్టుకపోతున్న గొంతును సవరించుకొంటూ అన్నది.

"ఏది వదినా! ఆ చీరకొంగు కాస్త బయటికి తీయండి" అన్నది—అప్పటికి నెమ్మదిగానే.

ఆమెకా క్షణాన తాను చేస్తున్న సాహసమేమో దాని ఫలితం ఎట్టిదో ఏమాత్రం కూడా ముందుగా తెలిసినట్టు లేదు. ఆమెకు అప్పట్లో కనిపిస్తున్నదల్లా ఒక్కటే విషయం, తాను ఈ మూడు రోజులై పడుతూవచ్చిన శ్రమ ఆ క్షణాన ఫలించనున్నది. తాను కలగనినట్టుగనే చోరీ ఆస్తితో సహా దొంగ పట్టుబడిపోతున్నది. అంత చిత్రంగా ఎవ్వరూ ఎప్పుడూ ఏ దొంగతనాన్నీ పట్టుకొన్నట్టు తాను విని ఉండలేదు. ఆ సంకట్లోనే ఆమె సమస్తం మరచి అట్లా ఒక ఉద్రేకపు టుద్వేగంలో పడి కొట్టుకపోతూ అన్నది—

"తియ్యండి వదినా! పైటచెరగు బయటకు తీయమంటే అట్లా చూస్తారేం?" అన్నది గొంతుక కాస్తగా పెద్దది చేస్తూ.

ఈసారి ఆమె గొంతులో కాస్త కంపరమున్నది. మనిషి కూడా ఏమాత్రమో కంపిస్తూ ఉన్నది. విశాలాక్షి అట్లా కొయ్యబొమ్మలా చూస్తూనే ఉండిపోయింది. ఆమె ముఖంలో కత్తివేటుకు నెత్తురుచుక్క ఎక్కడా లేదు.

క్షణక్షణం నీరు విడిచిపోతున్న ఆ మానవి హృదయంలో భూకంపాలవంటి వేవో కలుగుతున్నవనీ ఆమె ఆత్మ ఆ పగుళ్ళలో పడి అథః పాతాళాలలోనికి అణచుకుంటూ కొట్టుకొనిపోతున్నదా అనీ అనిపించింది శ్రీదేవికి. అయినా ఆమె కెందుచేతో ఆ క్షణాన తన ఆడుబడుచుపై జాలి మాత్రం ఏమీ కలుగలేదు. రెండుసార్లు కూడా పలకకపోయేసరికి మూడవసారి కూడా ఆ మాటలే కాస్త మార్పులు చేస్తూ గొంతుకు మరి కాస్తగా హెచ్చిస్తూ అన్నదామె.

అంతటితో ఆ గదిలో పండుకున్న వారిలో కొంతమందికి మెలకువరాగా లేచి ఈ విచిత్ర దృశ్యాన్ని ప్రక్కలమీదనుంచే చూడసాగారు. ప్రక్క గదిలో రానున్న రాత్రిని తలచుకొంటూ నిద్రపట్టక బాధ పడుతున్న పెండ్లికొడుకు మగత నిద్దరలోనుండి చప్పున లేచి ప్రక్క ద్వారం దగ్గరకు వచ్చాడు. వదినగారి గొంతుక విని కంగారుపడ్డ ఆ యువకుడు వాళ్ళ అవతారాలు చూసేసరికి ఆ స్థితిలో మతే పోగొట్టుకొన్నాడు. ముఖ్యంగా అతడీ రెండు రోజులయీ ఆ వదినగారు ముఖం ఇట్టే పెట్టుకొని ఉండటం—ఒకసారి ఏడవటం కూడా జరిగినట్టుకూడా విని ఉన్నాడేమో దానినంతా దేనినిగానో అర్థం చేసుకుంటూ వచ్చాడు. ఇప్పుడీ దృశ్యం చూసేసరికి ఏమని అర్థం చేసుకొన్నాడో అతి అస్వాభావికమైన గొంతుకతో—

"ఏమిటది? ఏమిటయిందీ?" అంటూ ప్రశ్నించసాగాడు.

ఈ గొంతుకూడా విని అక్కడ పండుకొన్న వారిలో ఇంకొక ముగ్గురు నలుగురు లేచారు. అందులో వెంకటనర్సమ్మగారు కూడా ఒకరు; వాళ్ళెవ్వరూ ఇంకా ప్రక్కలు విడిచిపెట్టలేదు. సూర్యం మళ్ళా అడిగాడు.

"ఏమిటిదంతా!? ఏమిటంటారు మీరూ? పైటచెరగు ఎందుకు తీయాలీ?" అన్నాడతడు.

"తియ్యమనండి చెప్తాను" అన్నది శ్రీదేవి.

ఆ గొంతులో ఇమిడిఉన్న ఏదో ఒక శక్తికి లొంగిపోయిన సూర్యం ఆ సవాలునకు కోపం తెచ్చుకోవడానికి బదులుగా స్వస్థత చెడగొట్టుకొని—

"తియ్యవే!" అన్నాడు అక్కను ఉద్దేశించి.

విశాలాక్షి తీయలేదు.

సూర్యం దృక్పథపుటంచున అతని కెదురుగా అతని తల్లి ఉన్నది. ఆమెవంక దృష్టిని నిలిపిస్తూ—

"నువ్వొచ్చి తియ్యవమ్మా" అన్నాడు తల్లితో.

ఆవిడకు ఇది అంతా ఏమిటో బోధపడటంలేదు. ఆవిడకూడా తెలిసినదల్లా శ్రీదేవి 'యీ రెండు రోజులయీ కళ్ళల్లో నిప్పులు పోసుకొంటున్నదీ' అని. అందుచేత ఆమె ఆ పరిస్థితిలో శ్రీదేవిని చూసి, అప్పుడే వచ్చిన మెలకువలో ఒళ్ళుమండ నారంభించగా—

"ఏమిట్రా తియ్యమంటావ్? ఏమిటి తియ్యమంటావ్?" అన్నది కొడుకు నుద్దేశించి.

"నువ్వేలారా" అంటూనే తల్లి వత్తాసు చూసుకోగానే వదినగారిపై వచ్చిన ఆకస్మిక కోపాన్ని తల్లి జాగుచేయడంలో పట్టలేక ఒళ్ళు మరుస్తూ చప్పున వెళ్ళి అక్క చెళ్ళెలు బొద్దుకొంగులో నుండి పైటచెరగు చివరను తానే ఊడదీశాడు.

అందులో ఏమీ లేదు.

క్షణకాలం శ్రీదేవి గుండెలు గతుక్కుమన్నవి. కానీ ఇంకా అక్కడ కొంత ప్రదేశం ఎత్తుగనే ఉండటం చూడగా ఆమె గుండెలు మళ్ళా లోపల నుండి పైకి తేరుకోసాగినవి.

ఈలోగా ఆమె రిద్చపాటు చూసిన సూర్యం ఆవలే ఒళ్ళు మరిచిపోతూ పెద్ద గొంతుకతో—

"ఏమున్నదండీ?! ఏమున్న దక్కడా?" అన్నాడు; అతని గొంతు ఖంగున మారుమ్రోగుతున్నది ఆ గదిలో.

మంట మంటను రగిల్చినట్టుగా శ్రీదేవికూడా ఒళ్ళు మరుస్తూ "అక్కడ! అక్కడ!!" అన్నది విశాలాక్షి బొద్దు కొంగు మూసిఉంచే ప్రదేశంలో ఎత్తి చూపిస్తూ.

"సూర్యం ఒకసారి ఆ చూపబడిన ప్రదేశంవంక పరిశీలనా దృక్కులనూ వేరొకసారి వదినగారి ముఖంలోకి పుంఖానుపుంఖాలుగా చిమ్మబడే అమ్ములులా తీవ్ర దృక్కులనూ బరపి చప్పున తల్లిదగ్గరకుపోయి ఆమెను రెక్కపట్టుకొని లాక్కువస్తూ"

"చూడు అక్కడ. అక్కడ ఏమిఉన్నదో తియ్" అన్నాడు పెద్దగొంతుతో.

ఈసారి ఆ మంటలు వెంకటనర్సమ్మగారిలో కూడా రగుల్కొనగా ఆమె చప్పున లేచివస్తూ "ఏమున్నదే—అక్కడ ఏమున్నదీ?" అంటూ ఒక వంక సూర్యం వేయలేని ప్రశ్నను అతిసహజంగా వేసి, కూతురు పొట్ట భాగాన్ని తన అరచేతితో స్పృశింపసాగారు.

ఆ తల్లి చేతి కక్కడ ఏవస్తువైనా ఉన్న స్పర్శ తగిలిందో లేక ఏమీ తగలలేదో ఆ సంగతంతా దేవుడికి తెలియాలి ఆమెకు తెలియాలి. ఇంతలో కోడలి మాటలు ఆమె కర్ణరంధ్రాలలో బల్లాల్లా వచ్చి నాటుకోసాగాయి!

"నా గొలుసు ఉన్న దక్కడ. మొన్నరాత్రి లగ్నానికి ముందుగా తొమ్మిది పదిగంటలప్పుడు మా కూతురు పెరట్లో శెనగలు పోసేస్తూ కూర్చోవటానికి కారణం అదే. నా గొలుసు పోయింది. కావలిస్తే మా అబ్బాయి నడగండి. అది ఈవిడే తీసింది. ఆరాత్రి ఎక్కడో దాచి ఇప్పుడిల్లా అందరం పనులున్నప్పుడు బయటనుండి తెస్తోంది. ఆ గొలుసు ఆవిడ బొడ్డు కొంగున దోపింది. తియ్యండి కావలిస్తే!"

ఇట్లా ఉచ్చస్వరంతో అరుస్తూనే ఆమె ఆ ఆడపడుచును తానే సోదా చేయటానికి కలా మీది మీదికి వచ్చింది.

ఏ అత్తగారైనా ఎట్టి అవధులను కోడలు దాటబోతే సహించదో అట్టి అవధులను శ్రీదేవి దాటడం వల్లనే పట్టలేకపోయారో లేక తమ కూతురుకు బహిరంగంగా జరిగిన ఆ అవమానానికి అంత బహిరంగంగానే ప్రతీకారం జరిపితీరాలనే ఉద్రేకంవల్లనే పట్టలేకపోయారో లేక ఇంక ఏ యితర కారణమైనా ఉన్నదో తెలియదు — వెంకటనర్సమ్మగారు ఆ మాటలు వినగానే ఆ పెండ్లివారి విడిదిఇంట తమ స్థితి ఏమో, తామెక్కడ ఉన్నారో, తమ నా పరాయి గ్రామంలో ఆ తతంగాన ఎంతమంది గమనిస్తున్నారో, దాని ఫలితమేమో, సమస్తం మరచి బజారు స్త్రీల కన్నా నికృష్టమైన వీరావేశంతో తమకుగల గొంతుకు నల్లే ఉపయోగించుకుంటూ—

"ఎవత్తివే నువ్వు! నా కూతురుకే దొంగతనం కడతావా! ?......" అంటూ ప్రారంభించి, అడిన మాట ఆడకుండా, తిట్టినతిట్టు తిట్టకుండా, ఎన్నెన్ని విధాల రుఖణాయించాలో అన్నన్ని విధాలా రుఖణా యిస్తూ, అంత ఒళ్లా కదల్చక తిరగడంలో పరమ ఆయాస పడిపోతూ, కోడలిని నెట్టుక నెట్టుక పెరట్లోకి తోసుక పోసాగింది.

ఇంతవరకూ శ్రీరామారావు వీధివంక వరండాలో ఒక చివర బాగా గాలి తగులుతుందని అక్కడ పరుపు వేయించుకొని పండుకొని ఉన్నాడు. ముందు రాత్రి హరికథవల్లనైతేనేం ఆ తరువాతకూడా ఏవేవో ఆలోచనలవల్లనైతేనేం అతడికి చాలినంత నిద్ర లేకపోయింది. అందుచేత అతడు అప్పుడు మంచి గాఢమైన నిద్రలో ఉన్నాడు. తల్లి గొంతుక వినిపించిన వెనకగాని అతడికా గొడవలో పూర్తిగా తెలివిరాలేదు.

తెలివివచ్చాక ఆ కలతనిద్దట్లో లేచి పరిగెత్తుక వచ్చేసరికి ఇల్లల్లా ఎంతో భీభత్సంగా కనుపించింది.

అతడు "ఏమిటేమిటం"టూనే ద్వారంవద్ద మూగుతున్న జనాన్ని చీల్చుకొని గదిలోకి వచ్చేసరికి అక్కడ విశాలాక్షికి ఎవరో శైత్యోపచారాలు చేస్తున్నట్టూ, పెరటి వరండాలో తల్లీ భార్యా కొట్లాడుకొంటున్నట్టూ, ఇద్దరు ముగ్గురు వాళ్లను విడిపిస్తున్నట్టూ రూపించే దృశ్యాలు కానవస్తున్నవి. ఆ మానవుడు అట్లాంటి వానిని దర్శించేస్థితి ఒకటి ఎప్పుడైనా సంభవించవచ్చునని కలలోకూడా ఎన్నడూ పొరపాటుననైనా ఊహించి ఉండలేదు. అందుచేత అది యిలా నిజమైనట్టు తన చర్మచక్షువులకు ప్రత్యక్షంగా కానవస్తూ ఉంటే అదొకవిధమైన దిగ్భ్రాంతి పొంది ఆ దిగ్భ్రాంతిలో సమస్తమైన తన చైతన్యాన్ని నిశ్శేషంగా కోలుపోయి మాటగాని చలనంగాని లేకుండా అట్లా దిష్టిబొమ్మలా నిలచిపోయాడు.

మరి ఒక అరనిమిషం కూడా అట్లానే గడచిపోయింది.

ఈలోగా ఎందరెందరో ఇరుగు పొరుగులవారు 'జూమ్' మంటూ మురికి పదార్థంపై వ్రాలే ఈగలులాగ వచ్చి ద్వారం చుట్టూ మూగసాగారు. వాళ్ళల్లో కొందరు మొట్టమొదట ఆ వదినా మరదుల పెద్ద పెద్ద గొంతుకలు వినిపించినది లగాయతూ అక్కడకు ఆకర్షింపబడ్డవారున్నారు. మరికొంతమంది వెంకటనర్సమ్మగారి గొంతు వినిపించాక మాత్రమే అక్కడకు వచ్చినవారు ఉన్నారు. అయినా వీళ్లకూ వాళ్లకూ కూడా అక్కడ జరిగినదంతా — ఆమూలాగ్రం — ఆకళింపు ఐపోయింది. వ్యగ్రమయ్యాక మానవుని బుద్ధికి ఏర్పడే గ్రహణశక్తి మనస్సునకు ఏర్పడే అన్వయశక్తి ఇతింత అనరానివి. వాటి సహాయంతో వాళ్లు జరిగినదే కాక జరుగుతున్నదానిని కూడా సమస్తం తూచా తప్పిపోకుండా అర్థం చేసుకోగలుగుతున్నారు.

అన్నకన్నా ముందుగానే తెలివి తెచ్చుకున్న సూర్యం అన్న రాకను గుర్తించిన వెనకనే తల్లిని వదినగారినుండి బలవంతంగా వేరుచేయడం ఆరంభించాడు. వెంకటనర్సమ్మగారి వీరావేశం పట్ట శక్యం కాకుండా ఉన్నది. ఐదారుగురు ఆడవాళ్ళు పట్టుకో జూచినా ఆమె అంతమందినీ విడిపించుకుపోయి శ్రీదేవిని మొత్తుతునే వచ్చింది. అసరికి చాలా దెబ్బలు తిన్న శ్రీదేవి చిన్నపిల్లలా ఏడుస్తూ దూరదూరంగా

పెరట్లోకి పోతూ ఉన్నది. శ్రీరామారావు పాపం అలా కొయ్యగట్టుక నిలుచుండిపోయాడే కాని ఇలా పెదవైనా కదపలేదు.

ఇంతలో ఎలా వచ్చాడో దేవుడిలా వచ్చాడు సూర్యం చినబావమరిది. అతడు వస్తూనే ముందుగా చేసినపని బయటివాళ్లందరినీ పంపించేసి వీధి తలుపులు రెండూ సీదాగా మూసి వేయడం. తరువాత అతడు శ్రీరామారావును చెలికి పట్టుకొని అతడికి పూర్తిగా తెలివి తెప్పిస్తూ "దయచేసి తమరొక్కసారి నాతో ఇలా వస్తారా" అని తమ జవాబుకోసరం ఎదురు చూడకుండానే ఆయన రెక్క దొరక బుచ్చుకొని—వీధి తలుపు తెరచి మళ్ళా మూసేస్తూ—ఒంటిపై కమీజైనా లేని శ్రీరామారావును లుంగీ బనియన్లతో నే-ఇటూ అటూ వాకిళ్ళనిండా నిలుచున్న జనం మధ్య నుండి, వాకిట భోజనాలు చేస్తున్న మనుష్యుల మధ్య నుండి—తన యింటిలోనికి తీసుకొనిపోయి అక్కడ తన గదిలో ఒక పడక కుర్చీపై సుఖాసీనుణ్ణి చేశాడు. తరువాత క్షణకాలం ఏం చెయ్యడానికీ తోచని వాడిలా ఇటూ అటూ చూశాడు. అప్పుడకస్మాత్తుగా—

"నే నిప్పుడే వస్తాను. మీరు మరేం అనుకోకండి నేనంతా సర్దిపెడతాను. మీరిక్కడే కూర్చోండి."

అని అంటూనే అక్కడనుండి చూస్తూ ఉండగానే క్షణంలో మాయమయ్యాడు.

* * * *

శ్రీరామారావు యత్నాలన్నీ ఆవిధంగా ఒక్క క్షణంలో పూర్తిగా పాడయ్యాయి.

* * * *

తరువాతకూడా ఇంక ఏం జరిగిందీ అంటే అదంతా వెనుకటివి వివరించినంతగా వివరించి చెప్పడం చాలా కష్టం—కాక అనవసరంకూడా నేమో. ఈ విషయమంతా ఆయా ఊళ్లల్లో తెలిసిన వాళ్లను ఎవరిని అడిగినా ఇలానే చెప్తారు. సూర్యం చినబావమరిది ఎట్లానో ప్రొద్దుపోయేసరికి విడిదివద్ద అల్లకల్లోలాన్నంతా చక్కచేయగలిగాడు. ఆరాత్రి సుముహూర్తం కూడా నెమ్మదిగా అయిందన్న పద్ధతిని జరిపించేసే ఏర్పాటు చేశాడు. 'కడివెడు పాలల్లోనూ ఒక్క మజ్జిగచుక్క' అని నిట్టూర్చారు బంధువులు అంతా. శ్రీరామారావు మాత్రం ఆపూటల్లా తానున్న గది విడిచిపెట్టి బయటికిరాలేదు. తక్కినవాళ్లంతా ఆరాత్రి ఎట్లా గడిపినా శ్రీరామారావు దాని నొక కాళరాత్రిగా గడిపాడు.

క్షణక్షణం చెదిరిపోయే శాంతాన్ని కూడదీసుకుంటూ పరిపరివిధాల పరుగులువారే మనసు పట్టుకుంటూ పది పదకొండు గంటలు ఒంటరిగా ఆగదిలో ఎట్లా గడిపాడో దానికెంత నిగ్రహశక్తి కావలసి వచ్చిందో అది అంతా అతడికే తెలియాలి. [illegible] నిశ్శబ్దంగా యుగ యుగాలుగా గడిచిపోతూ వచ్చింది అతనికి. మూడూ మూడున్నర గంటలవేళ చిన్న మగత నిద్దర పట్టింది అతడికి తెలియకుండానే. మళ్ళా తెలివి వచ్చేసరికి గదిలో బెడ్ లైటు ఇంకా వెలుగుతూనే ఉన్నది—బయట మునిమని చీకటిగా ఉన్నది—తనను ఎవరో లేపుతున్నారు. తన నెవరో నిద్ర లేపారని వాళ్ళేదో చెపుతున్నారని—ఆ సంగతులన్నీ గ్రహించడానికి శ్రీరామారావుకు చాలాసేపు పట్టింది. తెలివి వచ్చాక "విశాలాక్షి! విశాలాక్షి నూతిలో పడ్డది!" అని లేపవచ్చిన వాళ్ళు చెపితే శ్రీరామారావు కొంతసేపు మాట్లాడకుండా అట్లానే ఉండిపోయి తరువాత విడుస్తూ మంచంమీద పండుకొండిపోయాడు. ఆ దెబ్బ దెబ్బ కాగా అతడు శారీరకంగా కోలుకోవడానికే పది పదిహేను రోజులు తీసుకొని మానసికంగా కోలుకోవడానికి ఇంకో ఆరేడు మాసాలూ ఇంకా అంతకుపైగా కూడా తీసుకున్నాడు.

నిండా ఒక సంవత్సరం అయ్యాక గాని జరిగిందేమిటో జరగని దేమిటో తేల్చుకోలేకపోయాడు ఆ లెక్చరరు. అప్పుడిక చూస్తే అదంతా అతని మనస్సుకు ఈవిన్నంగా అనిపిస్తూ ఉండేది.

విశాలాక్షి మరణానికి కారణమైన పరిస్థితుల కన్నా ఘోరమైనది ఆమె మరణించిన పద్ధతి. ఆమె మరణించిన పద్ధతికన్నా అత్యంత విహ్వలతాజనకములు దాని ఫలితంగా ఆ కుటుంబం వాళ్ళందరూ ఎదుర్కొవలసివచ్చిన ప్రఘునిందా లోకనిందా వాని నిరసనా వైఖరీ మొదలైన విషయాలు. వీటి అన్నింటి కన్నా ఘోరమైన విషయం ఆమె మరణించటంలో గల అసలు అంతర్యాన్ని గురించి శ్రీరామారావులో ఏర్పడిఉన్న భావం.

విశాలాక్షి లోకంలో ఎవ్వరో గాని చావ లేనంత ఘోరమైన చావు చచ్చింది శ్రీరామారావుకు

తెలిసినంత మేరకు. ఆమె ఉరికిన విడిదియింటి పెరట్లో గల నూతియందు నీళ్లు చాలా తక్కువ. అడుగుభాగం కూడా రాతినేల అవటంవల్ల ఆమె కాళ్ళూ వెన్నూ పూసా మొదలైనవి విరుచుకున్నదేగాని కోరినవిధంగా చావలేకపోయింది. ఉరకటంలో గట్టుకు ఒరసుకొని పోయి తలపైనా అక్కడా పెద్దపెద్ద పెచ్చులుగా చర్మం ఊడిపోయింది. చివరకు ఆమెకోసమే దాపురించిందా అన్నట్టు ఆ మంచినీటినూతి ఆహారంకోసరం చేరిఉన్న ఒకానొక నాగుపామువాతపడి మరణించింది పాపం విశాలాక్షి. లోకంలో అంతకన్నా ఘోరమైన చావు ఎక్కడైనా ఉన్నదేమో శ్రీరామారావుకి తెలియదు.

అట్లానే విశాలాక్షి చావు తరువాత దాని ఫలితంగా ఆ కుటుంబంవాళ్లు ప్రతి ఒక్కరూ—చివరకు కీర్తి పెండ్లికూతుర్ని కూడా కలుపుకొని—ఎదుర్కోవలసి వచ్చిన విషమపరిస్థితులు అన్నీ ఏతన్మాత్రాలు కావు. ఆమె నూతిలో ఉరికిన విషయం సకాలానికి తెలియకపోవటంవల్ల ప్రాణరక్షణ యత్నాలు అసంభవమైనట్లే తక్కిన కర్మకాండ కూడా యథావిధిగా జరపించటం అసాధ్యమయ్యింది. పోలీస్ రిపోర్టులూ, పోస్టుమార్టం వ్యవహారాలూ, కేసులు జడిపించడం, లంచాలూ—అది అంతా ఒక చిత్రక్షోభగా గడిచిపోయింది. ఆ తరువాత మూడు నాలుగు నెలలవరకూ ఆ యింట్లోవాళ్లు ఒక్కరుకూడా ముఖాన్ని నలుగురు లోనూ ఎత్తుకొని బయట తిరగలేకపోయారు. శ్రీరామారావు మట్టుకు శ్రీరామారావు అసలు కాలేజీ పాఠం చెప్పడానికి సహితం తల ఎత్తవలసివస్తే ఆరేడు మాసాలవరకూ ఎక్కడలేని బాధకూ గురిఅయ్యేవాడు. పేపర్లలో పడి ఈ విషయం 'దేశదేశాల' వరకూ వ్యాపించిందంటే అది ఆ కుటుంబంపై ఎంత పెద్ద దెబ్బతీసిందో స్పష్టంగా అర్థమౌతుంది. లోకం వాళ్ల దోషాల నన్నింటినీ ద్విగుణీకరించి త్రిగుణీకరించి వాళ్ల కుటుంబ చరిత్రను ఆ మూలాగ్రం—దానిలో వుండే సమస్తమైన అవలక్షణాలతోనూ, సుచ్ఛెత్తి మళ్ళా మళ్ళా చెప్పుకొన్నది. ఈ సందర్భంలో కీర్తి పెండ్లికూతురి దక్షిణపాద మహిమను గురించికూడా చర్చించడం వారు మరచిపోలేదు.

అన్నింటికన్నా బాధాకరమైన విషయం విశాలాక్షి చావుయొక్క ఆంతర్యాన్ని గురించి శ్రీరామారావుకు అతనిలో లోతుగా ఏర్పడిపోయిఉన్న భావాలరూపు. ఆమె ఆత్మహత్య చేసుకున్నా ఆత్మత్యాగం చేసుకొన్నా అది అతడికి అంత ఆట్టే కష్టమనిపించే విషయం కాకపోను అనుకుంటాడు అని అతడు. విశాలాక్షి తన ఇచ్ఛకు విరుద్ధంగా, తనపై తనకు కోపంవచ్చి కాకుండా, తన కంతటికి తీరని తీవ్రమైన మహావమానం జరిగిందనే ఉక్రోషంతో—పట్టరాని ఆ అవమానాన్ని భరించలేక మరణించి ఉంటుందని శ్రీరామారావు భావన. ఆమె ఆత్మ యిప్పటికీ తొందరపడి తాను చేసిన ఆ పొరపాటునకు ఇంతింత అనరాని కుందుతో బాధపడుతూ ఉంటుందనే శ్రీరామారావు గాఢమైన విశ్వాసం. ఆమెకు తాను కనుక్కొన్న అర్థంకుర్థం ఎరుగని అందమైన ఆ నలుగురు ఆడపిల్లలమీదా, అంతకన్నా ఆదినుండీ ఎడతెగని లోక తిరస్కృతికి గురిఅవుతూ వస్తున్న నిర్భాగ్యజీవి తన భర్తమీదా కల వాత్సల్యాభిమానాలు ఎంతో గాఢమైనవని శ్రీరామారావు అర్థంచేసుకొని ఉన్నాడు. అందుచేత తనయొక్క నైదానికి ఫలితంగా మొదలే వికలములైన వాళ్ళ భవిష్యత్తులు మరింత వికలములు కాగలవని గ్రహిస్తూ, అది మరల మరల తలచుకొంటూ ఆ ఆత్మ ఎన్నటికీ ఏంచేసికూడా నిశ్చింతగా ఉండలేదని శ్రీరామారావు నమ్మిక.

ఇట్టి భావాలతో శ్రీరామారావు ఆలోచించుకపోతూఉంటే ఆ ఆలోచనలకు అతడిలో అంతు ఉండేది కాదు.

అయితే ఇన్ని ఆలోచించీ శ్రీరామారావు ఎన్నడూ ఆలోచించక విడచిన విషయాలు కూడా ఒకటి రెండు ఆలోచించవలసినవి మిగిలిపోయి ఉన్నవి.

విశాలాక్షి ఏ ఉద్దేశంతో ఎలా ఆలోచించి తనకు దొరికిన నగను తన వద్ద మాటాడక ఉంచేసుకొని ఉన్నది—ఆ నగను ఏం చేద్దామని ఆమె అభిప్రాయమై ఉండాలి?

లోకగతిలో ఇటువంటి సంఘటనలన్నీ ఒక పెద్ద లెక్కలోకివచ్చే విషయాలు కాకపోయినా వ్యక్తులను వ్యక్తిగా తీసుకొనిచూస్తే కొందరి కొందరి జీవితాలను ఎంతో అస్తవ్యస్తములుగా మార్చగలిగే ఇంతటి పెద్దసంఘటనలు కొన్ని కొన్ని కుటుంబాలలో అప్పుడప్పుడూ జరుగుతుండటానికి అసలు మూలకారణాలు—వాటి కుదుళ్లు—ఏమిటి? ఎక్కడ ఉన్నవి?

ఈ రెండే అతడు ఎన్నడూ పరిశీలించని విషయాలు—లేక పరిశీలించాలనే స్ఫురణకు గురికాని విషయాలు!

# 'యక్షగానకవులు'

## ఒక విమర్శ

శ్రీ యస్వీ జోగారావు

వైశీర్షికలో ఈ సంవత్సరము భారతి ఫిబ్రవరి మార్చిసంచికలలో శ్రీ నిడదవోలు వేంకటరావుగారొక అపూర్వ పరిశోధనాత్మకమగు వ్యాసము వెలయించిరి. కాని దానికి పునఃపరిశీలన మావశ్యకమైనది. వారు తొమ్మిదివిషయములగురించి వ్రాసిరి. అందొకట కవికాలనిరూపణము తప్పు. (లేదా యాయన క్రొత్తగా నిరూపించినదిలేదు) మరియొకటి గ్రంథకర్తృత్వవిచారమే తప్పు. ఇట్లు బహుముఖములైన వారి దోషభంగిమ లీదిగువ దిక్ప్రదర్శనముగా వారిచ్చిన వరుసలో నిరూపింతును.

### 1. లక్ష్మీకల్యాణము - ప్రోలుగంటి చెన్నశౌరి

లక్ష్మీకల్యాణము యక్షగానమని యూహాగానముచేసి, చెన్నశౌరి సౌభరి చరితను శాబరిచరితను జేసి, శాబరియనగా శబరస్త్రీ యని అనగా చెంచు లక్ష్మీకథయని అది యిదే అని నిరూపించుటకు శిరు పట్టిన ద్రావిడ ప్రాణాయామమును వెంటనే మార్చి సంచికలో శ్రీ శేతవరపు రామకోటిశాస్త్రిగారు చక్కగా నిరూపించి ఆ యసంగతిపు టుపపత్తులకు విప్రతిపత్తి చూపిరి. మరల నేనావిషయము నెత్తుకొనుట యనవసరము. ఇంతకు మపలబ్ధము గాని గ్రంథముగూర్చి యింత యట్టహాసమెందులకు?

### 2. కృష్ణవిలాసము - 'వెన్నముద్ద గణపతి పెద్ద'

దీనికి వివిధ ప్రతివిలేఖకు లనేక నామకరణములు చేసియున్నను అసలు కవి పెట్టిన పేరు గోపాలవిలాసము. వెంకటరావుగారికిది అచ్చయినట్లు తెలియదు కాని నా దొరుకు కందినంతవరకు కిరి క్రీ.శ. 1850—1886 సంవత్సరములమధ్య కాలములోనే ఐదుపర్యాయములు ముద్రితమైనది. కొన్ని అచ్చు ప్రతులను ఆంధ్ర సాహిత్యపరిషత్తు, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార తాళపత్రి ప్రతులతో పరిపోల్చి చూచితిని. అచ్చుమగా నిదే గ్రంథము. వెంకటరావుగారు దీని కర్తృత్వమును ముద్దరాజు పెదరామునకు ముడిపెట్టినారు. కాని ఉదాహరణకొక యచ్చు ప్రతి—1886 లో మదిరాసులో రాయపురం రత్నానాయకర్ గారిచే శ్రీ సరస్వతీ నిలయ ముద్రాక్షరశాలయందు పాకెట్టు సైజులో 96 పుటలుగా ముద్రితమైన ప్రతి (రాజమంద్రి గౌతమీ గ్రంథాలయమున నొక కాపీ గలదు) ముఖపత్రముపై 'పాకనాటి గణపతి రెడ్డి గారిచే రచియింపబడిన గోపాల విలాసము యక్షగానము' అని యున్నది. అందు గ్రంథాంతమున నొక దీర్ఘద్విపదలో ఫలశ్రుతి, కృతిసమర్పణము, కవి వంశావతారమును గలవు. అందు కవివంశము: (యథాతథముగా నుదాహరించుచుంటిని)

"మావంశచరితంబు మహిలోన వెలయ
సావధానంబుగా సన్నుతించెదను
పాకనాటిరెడ్ల భాగ్యమెట్లనిన
నాకలిగొన్నట్టి యర్థుల నెపుడు
పోషింపఁగలిగిన పుణ్యులటంచు
భూషింపుచుందురు భువనంబులందు
నటిమహాపుణ్యు లవనిలో వెలసి

నెట్టనఁగీర్తుల నెగడినవారు
గోనబుద్ధారెడ్డి కులపవిత్రుండు
దానరాధేయుండు ధర్మవిహారి
కామితార్థంబులు కవులకునొసఁగి
రామాయణములోని రసికుఁడైనిలిచె
గురుతుగానమ్ముల గుండ్రంబులందు
నరనుండుబొమ్మన్న సత్కవులెన్న
శ్రీశైలమున సదాశివునకుఁ బ్రీతి
భాగిల్లుగోపుర ప్రాకారతతులు
మంటపంబులు వెలయ మల్లికార్జునకు
జంటభ్రమరాంబకు సదనంబులమరఁ
గనకమయంబుగాఁ గట్టించెఁగుల్లు
జనులు ప్రస్తుతిచేయ జగతిలోఁ బలను
దంగేళ్ళయాచన్న తగనర్థివరుల
ముంగిటిరత్నమై మోదంబుతోడ
ధనకనకవస్తువుల్ తనియంగనిచ్చి
వినయంబుతోడను విఖ్యాతిఁగాంచె
చాలబ్రహ్మరెడ్డి ప్రభుఁడుద్భవిల్లె
మేలుగాదనకని మెరసె జిన్నన్న
పరికింపనతనికిఁ బుట్టె (బట్టియని
యుండదగును) పెద్దన్న
యన్నపిన్నగు (మ) రెడ్డియతనికిఁ బుట్టె
నన్నుతిగాంచెను సకలదిక్కులను
నతనికిఁజనియించె నర్కతేజుండు
మతిమంతుఁడగు పెద్దమండ లేంద్రుండు
కాశికిఁదాఁబోయి కావడిదెచ్చి
భాసిల్లురామేశు పదములుగొల్చి
తగనుసుజ్ఞానాంబ తరుణిఁ బెండ్లాడి
సుగుణవంతుల మేటిసుతులనుగాంచె
విశ్వంబులోఁగడు విఖ్యాతిగాను
విశ్వనాథుండన వెలసె నగ్రజుఁడు
వరుసఁగాళపరెడ్డి వార్ధిగంభీరుఁ
డరయపిన్నమరెడ్డి యంగడిరెడ్డి
నలుగురుసుతుల(లు)ను నలుదిశలందు
చెలువుగఁ బబలిరి జనులునుతింప
వారిలోనెంచఁగ వంశవర్ధనుఁడు
పేరుపిన్నమరెడ్డి పెంపురమింప

* * *

అతివకామాక్షమ్మ యనఘచారిత్ర
మతి నిజపతినెపుడు మఱువకతలఁచు
నిట్టిదంపతులకు నింపులుమీఱఁ
బుట్టినవాడఁను భూజనులొ్వగడ
ప్రేమతోగణపతి పేరునుబెంపు
దీమసంబున వెలయు ధీరుండనేను
భాగవతార్థంబు పదపద్యరచన
బాగుగారచియించి పండితుల్ మెచ్చ
నా రామవిభునకు నర్పణచేసి
గారవంబొప్పఁగాఁ గాంచితిమేలు"

దీనినిబట్టి పై గ్రంథము గణపతిరెడ్డి కృతమను టలో విప్రతిపత్తి యుండరాదుగదా. 'వెన్నముద్ద గణపతి పెద్ద' యను దానియందు వెన్నముద్ద శబ్దము నకు 'కృష్ణుని చరితను కడు వేడుక విన్నముద్ద' యని ముందటి మాటలతో నన్వయమనియు, పెద్ద శబ్దము ఔపచారికముగా నంత్యప్రాస కుద్దిష్టమైనదో, రెడ్డి శబ్దమునకు బదులు పడినదో లేక కవి తాతగారిపేరును గూడ ముక్కుపకోలది చేర్చుకొనెనో అని యూహింప వలసియున్నది.

## 3. శ్రీరామ విజయము
## వెణుతురుబల్లి విశ్వనాథకవి

ఈ కవి కాలము గురించి వెంకటరావుగారు క్రొత్తగా నిరూపించిన దేమియు లేదు. ఇదివరకే శ్రీనడకుదుటి వీరరాజు గారు ఈదులపల్లి భవానీశకవి ధర్మఖండమునకు రచించిన యుపోద్ఘాతములో (పీఠికాపుర సంస్థాన ప్రచురణ, 1931 - పుటలు

9 & 10) నిరూపించియుండిరి. ఈ శ్రీరామ విజయము గూడ ననుపలబ్ధమే.

## 4. కన్యకాపురాణము - ఇటికెల తిమ్మయ

ఏతద్గ్రంథ రచనాలకాలమిదత్థమని తెలియదు. కాని ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారప్రతి (*D. No.* 1843) లేఖనకాలము ప్రమోదూతనామ సంవత్సర శ్రావణశుద్ధ ప్రథమా బుధవారమనియు, దానికి క్రీస్తుశకమున సరియగు తేదీ 13-8-1740 అనియు, దానినిబట్టి గ్రంథము క్రీ. శ. 1740 కి ముందే రచింపబడి యుండవలెననియు వెంకటరావుగారు తీర్మానించిరి. ప్రతిలేఖనకాలము ప్రమోదూత శ్రావణ శుద్ధ ప్రథమా బుధవారమన్న విషయము వాస్తవము. కాని దానికి సరియగు క్రీస్తుశకపు తేదీగా వెంకటరావుగారు పేర్కొన్నది సరికాదు. ఆయన పేర్కొన్న తేదీ, 13-8-1740కి సరియగు తిథి రౌద్రి నామ సంవత్సర భాద్రపద శుద్ధ విదియ. (*Vide Vol VI-Indian Ephemeris by Sri Swami Kannu Pillai*). కాని ప్రమోదూత శ్రావణ శుద్ధ ప్రథమా బుధవార మెంతమాత్రమును గాదు. అట్లు ప్రమోదూత మాస పక్ష తిథివారము లన్నియు కుదిరిన తేదీ క్రీ. శ. 1-8-1810. ఇది ఆప్రతి విలేఖనకాలము. గ్రంథరచన యంతకుముందే జరిగియుండవలె గాని వెంకటరావుగారన్నట్లు క్రీ. శ. 1740 కి ముందు మాత్రమే జరిగి యుండుననుట కుదురదు. అది క్రీ. శ. 1740-1810 నడుమనైన జరిగియుండవచ్చుననవచ్చును.

## 5. పార్థసారథి విజయము - ఆలూరి కుప్పన

దీనిగురించి వెంకటరావుగారు చెప్పినదానిలో క్రొత్త యేమియులేదు. ఇదివరకే ఏతద్ గ్రంథ సమీక్ష కవి వృత్తాంతముతో సహా వ్యాసరూపమున సంస్కృతి పత్రికలో (౨ వ సంపుటము - ౧౧ వ సంచికలో) ప్రకటించియుంటిని. జిజ్ఞాసువులు చూడవచ్చును.

## 6. పారిజాత ప్రబంధము - నరకూరు నారాయణకవి

ఇది క్రీ. శ. 1882 లోనే అచ్చయినది. మరల 1906 లో మదరాసు కోశప్పన్ శెట్టి కనకరాయమొదలారివారి స్వకీయ జీవరక్షా ముద్రాక్షరశాలయందు ముద్రితమై ప్రచురింపబడినది. ప్రసిద్ధములగు యక్షగానములలో నిదియొకటి. గ్రంథకర్త వేంకటగిరి వెలుగోటి ప్రభువుల కాశ్రితుడు. వెలుగోటివారి వంశచరిత్రము 1910 లోనే చెన్నపురి శారదాంబావిలాస ముద్రాయంత్రమున ముద్రితమైనది. వెంకటరావుగారు చెప్పినట్లు అందీకవి విషయమున్నమాట నిజము కాని యది చాలకాలమునుండి పరిశోధకు లెరిగిన విషయమే యని మాత్రము మనవి. (డాక్టరు శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు కొన్ని మాసములక్రిందట నాకిది తెలిపిరి.)

## 7. శకుంతలా నాటకము - వజ్ఝల నరసింహకవి

ఏతత్కృతి రచనా ప్రోత్సాహకుడు, ఆంధ్ర సాహిత్య పరిషత్తునందలి తత్ప్రతి (నెం 695) విలేఖకుడును నంద్యాల నారాయణరాజు. అతని ప్రతివిలేఖనకాలము 'విళంబినామ సంవత్సర భాద్రపద బ ౧౦'. శకవర్షములో వారమో ఏదియు సూచింపబడలేదు కావున నది యే విళంబియగునో చెప్పలేము. వెంకటరావుగారు నంద్యాల నారాయణదేవరాజు క్రీ. శ. 1777లో నున్నట్లు దక్షిణ హిందూ దేశ శాసనములను గ్రంథమున 1 వ సంపుటము 650 పుటలో నొకశాసనమున్నదని యుద్ఘాటించిరి. కాని లేదని మనవి. *Mr. E. Hultzsch* సంపాదకత్వమున వెలువడిన ఆమొదటి సంపుటము తమిళ సంస్కృత శాసనాల సంపుటము మాత్రము. అందసలు 650 పుటలే లేవు. ఉన్నవి 164 పుటలు మాత్రము.

ఈ కృతి రచనా కాలము నూహించుటకొక ఉపాయము గలదు. కవులు తమ కావ్య రచనా కాలమును భంగ్యంతరమున సూచించుటయు నొక శిల్ప విన్యాసమే కనుక, కొందరు తంజావూరు యక్షగాన కవులవలె నీకవియు తన గ్రంథమున భారతపట్టాభిషేక ముహూర్తమును 'బహుధాన్య సంవత్సర కార్తిక శుక్ల దశమి గురువాసరము' గా పేర్కొనెను. అది యితని రచనాకాలమై యుండవచ్చు ననవచ్చునేని యది క్రీ. శ. 3-11-1698 తేదీకి సరిపోవుచున్నది. (*Vide Indian Ephemeris Vol VI*)

## 8. ప్రభావతీ ప్రద్యుమ్నము– గోపాలుని సింగయ

‘ఈకవి నూఱు సంవత్సరముల క్రిందటివాఁ’ డని క్రీ. శ. 1903 లో కవుల చరిత్రము వ్రాసిన శ్రీకందుకూరు వీరేశలింగముగా రన్నారని, “ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నున్న కిరాతార్జునీయ తాళపత్రప్రతి (*D. No* 459 - ఈకవి కృత్యంతరము) నిబట్టి యీతనికాలము 1800 ప్రాంతమని నిశ్చయముగ చెప్పవచ్చు” నని తీర్మానించినారు వెంకటరావు గారు. మొదటిసంగతి యీకవి నూరేండ్లక్రిందటి వాడన్న వీరేశలింగముగారి కాధార మేమిటి ? రెండవది - యీకవి కృత్యంతరమగు కిరాతార్జునీయము తా॥ ప్రా॥ లి॥ పు॥ భాం॥ ప్రతి లేఖకుడు గ్రంథకర్త కుమారుడేయైనను, ఆ ప్రతి లేఖనకాలము యువభాద్రపద శుక్లపంచమి, వారమైన చెప్పబడలేదు, అట్టిచో నరువదియేండ్లకొకపరి తిరిగివచ్చును యువ క్రీ. శ. 1815నాటి యువ అన్నమాటేమిటి? అయితే కావచ్చును, కాని యట్లూహించుట కుపాధియేమి? అట్లు నిరాధారముగ ‘నిశ్చయముగ చెప్పవచ్చు’ ననుట యేమి సబబు ?

## 9. చంద్రతారా విలాసము - ఎల్లయ కవి

శ్రీ నిడదవోలు వారు రాసినమాటలలో స్వతంత్రమై నిక్కమైనది యొక్కటి, ఈ కవికాల నిర్ణయ విషయము - ఇదివరకు వారొరుక కందినంత మట్టు కెవరు నెరుగనిది, ఈయనయే క్రొత్తగా నాధారము నెత్తి చూపినదియు, ఆ యాధారము బుజువున కాగగలదియునైన విషయము.

సాధారణముగ పరిశోధనలో నెంతెంత పండితులకు నొకప్పుడు పదింట నొక పొరపాటు రావచ్చును. కాని వెంకటరావుగారి విషయమున ఆమాట తారుమారైనది. అందును యక్షగాన వాఙ్మయ పరిశోధన కడు కష్టము. ఆ విషయము వారికి తెలిసినదే. అయినను వారత్యంత సాహసికులైన పరిశోధకులు. వారిటీవల మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణగా దాక్షిణాత్యాంధ్ర సాహిత్యముపై నొక భూరిగ్రంథము వెలయించిరి. దక్షిణాంధ్ర యుగమున యక్షగానము లెక్కువ. అందు చాలవర కముద్రితములు. కాని వాని కాంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రకటించిన సవివరమైన గ్రంథదీపిక యొకటి కలదు. దాని సాహాయ్యమున వారెనలేని కృషి కల్పిరి. కాని మూలగ్రంథ సమగ్ర పరిశీలనము లేకపోవుటవలన అనర్థము లనేకము తటస్థించునవి యిదమిత్థముగా నుండును సునూయని సనిదర్శనముగా పరిశోధకులను తర్జించుచున్నది వారిగ్రంథము. ప్రకృత మీవ్యాసము కూడ - వారు పరిశోధనకు దోహదము కల్పించు నుద్దేశముతో వ్రాయుచుంటినని యన్నారు కావున నింత వ్రాయవలసివచ్చినది. అది పరిశోధన కెంత దోహద మొసగ గలదో పైన నిరూపింపబడినది.

# నరకానికి పొలిమేరలు

"ధనిష్ఠ"

సంధ్య బయలుదేరింది. సంధ్య రాకకు సంతసించలేని జలజాప్తుడు పశ్చిమాన క్రుంగిపోతున్నాడు. అంతవరకు అగ్ని కురిపించిన అతని కిరణాలు కెంజాయలో రంజిల్లుతూ తెలిమబ్బుల మాటున తొంగిచూస్తున్నాయి. కలువలకి సంతోషం కమలాలకి సంతాపం కలిగిస్తూ తప్పుకుంటున్నాడు. కోపంలో ఎఱ్ఱబారిన ముఖంతో సంధ్యకేసి మిర్రి చూస్తున్నాడు. కాని తన అసమర్థతకు సిగ్గిలుతూ, శీఘ్రగతిని పయనం సాగిస్తూ ఉష పిలుపు విని, తన్నాహ్వానించే ప్రదేశాలకు పరుగిడుతున్నాడు. లేత నీలిరంగు చీర ఎఱ్ఱ జార్జెట్ జాకెట్ వేసుకున్న సంధ్య, నీలిమబ్బుల మధ్య సాయంత్రపు ఎఱుపులో సంధ్యాదేవి అవతారమెత్తిం దనిపించేటట్టుంది. చేతిలోని వానిటీబాగ్ ఊపుతూ హైహీల్డు శాండల్సుతో కటకటా నడుస్తూంది. రెండు వీధులు గడిచి ఒక వీధిలో యింటిముందాగింది.

ప్రాకారం దాటి లోపల కెళ్లింది. బొమ్మల పుస్తకం తిరగవేస్తూ ఎనిమిదేళ్ల కుర్రాడు సోఫామీద కాళ్లుపెట్టి కూర్చున్నాడు హాల్లో.

"సతీ! అక్కయ్యేదిరా?" అంది వాడితో సంధ్య.

వాడు కిమ్మనలేదు. నిర్లక్ష్యంగా బొమ్మలు తిరగవేస్తూ ఆమె ప్రశ్న ఉపేక్షచేశాడు.

"మాటలు రావుట్రా?" అంటూ వాడి బుగ్గ నులిమింది.

"ఫో! నీతో మాట్లాడను" అంటూ తోసేశాడు బుంగమూతితో.

"అబ్బో! కోపంవచ్చిందే? అబ్బాయికి. ఏమ్మా ఎందుకూ?" అంది అమాయికత నటిస్తూ.

"ఫో.! సతీ ఏంటి? అల్లా అంటే పలకను." అన్నాడు.

"ఒహో! అందుకనా? 'సతి' అంటే ఏమిట్రా సతీ ?"

"మళ్ళీ అదే అంటున్నావు. మా బావతో చెప్పి ఏం చేస్తానో చూడు" అంటూ రౌద్రరసం ప్రదర్శించాడు.

"పోనీ 'సతీశ్' అనే అంటానుకాని అసలు 'సతి' అంటే కోపం ఎందుకు?" అంది వాణ్ణెత్తుకుని బుజ్జగిస్తూ.

"'సతి' అంటే పిల్లంట అక్క చెప్పింది. అల్లా అంటే పలకను" అన్నాడు ముద్దులు గుడుస్తూ.

"సరే అక్కయ్యేది?"

"ఏమో" అన్నాడు మొండిగా.

"అయితే మళ్లీ 'సతీ' అంటా నంతే." అంది చిన్నపిల్లల దెబ్బలాటలోలాగ.

సంధ్య వాడిని మళ్లీ ఏడిపించి ఉడికించే అవకాశం తప్పేలాగ స్వర్ణ రానేవచ్చింది.

"ఏమిటే సంధ్యా వాణ్ణేడిపిస్తున్నావు?" అంది ఎఱ్ఱని పెదిమలమీద చిరునవ్వు మెదిలిస్తూ.

"లేకపోతే! వీడికి 'సతీ' అంటోంటే పౌరుషం తలెత్తుతోంది బుగ్గలు నులిమేవాడు లేక," అంటూ వాణ్ణి దింపింది చిరుకోపం ప్రకటిస్తూ.

"చూడక్కా" అంటూ స్వర్ణ చీర చెరగు చాటుకు పరుగెత్తాడు సతీశ్.

"ఏమిటిలా దారితప్పి వచ్చినట్టున్నావ్?" అంది వ్యంగ్యంగా.

"మరేం! అందరూ నీలాగే ఉంటారా?" అంటూ సాగదీసింది సంధ్య.

"అవును మరి నీలాగే ఉంటారు" అని ఎత్తిపొడిచింది స్వర్ణ.

"నీకంటె వయసేగా. ఎల్లాగయినా నేనే ముందు రావాలని నీకు పట్టుదల" అని అందుకుంది సంధ్య.

"కాదు సంధ్యా! నీకేం స్వేచ్ఛావిహంగం లాంటిదానివి. సంసారం బెడదా ఏమీ లేదు. చక్కగా యింటిపట్టునుండి చదువుకుంటున్నావు. చీకుచింత లేవు. అంచేతే అంతా నీలాగే 'ఆడింది ఆట పాడింది పాట' అనుకుంటున్నావు. వాళ్లా కాదు. ఆయ నింటికి వచ్చేటప్పటికి నే లేకపోతే, పగలల్లా పనిచేసివస్తారాయెను, అదోలా ఫీలవుతారు. అల్లాగని

దేవతలందఱు బ్రాహ్మణులుగనే పరిగణింపబడు చున్నట్లు భాసించుచున్నది. అయినచో శకుంతల బ్రాహ్మణకన్య కావలసివచ్చును. అట్లైనచో రాజునకు వివాహమాడుటకు వీలుండదు. జనన మరణముల వందు మర్త్యులకు జాతులుండును. అవికూడ నాయా జన్మములయందు మాఱుచుండును. కాని దేవత లమరులు కాన వారికట్టి జాతు లుండరాదు. అయిన మేనక యేజాతియైనఁ గావచ్చును. క్షత్రియ స్త్రీయే యని నిర్ణయించుట యెట్లు? పక్షాంతరమునఁ దండ్రి విశ్వామిత్రుఁడు రాజుగాన క్షత్రియ బీజ సంబంధ మున్నది. తల్లియగు మేనక దేవవేశ్యగాన నామెకుఁ గులమే లేదు. కాఁబట్టి శకుంతలకు రాజ పుత్రీత్వము సిద్ధించినదా? వర్ణాశ్రమ ధర్మ పరిపాలకుఁడగు రాజు కూడ దీని నంగీకరించెను. ఈ బాధలు పడలేకయే 'అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా'. అన్నాఁడు కాళిదాసు. ప్రయత్న సాధ్యమైనచో విశేష సుఖదాయక మగును. అందును సహాయాపాయములతోఁ గూడిన ఫలసిద్ధియే యత్యంత సుఖదాయకము. మొదట సుఖ వాంఛ, తరువాత నిస్పృహ, తరువాత నిశ్చితఫలముగు వాంఛలతోఁ గూడిన నన్నయ కల్పనక్రమము కథ కెంతటి రసపుష్టి నిచ్చినది! 'ఆశంక సేయ దగ్నిం త దిదం స్పర్శక్షమం రత్నం', అన్న కాళిదాసు జ్ఞాపకము వచ్చి యేమో తనకుఁ దోఁచినట్లుగ 'అళిపాత వికంపిత పంకజాకృతిన్', అని వ్రాసినాఁడు.

8. ఈ వల్కలాజినములకు...
నీ విలసిత రూపకాంతి నిర్మలగుణముల్
(42—43 ప)

ఇవి మూలములో లేవు. తినుట కన్నము కట్టుకొనుటకు వస్త్రము నుండుట కిల్లు నను నీమూఁడు ప్రతి ప్రాణికి నత్యావశ్యకములుగదా. ఇట్టివి వారి వారి యోగ్యతలకుఁ దగినట్లుండును. ఇవి కలవారిని గూర్చి యెవ్వరును విచారపడ నవసరము లేదు. స్థలానుగుణముగఁ గందమూల వల్కల కుటీరాదులు శకుంతలకు సమృద్ధములై యున్నవే. ఇఁక రాజున కెందుల కీ విచారము! ఆమె సౌందర్య సౌకుమార్యాదుల కిట్టివి తగవనియే యాతని విచారము. మఱి యీవిషయమునఁ గణ్వుఁ డేల యౌదాసీన్యమును వహించెను. రాజు రూపముగ్ధుఁడుగాన విచారపడుచున్నాఁడు. కణ్వుడు రూపముగ్ధుఁడు కాఁడుగదా!

అందువల్లనే యాతనికి విచారము లేదు. ఇట్టివి యుచితములు గావఁట. మఱి యెట్టివి యుచితములు? 'అశేష రాజ్యలక్ష్మీ మహనీయ భోగములు' అనిందితేందు పాదామల తుంగహర్మ్యములు—హారి హిరణ్మయ కుట్టిమంబులు,—ఇట్టివి చక్రవర్తియగు తన్ను జేపట్టినగాని లభింపవు. నిమ్నోన్నతములు—కఠిన శిలా భూమి ప్రదేశములకు బదులు హారిహిరణ్మయ కుట్టిమములు—పర్ణశాలలకు బదులు అనిందితేందు పాదామల తుంగహర్మ్యములు—వల్కల కందమూలములకు బదులు—అశేష రాజ్యలక్ష్మీ మహనీయ భోగములు—కలుగునట. ఆహా! ఇది యెంతటి ప్రలోభనము. అననురూపాహారము తినునప్పుడే బాధ కలిగించును. అటవీ కుటీరావాస మహాక్లేశము బాధాజనకమే కదా! కాఁబట్టియే వస్త్రాకార భూషణాదులకు సరిపడునట్లుగ—అశేష రాజ్యలక్ష్మీ మహనీయ సౌఖ్యములు—అన్న విశేషణ మొక్కటియే వైచినాఁడు. కాని నివాసస్థానమునకు మాత్రము దాదా పొకటిన్నర పాదములో—అనిందితేందు పాదామల తుంగ హర్మ్యములు హారిహిరణ్మయ కుట్టిమంబులు—అని రెండు విశేషణములను వైచి నన్నయ తన లోకాభిజ్ఞతను వెల్లడించినాఁడు.

9. 'కరుణా నిరతులు ధర్మస్వరూపులు...... పరిగ్రహింపుము నన్నన్' రాజు తన శక్తికొలఁది శకుంతలను లోభపెట్టెను. ఎన్నెన్నియో ధర్మశాస్త్రములు వల్లెవేసి యుప్పొంగించెను. అంతయు విని శకుంతల చెప్పిన సమాధాన మిదియే. ఈ సమాధాన మెంత యుక్తియుక్తముగ నున్నదో చూడుఁడు. కూఁతునందుఁ దండ్రికిగాని తండ్రియందు కూఁతునకుఁగాని రక్త సంబంధము చేతఁ బ్రేమయుండుట యుక్తమే. శకుంతలా కణ్వుల కట్టి సంబంధము లేదుగదా. అందునను గణ్వుఁడు లౌకికుఁడు మాత్రమే కాఁడు కేవలము విరాగుఁడగు ముని. తల్లిదండ్రులకు సంతానము నం దెందులకు ప్రేమ పుట్టుచున్నది? భర్తకు భార్యయందుండు ప్రేమయే సంతానమునందు వాత్సల్యముగ మాఱుచున్నది. ఇట్లే భార్యకును. కణ్వునకు భార్యయే లేదుగదా! కేవల మవివాహితుఁడు మాత్రమే కాక యావజ్జన్మముగ బ్రహ్మచారి. ఇట్టి కణ్వునకు శకుంతలయందుఁ బుత్రికా ప్రేమ కలుగుట వింతయే. ఆ వాత్సల్యముకూఁడ దాత్కాలికముగాక దినదిన వర్ధిష్ణువై చిరస్థాయియైనది. ఈ యభిప్రాయ విశేషమునంతయు 'నిరతి' పదము మాత్రముచేతనే ధ్వనింపఁజేయుచున్నాఁడు. కరుణానిరతుఁడఁట! 'కన్నప్రేమకన్న పెంపుడుప్రేమ పెద్దదట' ఇట్టి కణ్వునియందు శకుంతల లోకములోని కూఁతుండ్రు తమ జనకులయందుఁ జూపు భక్తితాత్పర్యముకన్న నెక్కువ భక్తితాత్పర్యములతో నడచుకొనవలయును గదా. దీనినంతయు గ్రహించియే శకుంతల రాజున కట్టి సమాధాన మిచ్చినది.

ఇఁక ధర్మస్వరూపులు అను రెండవ విశేషణము—ఈ శకుంతల కప్పటి కిరువది సంవత్సరముల యీడుండవలయును. తనకు వ్యక్తత వచ్చిన యన్ని

సంవత్సరములలో నొకనాఁడు నొక చిన్న విషయము నందును గణ్వుఁడు ధర్మమును గొంచెమైన నతిక్రమించి నడుచుట యామె యెఱుఁగదు. ఆ శ్రమము నందున్న యంతటి కాలములో నొకనాఁడును దన కనిష్టముగఁ గణ్వుఁడును వాతని కనిష్టముగఁ దానును నడచి యెఱుఁగదు. అట్టిచో యావజ్జీవితమునకు సంబంధించినదియు సకల స్త్రీజనాభిప్రేతమును మహోత్కృష్టమునగు తన యీ కోరికను గణ్వుఁ డేల కాదనను? కాదనకపోవుటయే కాదు. పురువంశలలామ భూతుని వరించినది గాన మీఁదు మిక్కిలి యభినందించును. అయిన నింక సందేహ మెందులకు? కాని కులపతి యనుజ్ఞ లేక తాను స్వతంత్రించుట కామె యంగీకరింప లేదు. ఎంతటి కృతజ్ఞత? శకుంతలా పాత్రమున కిది యపూర్వము నమూల్యమునగు నలంకారము గదా!

10. 'నా యమాత్యులను గణ్వమహామునిపాలికం బెద' దుష్యంతుఁడు తపోవనమునుండి రాజధాని కరుగునప్పుడు శకుంతలతో నీమాటలు చెప్పను; 'నే నింటికిఁ బోయి నిన్ను దీసికొని రాఁదగినవారి నంపెదను,' అనియే మూలము. మంత్రులను బంపునట. ఆ పంపునది శకుంతల యొద్దకుఁ గాదు కణ్వునియొద్దకు. లేకున్న శకుంతల తనంతట తానై కణ్వునితో నీ విషయ మేమని చెప్పఁగలదు! ఈ రాఁబోవు పరిస్థితిని రాజు గ్రహించినాఁడు. గ్రహించియే కణ్వునకు నేనే తెలియఁజేసెదను లేయని యామె మనమునకు ధైర్యము కలుగునట్లును దాము చేసుకొన్న యీ వివాహము ధర్మ్యయుక్తమైనదే కావున భయపడ నవసరము లేదనియు ధ్వనింపఁజేయుచున్నాఁడు. ప్రేమా వేశమునకు సంపూర్ణముగ లొంగిపోవుటచేతను గాంధర్వ వివాహము విధిదృష్టమైనదియే కదా యనెడి ధైర్యముచేతను నప్పటికిఁ గణ్వునికంత ప్రాధాన్యమీయకపోయినను, రాజు కణ్వునిఁ గాని యాతని తపో మహత్త్వమును గాని మఱచియుండలేదు. ఈ కల్పన యెంత యుచితముగ నున్నదో చూడుడు.

11. 'సురుచాశ్రమమున,' అను (57) వ పద్యము నుండి 'అనిన,' అను (64) వచనమువఱకు నుండు విషయము మూలములో లేదు. ఈ కల్పితభాగములో నాలు పద్యములు రెండు గద్యములు గలవు. అభిప్రాయమును బ్రకాశింపఁజేయుటలో వాగింద్రియము తఱువాతఁ గన్నె మిన్న యైనది. వాగింద్రియముకూడ నొక్కమాఱుగ వ్యక్తీకరింపఁజాలని వివిధభావ విశేషములను బ్రకటీకరింపఁగల సమర్థత యింద్రియముల మొత్తములో నొక్క చక్షురింద్రియమునకే గలదు. అందునను నాయికానాయకులనడుమ నది విశ్వరూపమును ధరించియుండును. ఈ వివిధభావావిష్కార పరిణామము ప్రయోక్తల ప్రౌఢిమపై నాధారపడియుండును. అట్టి వానిని గ్రహించువారుగూడఁ బ్రయోక్తలకన్న మిన్నలై యుండవలయును. లేదా సమానులుగనైన నుండితీరవలయును. ప్రస్తుతము శకుంతల సింహాసనమునందున్న రాజును జూచెను. రాజు నామె వంకఁ జూచెను. ఎవరు నొక్కమాటగూడ నాడలేదు. రాజు తన చూపులచేతనే విరసత్వమును గ్రౌర్యమును వర్షించుచుండెను. ఆశ్రమమునం దీరాజే యాకంటితోనే యాదరము ననుగ్రహము, ననురాగమును సంభ్రమమును గురిపించెను. తానుగాని రాజుగాని మాఱలేదు. ఆతనిమనస్సుమాత్రము మాఱినది. ఆదరణాదులు లేకున్నమానె. అబలాజనముపై మానవజాతి సహజమగు మృదుస్వభావముగూడఁ గనపడకపోవుటయే కాక ఈ విరసత్వమేమి? ఈ క్రౌర్యమేమి? క్రౌర్యము విరసత్వముకన్న నధిక బాధాజనకముగదా! ఆశ్రమమునందలి యే రాజుయొక్క యే చూపుసోకిన తన శరీరమునందలి ప్రతిఅణువు నమృతప్లావితమైనట్లుండి మహానందమును గలిగించెనో సభయందలి యీ రాజుయొక్క చూపుసోకి తన శరీరమునందలి ప్రతిఅణువు దావాగ్ని దగ్ధమైనట్లుండి మనస్సును మఱిమఱి మండింపఁజేయుచుండెను. రాజు హృదయమునందలి ప్రతిఅణువును శకుంతల తన మనోనేత్రములతోఁ బరిశీలించినది. తానచ్చటికివచ్చుటయే యాతని కిష్టము లేనట్లు గ్రహించినది. ఇఁకఁ బరిగ్రహించుమాట చెప్పెడిదేమి! రాజు తన్ను సంపూర్ణముగ నెఱింగియే యున్నాఁడు. కాఁబట్టియే క్రౌర్య మగపఱచుచున్నాఁడు. బుద్ధిపూర్వకముగఁ దిరస్కరించుచున్న యతనికి జ్ఞాపకము చేయుటయెట్లు? మఱచినగదా జ్ఞాపకము చేయుట. అభిరుచి నెఱింగియు, నిష్టపడనొల్లనివానికి నచ్చఁజెప్పుటయెట్లు! అందులకనియే 'మఱచినఁ దెలఁపింపనగు', అని యనుచున్నది. రాజులు నవప్రియులట. సహజముగ ముగ్ధులట. పైన బహుకార్యభారమగ్నులట. కాఁబట్టి రాజగుటయే దోషముగాని రాజులకు నవప్రియత్వము, ముగ్ధత్వము, బహుకార్యమగ్నత్వమునుండుట దోషము గాదు. అయిన నిందెవరి దీదోషము? అట్టిరాజును వరించిన తనదే దోషమని పశ్చాత్తాపదుఃఖిత యగుచున్నది. ఈ సందర్భము శకుంతల నుత్తమనాయికగ నిరూపించుటయే కాక యెంతటిలోకజ్ఞతను వెల్లడించుచున్నదో చూడుడు. ఇట్లు నన్నయ శకుంతల కొక నూతనపరిపుష్టి నిచ్చినాఁడు. మఱియుఁ దల్లిదండ్రులు తమ సుఖముకంటె సంతానముయొక్క సుఖమునే యెక్కుడుగఁ గాంక్షింతురు. ఆ తల్లిదండ్రులు బిడ్డలలోఁగూడఁ దల్లియే మిక్కిలి స్వసుఖనిరభిలాషిణి. కాఁబట్టియే శకుంతల తన్ను బరిగ్రహింపుమని కోరుట లేదు. కుమారునిఁ బరిగ్రహింపుమని కోరుచున్నది. ఆ పరిగ్రహమును గూడ నిప్పుడు క్రొత్తగాఁ జేయుమనుట లేదు. మున్ను

చేసినవాగ్దానానుసారముగనే యా కుమారుని యువరాజును జేయుమనుచున్నది. చేయఁబడిన వాగ్దానమున్నను కుమారుఁడు గుణహీనుఁడైనఁ జేయునది లేదు గదా! అట్లు గుణహీనుఁడుకాక పౌరవకులరత్నాలంకారుఁడు, బాలార్కతేజుఁడు, గుణాలయుఁడు, సుదారుఁడునై యున్నాఁడు. అని వినయపూర్వకముగఁ బ్రాధేయపడుచున్నది. ఈ చిత్రణము శకుంతలాపాత్రమునకు సౌచితీపరిపుష్టి నిచ్చుచున్నది.

12. 'అనఘుఁడు——సరస్వతివినిచె మునులు వినఁగ వినువీథి దెస (81 వ. ప)

ఇప్పుడైన శకుంతల మాతృజనసామాన్యోచితముగఁ గుమారుని గుణాతిశయము నుగ్గడించుటలేదు. 'వంశకరుఁడును — నూఱువాజపేయములు చేయువాఁడునగును, భరతుని జన్మవేళ నీమాట నాకాశవాణి చెప్పినపుడు రాజచట లేఁడుగదా. శకుంతల పుత్రవాత్సల్యముచేతఁ గల్పించినేమో! రాజున కెట్లు నమ్మకము గలుగును? అందుకనియే యాజన్మముగ శాశ్వతమవ నెట్టిదియో యెఱుఁగని మహాతపస్సంపన్నులగు మునులను మోతుబరిసాక్ష్యము వేయుచున్నది. తనయునియందవిశ్వాసియైయున్న రాజునకు నమ్మకముగలుగుటకు నిట్టి సాక్ష్యమును వేయుట యను నీకల్పనము నాయికయొక్క వ్యవహారజ్ఞతను వెల్లడించుచు నెంతటిపరిపుష్టినిచ్చినదో చూడుఁడు.

13. విపరీత ప్రతిభాష లేమిటికి — (90 వ ప)

'సర్వస్సగంధేషు విశ్వసితి' విశ్వాసమనఁగా నమ్మకముగదా! నమ్మకమువలనఁ గలుగు ప్రయోజనమేమి? సుఖమే — రక్తము సజాతీయ రక్తాంతరస్పర్శమునంది సుఖించును. కార్యకారణములకు బాహ్యరూపమునందే భేదముండునుగాని యాంతరమునందుండదు. 'సర్వఃకాంతమాత్మీయం పశ్యతి,' అను నార్యోక్తి యన్వర్థముగుచున్నది. పదార్థాంతరముల యనుభూత్యాదులవల్లఁ గలుగు సుఖదుఃఖాదు లశాశ్వతములనియు, నాత్మైకహేతువులగు నిట్టివి శాశ్వతములనియుఁ దత్త్వజ్ఞుల సిద్ధాంతము.

ప్రస్తుతమునందు 'ముక్తాహారములు—కర్పూరసాంద్రపరాగము—చందనము చంద్రజ్యోత్స్న' యను నివి స్వతోభిన్నములుగదా. ఇట్టివానివలన గలుగు సుఖము పరిమితము నశాశ్వతమునైనదిగాన నసంతుష్టికరముగ నుండును. ఇఁకఁ గారణభూతుఁడగు జనకునికంటె కార్యభూతుఁడగు కుమారుఁడు బాహ్యరూపమునందు భిన్నుఁడుగాని తత్త్వతః కాఁడు. కాబట్టి యట్టి కుమారునివల్లఁ గలుగు సుఖమపరిమితమును శాశ్వతము నగుటచేత సంతుష్టికరముగుచున్నది. ఈ సుఖమనుభవైకసిద్ధమే కాని ప్రమాణాంతరవేద్యము కాదు. కాఁబట్టియే, 'ఈ పుత్రగాత్ర పరిష్వంగ సుఖమ్మ సేకొమము' అని యనుచున్నది. ఇదిగూడ మూలమునందు లేనిదియే. నన్నయ గంభీరార్థగర్భముగ నిట్లు శకుంతలచేత ననిపించుట యామె విశేషజ్ఞత నుద్ఘాటించుచున్నది.

14. కడఁగి యిప్పాటనోములు——(91. వ ప)

సుఖదుఃఖములు పర్యాయముగ వచ్చుట ప్రతిప్రాణికిని సామాన్యమే. సామాన్యమును పరిగణింప నక్కఱయే లేదుగదా. ప్రస్తుతము శకుంతలకు వచ్చిన కష్టసుఖము లలోకసామాన్యములు. కాఁబట్టియే యంతటి విచారము. శకుంతల తండ్రి విశ్వామిత్రుఁడు మహారాజు మాత్రమే కాఁడు., రాజర్షి. మహాతపస్సంపన్నుఁడు. అఘటన ఘటనా సమర్థుఁడు. తల్లి కేవలము దివ్యాంగనయే కాదు. అప్సరలకెల్ల మిన్న. ఇట్టి తల్లిదండ్రు లేకాఁతునకు లభింతురు? అట్టి తల్లిదండ్రులకుఁ బుట్టుట మహాదృష్టము. పుట్టిన మఱుక్షణముననే తల్లిదండ్రు లెంతటి క్రూరులైనను సంతాన మెంత గుణహీనమైనను విడనాడుదురా! విడనాడరే. అట్లు విడువఁబడుట మహాదురదృష్టము. మహాతపస్సంపన్నుఁడును బ్రహ్మర్షియుఁ గులపతియునగు కణ్వమహామునిచేతఁ దనుజానిర్విశేషముగఁ బోషింపఁబడుట మహాదృష్టము. తపోవనవాసము వల్కలాజిన ధారణము కందమూలాశనము కుటీరావాసము దురదృష్టకారణములగు దుఃఖములు. దేవేంద్ర ప్రియసఖుఁడు ధర్మమూర్తి చక్రవర్తియునగు దుష్యంతుఁ డంతటివాఁడు తనంతటఁదానైవచ్చి వరించి వివాహమాడుట మహాదృష్టము. చక్రవర్తి లక్షణోపేతుఁడగు కుమారుని గనుట పిని సన్నిఁటిని మించిన గొప్ప యదృష్టము. నిండుసభలోఁ బుత్రసహితముగ నవమానితురాలై నిష్కాసితురాలగుట యెంతటి దురదృష్టము! కాని యేమి లాభము! ఆ సుఖస్థానమునందియుఁ బరిమ్యతినందినది. 'ఫలానుమేయాః ప్రారంభాః సంస్కారాః ప్రాక్తనా ఇవ' పూర్వజన్మమునందు మంచి నోములనే నోచినదఁట. ఇది వాని కుద్యాపనము చేయని ఫలమై యుండును. ఈ చిత్రణము స్త్రీ స్వభావసహజమై రసపరిపోషకముగ నున్నది.

15. 'తన రాజ్యభారంబంతయు భరతుం బూన్చి దుష్యంతుండు తపోవనంబున కరిగెన్' ఇది మూలములో లేదు. రాజులలో నెల్ల సూర్యవంశపు రాజు లుత్తమోత్తములు. 'శైశవేభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం వార్థకే మునివృత్తీనాం' అని యా సూర్యవంశపు రాజులనుగూర్చి మహాకవి కాళిదాసు చెప్పియున్నాఁడు. ఉత్తమ క్షత్రియజాతి కింతకన్న నాదర్శప్రాయమగు జీవితమేముండును! కాఁబట్టియే యాంధ్రమహాకవియగు నన్నయభట్టు గూడ నా మార్గమునే త్రొక్కి నాయక పాత్రమును జక్కఁగఁ బోషించినాఁడు. ఇట్లు మూలములో లేని

పైఁ బదునేను కథాభాగములను గల్పించి మహాకవి యీ చిన్న యుదంతమున నిరుపమానమగు పాత్రౌచిత్యమును నపరిమితమగు రసపుష్టిని గలిగించెను.

ఇఁక 'సంభాషణాదులయందుఁ బాత్రలను మార్పు చేయుట' యను నీతిఁ ననుసరించిన మూఁడవ మార్గ మెట్టి రసపుష్టి నిచ్చుచున్నదో పరిశీలింతము.

## సంభాషణాదులయందలి మార్పులు

1. క్రవ్యాదవేఁట వచ్చియుట......(23.వ ప)

దుష్యంతుఁడు మృగయావినోదియై యాడవుల యందుఁ బరిభ్రమించుచు మృగముల వేయుచుఁ జనుచుచు నాకస్మికముగఁ గులపతి యగు కణ్వమహాముని యాశ్రమమునకు వచ్చెను. 'ప్రతిబధ్నాతి హి శ్రేయః పూజ్యపూజా వ్యతిక్రమః' అను నార్యధర్మము ననుసరించి కణ్వాశ్రమములోని కరిగెను. అతని కచ్చటఁ గణ్వుఁడు గాని యాతని శిష్యులు గాని కనుపడలేదు. లోకైకసుందరియగు నొక కన్యక సగౌరవముగ నతని కర్ఘ్యపాద్యములిచ్చి పూజించి యుచితాసనాసీనునిఁ జేసి కుశలమడిగెను. 'మేము వేఁటాడుచు నిచ్చటికి వచ్చితిమి. కణ్వులింటలేరా! ఎటకుఁ బోయిరి?' అని రాజామెను ప్రశ్నించును. 'అత్మనామ గోత్రాణ్యపి శ్రేయస్కామో నగృహ్ణీయాత్' అను నార్యధర్మము ననుసరించి రాజు తన పేరు గాని యూరు గాని చెప్పి యుండలేదు. పరిత్యక్తరాజలాంఛనుఁడై యున్నను లోకోత్తరమగు నాకారమును నిరుపమానమగు నను భావమును నసాధారణములగు సౌందర్య సౌకుమార్యములనుజూచి యితఁడు చక్రవర్తి దుష్యంతుఁడే యైయుండునని నిశ్చయించి 'జనవల్లభ' అని శకుంతల సంబోధించుచున్నది. ఇచ్చట నీ సంబోధన మెంత యన్వర్థమైనదో చూడుడు. రతి పర్యవసాయియగు సాభిప్రాయమును వ్యక్తీకరించుచున్నది. ఇట నీ వల్లభ పదమునకు మరి యొకపదమును వైచిన నీ యర్థస్ఫురణము రాదు. కావున నిది శబ్దశక్తిమూలక ధ్వని ప్రధానమై కావ్యములలోని కల్లనుత్తమోత్తమ మగుచున్నది.

ఇట్టి యతిథి విశేషమునకుఁ దగిన మర్యాదఁ జేయలేక పోయితి నే యని లజ్జ నొందుచున్నది. జనకులు ఫలాన యనార్థ మడవి కేగిరి. 'మీ వచ్చు టెఱింగిరేని జనవల్లభ! వారును వత్తురింతకున్' అని రాజునకు సమాధాన మిచ్చినది. ఈ సమాధాన మెంతటి సదసార్థ ప్రతిపాదకముగనున్నదో చూడుడు. రాజిచ్చటనుండి కదలుటయే యామె కిష్టము లేదు. పండ్లు తేరఁబోయిన వాఁడు వచ్చుట కెంతసేపు పట్టును! 'కింత్వనుష్ఠాన నిత్యత్వాత్ స్వాతంత్ర్య ముపకర్షతి సంకటాహ్యహితాగ్నీనాం ప్రత్యవాయైర్గృహస్థతా' అనికదా! అదియును గాక రాజు, ఆశ్రమములోనికిఁ బోరు వని విన్నచోఁ గణ్వుఁడు మఱియును దొందరగ వచ్చునట. మీ యందు మా తండ్రి కంతటి గౌరవము కలదని సూచించుచున్నది. అతిథి సత్కారము నందును రాజునందును నింతటి యాదరణము గల కణ్వుఁడు రా జెదురుపడినచో నపలు తాను బోయెను వాఁడే కాఁడే పో. రాజున కాదరణాదులయందు లోప మేమైనఁ గలుగునేమో యను శంకయే కణ్వుఁడు తొందరగా వచ్చుటకుఁ గారణమై యుండును. అతఁడు వచ్చిననే కాని తన యభీష్టము ఫలవంతము గాదు. కాఁబట్టియే బహు కార్యవ్యాపృతుఁడగు రాజు నిట్లు శకుంతల మృదువుగ నిరోధించుచుఁ వారువచ్చి నీకిచ్చిరేని పాణిగ్రహణము సేయుము నన్నున్, అని కూడ ననఁబోవుచున్నది. ఇంతకు నతిథి రాక ముఖ్యము. ఈ సంవాద నైపుణ్యము మూలము నందుఁ గనరాదు.

2 'అంత నేను శిష్యగణంబులతోడ సమిత్కుశ ఫలాహరణార్థం బొక్కెడ కుంజని' ఒక్క కణ్వుఁడే యుపస్పర్శమునకు మాలినీ తీరమున కేగినట్లు మూలమునందుఁ గలదు. ఉపస్పర్శమున కేగు వాఁ డొంటరిగ వెళ్లుట యుక్తమే కాని, నన్నయ యుపస్పర్శమునకు బదులు 'సమిత్కుశ ఫలాహరణార్థంబు' అని మార్చినాఁడు. ఆ వెళ్లినవాఁడు ముని సామాన్యుఁడు కాఁడు. కులపతి! కాఁబట్టి యను నిమేష మెందఱో బుధులు లాతని ననుసరించి యుందురు. మఱియు నా వెడలుట — సమిత్తులు కుశలు ఫలములు తెచ్చుటకొఱకు. అడవిలోని యా యా ప్రదేశములయందు మాత్రమే యవి ప్రయత్న లభ్యములగును. తెలువాత వాని నాశ్రమమునకుఁ జేర్పవలయును. సమర్థులగు శిష్యులు తా ముండియుఁ గులపతి కంతటి ప్రయాస నిచ్చుట కంగీకరింతురా? నిస్సంగుఁడగు కణ్వుఁ డొక్కఁడేయైన నా పనికందుమ జూచి జాలి కలిగియు నేమి చేయఁగలఁడు? ఇంక శిష్యులున్నచో నా సమిత్కుశ ఫలాదులనుగాని యా పని కందును గాని కణ్వుఁడు పోయ నక్కఱ లేదు గదా! దీని నంతయు నన్నయ గ్రహించియే 'శిష్యగణమ్ముల తోడ' ననియు, 'సమిత్కుశ ఫలాహరణార్థము'నియు మార్పు చేసినాఁడు. 'ఉపస్పర్శ కరణము' అనుష్ఠాన నిత్యులగు నైష్ఠికులధర్మము. ఇందు సమిత్తులు—కుశలు కేవలము యజ్ఞయాగాదులగు వైదికకర్మానుష్ఠానమునకు ఫలాదికముల ప్రధానముగ నాహారమునకు నుపయోగించును. 'తేత్వఘంభుంజతే పాపా యే పచంత్యాత్మకారణాత్' ఈ మార్పు కణ్వపాత్రమున కెంతయో యుచితముగ నున్నది. కవులు తాము చిత్రించుచున్న పాత్రములతోఁ దాదాత్మ్యమువందుట సుప్రసిద్ధము గదా! అట్టి తాదాత్మ్యసంభూతివందఁ గలిగిన వారే

నిజమునకు మహాకవులు. వారి కావ్యములే మహాకావ్యములై చిరస్థాయిలగుచున్నవి. ఎంతటి తాదాత్మ్యమును బొందినను కేవలము తత్ప్రదార్థమగుట యరుదు. ఇంక తన స్వభావమును దానే నిరూపించుకొనుచోట భేదశంకకే యవకాశము లేదు. ప్రస్తుతము నన్నయ 'తన కులబ్రాహ్మణు— అవిరళ జపహోమతత్పరు సంహితాభ్యాసు' అని తన్ను గూర్చి చెప్పికొనుచుఁ దన శుద్ధ వైదిక ధర్మానుష్ఠానపరత్వమును బ్రకటించికొనెను. ఇట్టివానికి సమిత్కుశాదులవంటివి ప్రియములై యుండును. కాఁబట్టే నన్నయ యాంధ్రీకరణదశయందుఁ గణ్వతాదాత్మ్యమును బొందుటమాత్రమే కాదు. సాక్షాత్తుగఁ గణ్వుఁడేయైనాఁడు.

3. దుష్యంతుఁ డాశ్రమమున శకుంతలను వరించి వివాహమై తిరుగుమొగమయి తాను జేసినపనికిఁ గణ్వునిదలంచి భయపడుచు రాజధానికేగెనని మూలమునందుఁ గలదు. నన్నయ 'శకుంతలయుఁ దనచేసిన దాని మునివరుం డెఱింగి యలిగెడునో యని వెఱచుచుండె,' అని రాజునకు బదులు శకుంతలయే భయపడినట్లు మార్పుచేసెను. పురుషునకుఁ బరవనితాసాంగత్యము సామాన్యదోషమేయగును గాని మహాపరాధము మాత్రము కానేరదు. స్త్రీ, పాలకుని యనుమతి లేకఁ బరపురుషునివంకఁ జూచుటయ మహాపరాధము. పురుషుఁడు స్వతంత్రుఁడు. స్త్రీ కేవల మస్వతంత్రురాలు. ఇది వైదికధర్మము. భారతజాతికిఁ జెందిన ప్రతిప్రాణికి నిది కడవరాని ధర్మము. వైదికధర్మము పురుషులకు విధించిన నియమములకన్న స్త్రీలకు విధించిన నియమములు లత్యధికములు. అధికములయ్యును జాలవఱ కాచరణసాధ్యములుగూడనై యున్నవి. పురుషుఁ డెన్ని వివాహములనైన నాడవచ్చును. స్త్రీకిమాత్ర మొక్క వివాహమునే వేదము విధించుచున్నది. ప్రస్తుతము దుష్యంతుఁడు పురుషుఁడు. కేవలము సామాన్యపురుషుఁడు కాఁడు. రాజు — సామాన్యరాజు కాఁడు చక్రవర్తి. 'రాజానో బహువల్లభాశ్శ్రూయంతే', విధిచోదితమగు గాంధర్వవివాహాదివిధానముచేతనే శకుంతలను బరిణయమాడి యుండెను. తాను చేసినది తప్పైనపుడుగదా? భయపడవలసినది. కణ్వునకుఁ జెప్పలేదనియే నా భయపడుట! ఆ గాంధర్వవివాహవిధానమునందుఁ బోషకులకుఁ జెప్పితీరవలయునను నియమము లేదే! ఇంతకును జెప్పెడువా రెవరు? కన్యయా! వరుఁడా! పురుషుఁడు స్వతంత్రుఁడని 'చెప్పవలయునని నియమములున్న విషయములుకూడ నెవరితోడను జెప్ప నక్కఱయే లేదా? తాను వర్ణాశ్రమ ధర్మపరిపాలకుఁడగు రాజుగావునను, కణ్వుఁడు కులపతియు మహాతపస్సంపన్నుఁడు గావును కేవలము మర్యాదామాత్రమునకైనఁ జెప్పవలయును. ఇంత మాత్రమునకే రాజంత భయపడుట యంత యుక్తముగ లేదు. కాఁబట్టియే శకుంతల భయపడెనని నన్నయ మార్పుచేసినాఁడు. శకుంతల భారతీయ స్త్రీ. దిక్కుమాలినగినురాలు. కేవల కరుణాపరతంత్రుఁడై నామెను గణ్వుఁడు పెంచి పెద్దచేసినాఁడు. స్త్రీ వివాహమునకుఁబూర్వము తండ్రికిని వివాహానంతరము భర్తకును భర్తృపరోక్షమునందుఁ గుమారునకును లోఁబడి యుండవలయును. ఎంతటి ధర్మయుక్తమైన కార్యమైనను నామె స్వతంత్రించి చేయరాదు. మంచి యరుపాజ్ఞలలోఁ బెరిగినది. ఇట్టి తా నకారణవత్సలుఁడగు కణ్వునకుఁ దెలియకుండ వివాహము జేసికొనుట మహాపరాధముకదా! తా నంగీకరింపకున్న నెంతటివారైన నేమిచేయఁగలఁడు? అంగీకరించుట తనదోషము కాఁబట్టి కణ్వునకుఁ దెలియఁజేయవలసిన బాధ్యత తనకున్నంత యధికముగ రాజునకు లేదు. కావున శకుంతలయే భయపడుట యుక్తముగ నున్నది.

4. 'ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను (55 వ. ప)

ఈ పతివ్రతాధర్మము — కణ్వుఁడు శిష్యులకుఁ జెప్పినట్లు మూలమునందుఁ గలదు. ఆచరించువారే ధర్మస్వరూపమును దెలిసికొనవలయును. ధర్మమాచరణజీవికము. ప్రతివ్రతాధర్మము నాచరించువారు స్త్రీలు గాని పురుషులు కారుగదా! అట్టిచో నీ ధర్మము శిష్యుల కుపదేశించుట యుక్తముగ లేదు. శకుంతల స్త్రీ గావునను భర్తృగృహమున కేగవలసినది కావునను శకుంతల కుపదేశించుటయే మిక్కిలి యుక్తియుక్తముగ నున్నది.

ఆడువారికిం బుట్టింటిమీఁది ప్రేమ యధికముగ నుండును. పుట్టి పెరిగిన యింటిని సోదరులను తల్లిదండ్రులను బశుపక్ష్యాదులను తరుగుల్మలతాదులను సఖీజనమును విడుచుట సామాన్యవిషయము కాదు. కాఁబట్టియే 'పతులకడను యునికి సతులకు ధర్మువు' అని శకుంతలకు నచ్చఁజెప్పుచున్నాఁడు. ఈ మార్పు కణ్వపాత్రమునకుఁ జక్కని పరిపోషము నిచ్చినది. ఇట్లు నన్నయభట్టు, అనౌచిత్యములను బరిహరించి రసపరిపోషమునకుఁ గొన్నింటినిఁ జేర్చి మఱికొన్నింటి మార్చి శకుంతలోపాఖ్యానమును సర్వాంగసుందరముగ నాదర్శప్రాయముగఁ జిత్రింపఁ బ్రయత్నించెను.

# యుగళగీతిక

శ్రీ బాల గంగాధర తిలక్

కిటికీ అవతల
కుండులోని పూలమొక్కలు
పచ్చని ఆకుల పచ్చివాసనలు;
ఆకాశపువంపు వద్ద
తెలిమబ్బుల వలయంలో
మెరుస్తూన్న ఆర్ద్ర;
నలిగిన కిటికీ
రంగుచారల తెరల సందులనుండి
వీచేగాలుల చల్లనికనురెప్పల కదలికలు;
గోడమీద భారంగా
వంగిన పటాలు;
పేజీలు ముడుచుకొని పడుకొన్న
బీరువాలోని పుస్తకాలు;
కుర్చీ,గుండ్రబల్ల,యిస్త్రీమడతలదుస్తులు
సగంతెరచిన సూట్ కేసు;
ఒలికిన అత్తరు సుతారపు సువాసన;
గదిలో చీకటిలో
చిటిలిన తారలట్లు
సగం కాలిన అగరువత్తుల కొనలు;
ఆరిపోయిన హారికేన్లాంతరు
దీపపువత్తిచివర నిద్రపోయేనిప్పునలుసు;
మరువం, దవనం
మల్లెచెండ్లు మేల్కొల్పిన
వెచ్చని తొలివేసవి జాగృతి;
పందిరి మంచంపైన
ఆమె చిరునవ్వులో
కవిత్వంలాంటి కొత్తదనం మెరిసింది!
ప్రేమవంటి
స్నేహంవంటి
ఆమె కన్తుదల జాలివంటి ఆనందంవంటి
ముగ్ధమైన స్నిగ్ధమైన
ఆకర్షణ;
కామం వంటి
కైపువంటి
అనాది అనాది కాంక్షాతప్తమైన
నెత్తుటిలో ఒక తొందర;
కౌగిలి ఒదిగిన పొదిగిన ఒకనిట్టూర్పు;
గడియారపు డయల్ మీది
రేడియమ్ అంకెలు
చీకటి మార్జాలపు పచ్చనికళ్లు!
కిటికీ అవతల
ఒక వెన్నెల బిందువు
కొబ్బరి మొవ్వలోనికి జారినట్లు-
వినపడీ వినపడని చప్పుడు!

# కలగూరగంప

## 'కోమటి' శబ్ద చర్చ

శ్రీమతి కె. భ్రమరాంబ

మార్చి నెల భారతి సంచికలో 'కలగూరగంప' క్రింద శ్రీ కుందుర్తి ఈశ్వరదత్తుగారు రచియించిన 'కోమటి శబ్దం' ప్రకటింపబడినది. కొండవీడు రాజధానిగా రెడ్డిరాజ్యమును పరిపాలించిన రెడ్డిరాజుల పేర్లకు మొదట కోమటిశబ్దం ఎట్లు వచ్చినదో పండితులు విమర్శింపవలెనని ఆ వ్యాసంలో వ్రాసి యున్నారు.

గుంటూరు మండలములోని కొండవీడును ముఖ్య పట్టణముగా చేసికొని పరిపాలించిన రెడ్డిరాజులు తొల్దొల్త కాకతీయ చక్రవర్తులకు సామంతులు. కాకతీయ సామ్రాజ్యము క్రీ. శ. 1325 లో విచ్ఛిన్నమైన తరువాత యీ రెడ్డిరాజులు స్వతంత్ర ప్రభువులైరి. కోమటి అనే జైనదేవుఁడు (గోమటేశ్వరుఁడు) ఉండెడివాఁడు. అందుచేత నీ రెడ్డిరాజుల పేర్లకు మొదట "కోమటి" అని యుండెడిది. అశోక చక్రవర్తి నిర్యాణమునుఁ బొందిన శ్రావణ బెల్గోలాలో "గోమటేశ్వరాలయము"ను దేవాలయము నేఁటికి నున్నది.

ఐతే, యీ రెడ్డిరాజులు జైనమతస్థులుగా దోచుటలేదు. గోదావరి, కృష్ణా, పినాకినీ నదీత్రయము నడుమనున్న మధ్యాంధ్రదేశమునుఁ బరిపాలించిన ప్రోలయ వేమారెడ్డి యీ వంశమునకుఁ మూలపురుషుఁడు. ఇతని కాలమున రెడ్డిరాజ్యమునకు 'అద్దంకి' ముఖ్యపట్టణము. "శంభుదాసుఁడు", "ప్రబంధ పరమేశ్వరుఁడు" అను బిరుదములఁ గాంచిన చదలువాడ ఎఱ్ఱాప్రగడ యితని యాస్థానకవి. భారతారణ్య పరిశిష్టభాగమునుఁ దెనిగించిన యీకవి రచించిన రామాయణము నత్యాదరముతో ప్రోలయ వేమారెడ్డి యాలకించుచుండువాడట. ఈ కోమటి ప్రోలయ కంకితముగా యెఱ్ఱాప్రగడ "హరివంశ"మను ప్రబంధమును గూడ రచించెను. ఈ ప్రోలయ వేమారెడ్డి శ్రీశైలమునకు అహోబలమునకు మెట్లు కట్టించెను. ప్రోలయ వేమారెడ్డి కుమారుఁడు అనపోతారెడ్డి అద్దంకిని విడిచి కొండవీటిని రాజధానిగాఁ జేసికొని పరిపాలించెను. ఇతని తరువాత రాజ్యమేలిన అనవేమారెడ్డి పట్టాల శివపూజా ధురంధరుఁడు. ఇతని యన్న కుమారుఁడు కొమరగిరి రెడ్డి "వసంతరాజీయము"ను నాట్య శాస్త్ర గ్రంథమును రచించెను. ఇతని భావమఱఁదియైన కాటయ వేమారెడ్డి కాళిదాస నాటకత్రయమునకు వ్యాఖ్యానములు వ్రాసెను.

తరువాత రాజైన పెదకోమటి వేమారెడ్డి శృంగారదీపిక, సప్తశతీసారటీక, సాహిత్య చింతామణి సంగీత చింతామణి యను గ్రంథముల వ్రాసెను. శ్రీనాథుఁ డితని యాస్థానకవి. ఇతడు రచించిన గ్రంథములు జగద్విదితమే. వీరు పంటదేసటిరెడ్లు. ఇంటిపేరు దేసటివారని కాశీఖండ తృతీయాశ్వాసమున శ్రీనాథుఁ డిట్లు వ్రాసెను.

శ్రీమ ద్దేసటివంశ,
గ్రామణి మార్గాభిషిక్త శంకరవసు
త్రామనిభ వైభవోన్నత,
భామాహాంచాల వీరభద్ర నృపాలా!

ఈ కాశీఖండము రాజమహేంద్రవర రెడ్డిరాజగు వీరభద్రారెడ్డి కంకితముగా శ్రీనాథుఁడు రచించెను.

అందువలన గోమటేశ్వరుఁడనే జైనదేవుని పేర గౌరవచిహ్నముగా దమ పేర్లకు మొదట కోమటి అను పేరు ధరించిన యీ రెడ్డిరాజులు జైనులు కాక శైవు లని తోచుచున్నది. తొల్దొల్త జైనులుగానుండి తరువాత శైవులైన కాకతీయులవలె నీ రెడ్డిరాజులు కూడ మొదట జైనులుగానుండి కొండవీటి రెడ్డిరాజ్య మూలపురుషుడైన దేసటి వేమారెడ్డి నుండియో అంతకు పూర్వమో శైవులుగా మారియుండవలెను.

# ఉత్తరాదివారి ఉగాది

శ్రీ చోళ్ల విష్ణు

చైత్రశుక్ల పాడ్యమి ఆంధ్రులకెంతయో, ఆహ్లాదకరమైనదినము. అది మనకు పవిత్రమైనపండుగ. గాన ఆబాలగోపాలము పరమానందముతో ఆ పండగను చేసుకుంటాము. దాన్ని మనం "ఉగాది" అని "తెలుగు సంవత్సరాది" అని వ్యవహరించుకుంటాము.

దీనికి సరిగ్గా పదిహేనురోజులకు పూర్వం ఫాల్గుణ పూర్ణిమ ఉత్తరాదివారికి అత్యంత ఆనందము, ఆహ్లాదకరమైన దినము. ఇది వీరికెంతో పవిత్రమైన పర్వదినము. గాన వారపరిమితానందంతో జరుపుకుంటారా పండగను. దీన్ని వీరు "హోలీ" "హోలికా" "హోలాక్", అని వ్యవహరించుకుంటారు. సంస్కృతంలో ఈ మొదటిరెండుపదాలకీ వసంతోత్సవమనీ, మూడవపదానికి అసంపూర్ణముగ కాల్చిన శెనగలు, గోధుములు అని అర్థం ఊహింపబడుతున్నది.

హోలీపండగ సంవత్సరానికి ఆఖరి పండగని వీరి నమ్మిక. కాని విక్రమసంవత్సరము 2012 వ సంవత్సరము ఫాల్గుణ కృష్ణపాడ్యమితో ఆరంభమవుతున్నది. చతుర్దశ మనువుల్లో ఒక మనువు పుట్టినది ఈదినమేనని వీరికి గట్టినమ్మకం. గాన ఈ హోలీ పండగ ఉత్తరాదివారి ఉగాదిపండగని మనం చెప్పకోవచ్చును.

ఇక్కడి పండితుల అభిప్రాయప్రకారంగా ఇది అతి ప్రాచీనమైన పండగ. దీని ప్రాచీనతను గురించి అనేక గాథలు ప్రచారములో గలవు. అందు పౌరాణికమైన, ప్రాకృతికమైన, వైజ్ఞానికమైన గాథలు అత్యంతప్రధానమైనవీ, ప్రామాణికమైనవీను.

పౌరాణికము:—విష్ణుపురాణములోని ప్రహ్లాదుని కథ మన ఆంధ్రులందరికీ తెలిసినదే. కాని అందొక అంశము మన ఆంధ్రదేశంలో ప్రచారమువ లేదని నా అభిప్రాయము. ఆ అంశమే ఇక్కడివారి ఈ పండుగకు ప్రధాన ప్రాతిపదికగ తలపబడుచున్నది. హరినామసంకీర్తన తత్పరుడైన ప్రహ్లాదుని చంపవలెనని చేయగల యత్నాలన్నీ చేసి కడకు హతాశుడై ఊరుకుంటాడు హిరణ్యకశ్యపుడు. అప్పుడు "హోలికా" అను అతని చెల్లెలువచ్చి అన్న విచారమునకు గల కారణం తెలుసుకుంటుంది. "రెండునిమిషాలలో నేను ప్రహ్లాదుని చంపుతాను. నీవు విచారపడవద్దని" అన్నకు ధైర్యంచెప్పి, మేనల్లుడైన ప్రహ్లాదునిఒడిలో కూర్చుండబెట్టుకుని తాను స్వయముగ పెద్దమంటలో కూర్చుంటుంది. పూర్వమెప్పటిదో శివుని వరప్రసాదంగా లభించిన ఒక వింతచీర ఆమెకు గలదు. ఆచీర ధరించినవారిని అగ్ని ముట్టదట. ఆ గర్వంతో నాడాచీర ధరించి మంటలోకూర్చున్నది హోలిక. భక్తాగ్రేసరుడు, భాగవతోత్తముడును అయిన ప్రహ్లాదునిముందు ఈలాటి కపటనాటకములు చెల్లుతవా? నలువైపులనుండి మంటలు లేచేసరికి తనచీరతోపాటు ఒక్కసారిగ భస్మమైపోతుందా హోలిక. పరమ భాగవతుడు ప్రహ్లాదుడు ఇక్కడకూడా జయం పొందాడు. ఆ ప్రహ్లాదుని విజయసూచకంగానే నేడీ పండగ చేయబడుతున్నది.

భవిష్యత్ పురాణప్రకారం మరొకకథ ప్రచారమున గలదు. పూర్వం రాక్షసులరాజ్యమైన లంకారాజ్యం జయించి దాన్ని పరిపాలిస్తుంటాడు కుబేరుడు. తిరిగి ఏవిధముగనైనా కుబేరుణ్ణి ఓడించవలెనని పట్టుదలతో వుంటారు రాక్షసులు. అందు లంకాపరిరైన ఒక రాక్షసుని కూతురు శివునిగూర్చి ఘోర తపస్సుచేసి ఎవరిచేతుల్లోనూ చావకుండావుండాలని వరంపొందింది. ఆరాక్షసి పేరు ధోంధా. ఆ రాక్షసి కోరినప్రకారం వరమైతే యిచ్చాడుగాని ఒక కిటుకు పెట్టాడు మాయలమారిశివుడు. పిల్లలచిలిపిచేష్టలకూ, వారి బీభత్సకృత్యాలకు జాగ్రత్తగ వుండమన్నాడు శివుడు. ఆభయంకూడా లేకండా చేసుకోవాలని నాటినుండి బిడ్డలను భక్షించడ మారంభించిందా ధోంధా రాక్షసి. తరువాత ఈ మర్మం తెలిసిన పిల్లలందరూ కలసి తమకు తోచినట్లల్లా వికృతరూపాలు ధరించుకుని యిష్టమొచ్చిన దుష్టచేష్టలు చేస్తూ, ఆ రాక్షసివెంటబడి కడకు దాని వూరు పేరు లేకండా రూపుమాపారు. ఆ ధోంధా రాక్షసి స్మృతి చిహ్నంగా నేడీహోలీపండగ చేయబడుతున్నది. ఈనాడు లోతకలిగించే పనులెన్నో చేస్తారు. ఈలా చేయాలని గట్టినమ్మకం కూడాను.

వైజ్ఞానికం:—శిశిరఋతువు ఆకురాలుడు కాలమగుటచేత ఆకులు కుళ్ళి, పెంటలు పెరిగి భూమండలమంతా కల్మషంగా మారిపోతుంది. దాని ద్వారా వాయువు, వాయువుద్వారా ఆకాశమండలమూ కలుషితమయిపోతాయి. వీటి ఫలితముగ మానవసమాజములో పలురకాలైనవ్యాధులు వ్యాపిస్తాయి. గాన తన్నివారణార్థమై శిశిరఋతువు ఆఖరిపాదంలోను, వసంతఋతువుకు పూర్వం చెత్తనంతా ఒకచోటచేర్చి మరికొన్ని సుగంధద్రవ్యాలుచేర్చి, పలుచోట్ల తగలబెడతారు. ఈలాంటి దహనక్రియలతో భూమండల

మంతా శుభ్రపడుతుంది. సుగంధద్రవ్యాల పొగద్వారా మైన వాతావరణం బాగుపడుతుంది. క్రిమికీటకాదులు నశించిపోతాయి. ఈ విధంగా మానవులు పలురకాలైన రోగాలనుండి రక్షింపబడతారు. ఈ కారణంగాకూడా హోలీపండుగ ఆచరించబడుతున్నది.

ప్రాకృతికం :— శరీరాలను పీల్చి పిప్పిచేసే, ఎముకల్ని కొరుక్కుతినే చలితో బాధపడే మానవులకు హేమంతశిశిరఋతువు లత్యంత కష్టదాయకములు. ఉండనిల్లు, కట్టబట్ట, తిన తిండీలేని అధిక సంఖ్యాకులైన పేదప్రజానీకానికివి మరింత ప్రమాదకరములు. కాలచక్రపు వేగంలో కష్టప్రదములైన ఈ శీతఋతువులు క్రమక్రమంగా వెనకబడిపోతుంటాయి. వీటితోపాటు కష్టాలకు ఆలవాలములైన కాలరాత్రులు మెల మెల్లగా కాల గర్భంలోకి దిగజారిపోతుంటాయి. ఎదురుగ ఆనంద ఆహ్లాదములతో కలకలలాడుతూ వసంతభానూదయమవుతూ వుంటుంది. దీనికితోడు ఏడాదిపొడుగునా చేసిన శ్రమ సస్యశ్యామలంగా పెరిగి, పండి, ఫలించిన పైరులు కనులపండువుగ కలకలలాడుతూ అవుపడుతుంటాయి. దశదిశలా సౌరభం వెదజల్లే పుష్పగుచ్ఛములతో కిలకిలా, కలకలా నవ్వే ప్రకృతీ, చేతనాచేతన ప్రపంచమంతటినీ తన ఆనందంలో ముంచి వోలలాడించే మధుమాసము ఎదురుగా అవుపడుతూ వుంటాయి. అచేతనములైన వృక్షలతాదుల శరీరాలలో పులకరింతలు పుట్టించే ఆ వసంతఋతువు చేతనులైన మానవుల శరీరాలను పులకరింపజేయడంలో అబ్బురమేమి? ఈవిధముగ ప్రకృతి కానందానికి ప్రతిరూపకముగాకూడా ప్రచారంలోకివచ్చిందీ హోలీపండుగ.

కనుక హిరణ్యకశిపుని చెల్లెలు హోలికా పరాజయ, భక్తప్రహ్లాద విజయచిహ్నంగానైతే నేమి, ధోంఢారాక్షసి జ్ఞాపకార్థమైతే నేమి, వైజ్ఞానిక మానవ రక్షణార్థమైతే నేమి, ప్రకృతిజన్యమైన ఉల్లాస ప్రతిరూపముగనైతే నేమి ఫాల్గుణ పూర్ణిమనాడు హోలీ పండుగ అతి ఆనందముగ జరపబడుతున్నది. ఇదే విధముగ వాటివాటి స్మృతిచిహ్నాలైన గ్రామగ్రామపు హోలీమంటలు, ఆనందాతిరేకంతో పాడేపాటలు, వేసేకేకలు, అయోమికటారావాలు, వసంతోత్సవసూచకమైన ఉల్లాసము, కుంకుమ, ఎఱ్ఱబుక్కాపొడి — వీటి కలయిక వాతావరణాన్ని మరింత కనులపండువుగ, ఆనందప్రదముగ చేసివేస్తాయి.

## విధానము

ఫాల్గుణపూర్ణిమనాడు హోలీదహనక్రియ తప్పని సరిగ ఆచరిస్తారు. గాని దీనిఉత్సవంలో ఉపక్రమోప సంహారాల కొక నిశ్చితమైన రోజుగాని, ముహూర్తం గాని లేవు. పలు ప్రాంతాల్లో పలువిధాలుగ ఆరంభిస్తారు. అనేకవిధంగా ఆఖరుచేస్తారు. ప్రస్తుతపు హోలీ పండుగ జరిపే విధివిధానాలుకూడా భిన్న భిన్న ప్రాంతాల్లో భిన్న భిన్న రకాలుగ వుంటాయి. ఒకదాన్ని మించి ఒకటి రుచిరవంతముగాను, ఆశ్చర్యకరంగాను ఉంటాయి. అన్ని ప్రాంతాలను గురించి యిక్కడ రాయడం అసంభవం గాన ఒకటి రెండు ప్రాంతాలను గురించే రాస్తాను.

ఉత్తరప్రదేశం:—మాఘ శుక్లపక్షపంచమి వసంత పంచమిగ వ్యవహరించడం యిక్కడి వాడుక. నాడు చిన్న పండుగగూడ జరుపుతారు. చిన్నపిల్లలు, యువతీ యువకులు రంగువస్త్రాలు ధరించుతారు. రొట్టె పప్పు మొదలైన తినుబండారాలలో సహితం ఈ రంగు కలుపుకుతింటారు. హోలీ పండుగ వేడుకలుకూడా ఈ దినంనుంచే ఆరంభిస్తారు. ప్రతిగ్రామంలోను చిన్న గొయ్యి తవ్వి అందొక రాగిడబ్బు, చిల్లిగవ్వ, వక్క పెట్టి వాటిపైన పొడుగాటి స్తంభము నిలబెట్టి గొయ్యి పూడుస్తారు. నాడు మొదలు ఫాల్గుణ పూర్ణిమ వరకు ఊకూక్కా తుట్టా, కంపా కర్రా తెచ్చి ఆ స్తంభాన్ని చెర్చి పెద్ద గుట్టగా చేస్తారు. మధ్య మధ్య విలువగల కర్రలు, మంచాలు, వ్యవసాయపు పనిముట్లు దొంగిలించి తెచ్చికూడా అందువేస్తారు. ఇతరులచేత తిట్లుపడడం, దెబ్బలు కొట్టించుకోవడం ఈ ఉత్సవదినాల్లో తప్పనిసరైన, గౌరవప్రదమైన ఆచారం. గాన దొంగిలించేవారి కెట్టి భయ సంకోచాలు ఉండవు. సంధ్యాసమయాల్లో పురుషులు గుంపులు గుంపులుగ చేరి మొఖాని కింత కుంకుమ, ఎఱ్ఱ బుక్కాపొడి పూసుకుని తాళాలు చప్పట్లు కొట్టుకుంటూ ఉత్సాహంగా పాటలు పాడతారు. మధ్య మధ్యపిచ్చి పిచ్చి కేకలుకూడా వేస్తారు. స్త్రీలు యువతులు వేరే గుంపులు గుంపులుగ చేరి శృంగార గీతాలు పాడుకొంటూ సరసల్లాపా లాడుకుంటారు. ఈ సమయాల్లో అశిష్టవ్యవహారాలన్నీ శిష్టవ్యవహారాలుగా తలపబడడమే గాక ఆచరణీయాలుగానే ఎంచబడుతున్నాయి.

ఆఖరి దినం పూర్ణిమనాడు గ్రామస్థులందరూ వారు వీరనే భేదం లేకండా అన్ని కులాలవారు ఆబాలగోపాలంతోపాటు ఊరిబైట పోగు వద్దకు చేరుకుంటారు. కొందరు డప్పులు డోళ్ళు తెస్తే మరి కొందరు గోధుమ కంకులు చిన్న చిన్న కట్టలుగ కట్టి తీసుకువస్తారు. స్త్రీలు పేడనీళ్లు, పసుపునీళ్లు తెస్తారు. ఇంకా బిడ్డలకు పెట్టిన నలుగు పోగుచేసి తెస్తారు కూడాను. ఇక పంచాంగంకట్టతో తయారవుతాడు పురోహితుడు. గుట్టవద్దకు చేరిన ప్రజలు గుట్టకు ప్రదక్షిణం చేస్తారు. మధ్య మధ్య పసుపునీళ్లు, పేడనీళ్లు ఆ గుట్టమీద పోస్తుంటారు. పురోహితుడు మంత్రాలు చదువుతుంటాడు. సాంకేతిక ముహూర్తం రాగానే పురోహితుడు అగ్ని సంస్కారం చేసి ఆ గుట్టకు స్వయంగా నిప్పంటిస్తాడు. భగభగమని ఆ గుట్టనుండి అగ్ని ప్రజ్వలించేకొద్దీ శరీరాలుప్పొంగుతుంటాయి జనసముదాయానికి. పెద్దపెద్ద కేకలు వేస్తూ, "భక్తప్రహ్లాదకీ జై" అంటూ మంటచుట్టూ వలయాకారంగా తిరుగుతారు. డప్పులు డోళ్ళు వాయిస్తూంటారు. వెంటతెచ్చిన నలుగు మూటలు చిన్న పిల్లలమీద దిగదుడిచి మంటలో పడేస్తారు తల్లులు. "హోలీమాతా దేకో అసీస్, లరికా జియే లాఖబరీస్" అని ఆశీర్వాదాలడుగుతారు అగ్నిదేవుణ్ణి. వెంటతెచ్చిన గోధుమ, జవ్వకంకులు ఆ మంటలో వెలిగించి ఇంటింటికీ అవి చూపిస్తూ తిరుగుతారు యువకులు. మరికొందరు యువకులు కర్రముక్కలూ, గడ్డికట్టలు వెలిగించుకుని ఇండ్లసందుల్లో తిరుగుతారు. ఆ వెలుతురు ప్రవేశించినంత దూరం రాక్షసులు మొదలైన దుష్టశక్తి లేవీ వుండవని వీరి నమ్మిక. కొన్నికొన్ని గ్రామాల్లో ఆయేడు మృత్యువాతబడిన వారి పరివారాలను తీసుకువచ్చి ఆ మంట కానించి కళ్ళనద్దు ఆచారంకూడా కలదు. ఆ ఘడియనుంచి వారు చావు కీడునుంచి ముక్తులవుతారు. అందరితోపాటు ఉత్సవంలో పాల్గొంటారు. మంటలారిపోయిన తరువాత ఎవరిండ్లకు వారు చేరుకుంటారు.

శిశిరవసంతములు, పాతకొత్తలు ఒకదానికొకటి ప్రతీకములు. ఒకదానికి స్వస్తిఅయితే రెండోదానికి స్వాగతము. ఈ చిత్రసంయోగం ఒక్క ఫాల్గుణ మాసములోనే కలుగుతున్నది. ఇందుకే గాబోలు వసంత ఋతువంటే ప్రకృతియొక్క నిండుయౌవనమన్నారు. ప్రకృతిలో గల ఆనందఉల్లాసాలు మానవుల కాపాదించడం సహజం. అందు పురుషులకన్న స్త్రీలకు మరీని. "ప్రకృతి స్వరూపానారీ" అను వాగోక్తినిబట్టి కూడా ప్రకృతిలోగల ఉత్సాహ ఉల్లాసాలు స్త్రీలలో అధికముగ ప్రస్ఫుటించాయి. హోలీ పండుగకూడా స్త్రీ లయిన హోలికా, ఢోంఢా, రాక్షసులద్వారానే వచ్చింది. గాన స్త్రీలలో అధికోత్సాహము, ఉల్లాసమూ ఉండుట వింతగాదు.

సందర్భవశాత్తు హోలీపండుగ వదిన మరుదుల పండుగ. ఫాల్గుణ మాసములో స్త్రీలంతా వదినెలు, పురుషులందరూ మరుదులనే భావం ఉత్తరాది వారిలో వ్యాపించి వుంటుంది. మానవుని రాగాత్మక వృత్తికి కారకులైన కృష్ణగోపికల రాసక్రీడలే, దీనికి ప్రాతిపదికములు. ఈ మాధుర్య భావ ప్రేరణచేతనే స్త్రీపురుషులు లౌకిక భేదాలు మరచిపోయి పారలౌకికానందంలో మునిగిపోతారు. దీనితోనే ఈ ప్రాంతపు ప్రజాజీవనము తరించిపోతుంది. 'హోలీ పండుగనాడు బావగారుకూడా మరదిల్ని వదినని పిలుస్తాడు.' అనే జనసామాన్యపు సామెతలు కూడా ఈ భావాన్నే సూచిస్తున్నాయి. ఈ పండుగ రోజున అన్యభావాలు గౌణమయి ఆ రాసక్రీడా జన్య మాధుర్యభావం ప్రధానమవుతున్నది. ఈ మాధుర్యభావ ప్రేరితులయ్యే ఉత్తరభారతీయులు హోలీపండుగను మరింత రసమయముగ చేస్తారు.

"మరల ఏడాదివరకు వుండేవారెవరో పోయేవారెవరో? ఒకవేళ ఉండినా మళ్లీ ఈరోజు వంటి అవకాశము కలగబోతున్నదా? ఏ పలుకు మాటలాడినా, ఏ పనులుచేసినా, ఏ నగ్నసత్యాలు పలికించినా సర్వసమ్మతమైన ఈ ఒక్క దినమేగా? మరల మరల చేయబోతామా, చేయనిస్తుందా సమాజము?" అనే భౌతికభావనా ప్రేరితులయి చేయగలిగినన్ని చిత్రవిచిత్ర కృత్యాలు చేస్తారు, అలసిపోతారు, సొలసిపోతారు, కడకు స్పృహతప్పికూడా పడిపోతారు!

ఈ పండుగనాటి ప్రాంతపు పత్రికలన్ని విశేష సంచికలు ప్రచురిస్తాయి. కవులు, పండితులు తమ పండుగను విలక్షణంగా జరుపుతారు. మహామూర్ఖ మండలి సభ జరుపుతారు. సభకు హాజరయ్యే పండితులు పైజామా చొక్కాలను తొడుక్కొచ్చేవారొకరైతే, కమీజు తిరగేసి తొడుక్కొచ్చేవారొకరు! ఈవిధంగా హాస్యవినోదాలతో గడుపుతారీ హోలీ పండుగ.

# గ్రంథ విమర్శనము

## హరిహరాద్వైత భూషణమ్

బోధేంద్రసరస్వతీ విరచితము. సంపాదకులు: టి. చంద్రశేఖరన్. ఎమ్. ఏ. ఎల్. టి. క్యూరేటరు. గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, మదరాసు. వెల 6-8-0.

ఇది హరిహరులకు విభేదం లేదనీ వీరిద్దరు ఒకే మూర్తికి భిన్నస్వరూపులనీ ప్రతిపాదించే సంస్కృత తాత్త్విక గ్రంథము. ఈ గ్రంథకర్త తమ రచనలో ఆయా సందర్భాలలో శ్లోకాలే కాక గద్యంకూడా విస్తారంగా వాడారు. సంస్కృతవాఙ్మయంలో ఈవిధంగా గద్య పద్యాత్మకమైన తాత్త్విక గ్రంథాలు చాలా స్వల్పంగా ఉన్నాయి. కేవలం రచనాదృష్ట్యా పరిశీలించినా ఈ గ్రంథం సంస్కృతవాఙ్మయంలో ఒక నూతనపంథా అవలంబిస్తున్నది.

గ్రంథకర్త వాదసారాంశం అంతా సంగ్రహించి ప్రత్యేకంగా కారికలుకూడా రచించారు. సంపాదకు లీ గ్రంథాంతంలో ఈ కారికలుకూడా చేర్చడంవల్ల పాఠకుల కివి ఎంతో ఉపయోగిస్తున్నాయి.

గ్రంథకర్త మొట్టమొదట మహోపనిషత్తు, నారాయణోపనిషత్తు, వైష్ణవోపనిషత్తు అనే వైష్ణవోపనిషత్తులు పరిశీలించి, ఇవి విష్ణుమాహాత్మ్యం ప్రతిపాదిస్తున్నా మిగిలిన దేవతల నెవ్వరినీ కొంచెపరచడంలేదని ప్రతిపాదించాడు. అలాగే మరి మూడు శైవోపనిషత్తులనుసరించికూడా చర్చించి ఇవీ ఇతర దేవతల నెవరినీ న్యూనతపరచడంలేదని నిర్ధారణ చేశాడు.

తరవాత వేదాలలోనించీ ఉపనిషత్తులలోనుంచీ అనేకోదాహరణాలిచ్చి శివకేశవులకిద్దరికీ వస్తుతః భేదమేమీ లేదని సిద్ధాంతీకరించాడు.

గ్రంథకర్త బోధేంద్రసరస్వతి, సన్యాసి. ఇదిగాక నామామృతరసోదయము, నామామృత రసాయనము, భగవన్నామభూషణము, హరిహరభేద ధిక్కారము అని నాలుగు సంస్కృతగ్రంథాలు రచించాడు. ఇతడు విశ్వాధిక యతీంద్రుని శిష్యుడు. తన గ్రంథాలలో అప్పయ్యదీక్షితుల నుల్లేఖించి ఉండడంవల్ల అతనికి సమకాలికుడో తరువాతివాడో అయిఉండవచ్చునని సంపాదకు లభిప్రాయపడుతున్నారు. ప్రస్తుతానికి కింతకంటె ఈ గ్రంథకర్తకాలం సరిగ్గా నిర్ధారణచెయ్యడానికి తగినసాక్ష్యమేదీ లభించడంలేదు.

బోధేంద్రసరస్వతి సమాధి ఒకటి కావేరీ తీరస్థమైన గోవిందగ్రామంలో ఉన్నదనీ, అయితే ఆ బోధేంద్రుడు ఇతడు ఒకరే అనడానికి తగిన ప్రబలమైనసాక్ష్యమేమీ లేదనీ సంపాదకులు వ్రాస్తున్నారు. ఇది ఇంకా పరిశోధించవలసిన విషయం.

ఈ గ్రంథం ఆంధ్రదేశీయ చరిత్రదృష్ట్యా ముఖ్యంగా పేర్కొనవలసిన గ్రంథం. ఆంధ్రదేశంలో ఒకప్పుడు శైవ వైష్ణవ విభేదాలు బాగా పెచ్చు పెరిగాయి. కాని హరినాథతత్త్వంతోను, పూజలోను ఈ విభేదాలకొక చక్కనిసమన్వయం కుదిరింది.

తిక్కనామాత్యుడు తన మహాభారతం అంతా హరిహరనాథుని కంకితం చేశాడు. ఇంకా కొందరు హరిహరనాథునికి తమ కావ్యాలంకితం చేశారు. దీన్నిబట్టిచూస్తే ఆంధ్రదేశంలో ఈ శివకేశవభేద సమస్య ఒకప్పుడు పొడచూపి ఉండవచ్చుననీ తిక్కనాదులు హరిహరసమారాధనద్వారా ఈ విభేద వినాశనం చేసి ఉండవచ్చుననీ, సాంప్రదాయికమైన హరిహరాద్వైతవాదానికి ప్రోద్బలం కలిగించి ఉండవచ్చుననీ ఊహించవచ్చును.

అప్పయ్యదీక్షితులకాలాన్నిబట్టి ఇది ఇంచుమించుగా క్రీస్తుశకం 17 వ శతాబ్దిలో రచించబడి ఉండవచ్చునని నిశ్చయించవచ్చును.

ఏది ఏమైనా ఇది ఆంధ్రుల హరిహరాద్వైత సంప్రదాయం అవగాహన చేసుకోడానికి బాగా ఉపయోగించగలదు.

ప్రాచ్యలిఖితపత్ర గ్రంథాలయంవారీ గ్రంథం చక్కని పీఠికతోను, తదితర సూచికలతోను సర్వాంగ సుందరంగా ప్రకటించారు.

## కాంతిపుంజంలో కారుచీకటి

రచయిత: ఆర్థర్ కోస్లర్. అనువాదం: చలసాని రాయ్. ప్రకాశకులు: ప్రతిభసాహితి, విజయవాడ. వెల: రూపాయిన్నర.

ఆర్థర్ కోస్లర్ రచించిన 'డార్క్‌నెస్ ఎట్ నూన్' అనే నవల ప్రపంచప్రసిద్ధి వహించింది. దీనికి కారణాలనేకం ఉన్నాయి. కోస్లర్ చాలాకాలం కమ్యూనిస్టు పార్టీలో ఉండి పనిచేశాడు. తరవాత కమ్యూనిజంలో ఉండే కష్టసుఖాలన్నీ అవగాహన చేసుకుని పార్టీలోనించి విడిపోయాడు. అటుతరవాత ఇతడు కమ్యూనిజాన్ని విమర్శిస్తూ ఎన్నెన్నో గ్రంథాలు రచించాడు.

'డార్క్‌నెస్ ఎట్ నూన్' కమ్యూనిజాన్ని నిశితంగా విమర్శించే నవల. అయితే ఈ నవలలో చేసిన కమ్యూనిస్టు విమర్శఅంతా ఒక కొత్తధోరణిలో నడిచిపోతుంది. తాత్త్వికదృష్టితోను, శాస్త్రీయ దృక్పథంతోను కమ్యూనిజాన్ని ఇంత నిశితంగా విమర్శించిన గ్రంథాలసంఖ్య చాలా స్వల్పం.

దీనిలో చవకబారు విమర్శఎక్కడా కనిపించదు. ఈనవలలో రూబషవ్ అనే కమ్యూనిస్టు నాయకుని చరిత్రే ప్రధానేతివృత్తం. రష్యా అధినేతలితనిమీద కొన్ని దోషారోపణలుచేసి చాలాకాలం విచారణ సలిపి చివరికి ఉరిశిక్ష విధిస్తారు. సంగ్రహంగా దీనిలో ఉన్న ఇతివృత్తమంతా ఇంతే. నవల చిన్నదైనా కథాకథనంలోను, పాత్రోన్మీలనంలోను కోస్లర్ కొన్ని కొత్తమార్గా లవలంబించాడు. కాని ఇదంతా మూలగ్రంథానికి సంబంధించిన విషయం.

ఇక అనువాదంమాట. ఇది ఆంగ్లంలోకి అనువదించినవారు డాఫీన్ హార్డీ. చలసాని రామారాయ్ గారిది ఆంగ్లంలోనించి తెలుగులోనికి అనువదించారు.

దీనిలో ఏ పేజీ తెరిచినా అపశబ్దాలు, దుష్టానువాదాలు కోకొల్లలుగా కనిపిస్తున్నాయి. ఇక తెలుగు నుడికారంమాట వేరే చెప్పనే అక్కరలేదు. 'వాళ్ళ యవ్వనకాలం, సగభాగం చట్టవిరుద్ధపు పోరాటాలలోను, కారాగారాల గోడలచేను తినెయ్యటంవల్లను వ్యయమైపోయింది.' పుట - 289.

“మరోకసారి తన పూర్వపు వ్యాపార రాయబార వర్గ కార్యాలయపు వాయువుల్ని పీలుస్తున్నాడు. ఆకార్యాలయం ఆగ్లోవా పరిపుష్టిత మందిరశరీరం నించివచ్చే విచిత్రమైన పరిచితపరిమళంతో నిండి ఉంది. తెల్లనిజాకెట్ పైగా వ్రాయటానికి వంగిన మెడవంకర, తాను చెప్పేటప్పుడుచేసే పదార్థవిరామ కాలంలో తినవ్వపుమూచే గుండ్రవికళ్లు కనిపిస్తున్నాయ్.” పుట - 153.

అనువాదమంతా ఇంచుమించు ఇలాగే సాగిపోతుంది. ఇది ఏభాషైనా కావచ్చునుగాని తెనుగు మాత్రం కాదు!

ఈ సుప్రసిద్ధ రచనకు అనువాదంలో బాగా ఖూనీ జరిగింది! దీనివల్ల మూలరచయితకేగాక మన మాతృభాషకుకూడా ఘోరమైన అపచారం జరుగుతున్నది.

ఇటీవల మనభాషలో ఇలాంటి అనువాదాలనేకం బయలుదేరుతున్నాయి. ఈ రచయితలందరు వ్యావహారికం అంటే ఇష్టంవచ్చినట్లు వ్రాయడమే అని అనుకుంటున్నారేమో తెలియదు. భాషాభిమానులు, వాఙ్మయాభిమానులు ఇలాంటి అనువాదాలు తలెత్తకుండా చెయ్యవలసిన అవసరం ఎంతైనా వున్నది.

ప్రతిభసాహితివారికముందునుంచైనా ఈ విషయాలు గమనించగలరనీ సమర్థులు వ్రాసిన అనువాదాలు మాత్రమే ప్రచురించగలరనీ ఆశిస్తున్నాము.

## సెలయేరు

జానపద గేయసంపుటి. సంకలనం శ్రీ నేదునూరి గంగాధరంగారు. సంపాదకులు తెలంగాణా రచయితల సంఘం. ప్రకాశకులు దేశోద్ధారక గ్రంథమాల, 3-5-1027, నారాయణగూడ. హైదరాబాదు (దక్కను.) వెల రూపాయి పన్నెండు అణాలు.

జానపదగేయవాఙ్మయాన్ని గురించి ఇటీవల మన దేశంలో జిజ్ఞాసాకుతూహలాలభివృద్ధి చెందుతున్నాయి. ఇది ముదావహం. వెనకటితరంలో కొందరీవిషయంలో బాగా పరిశోధనలు చేసి వెలుగులోకి ఈ వాఙ్మయ మహత్త్వం వెల్లడించారు. వీరిలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, మల్లంపల్లి సోమశేఖర శర్మ, చిలుకూరి నారాయణరావు, చింతా దీక్షితులు మొదలైనవారు ప్రముఖులు.

శ్రీ నేదునూరివారు సుమారు పాతిక సంవత్సరాలనించీ మన జానపదగేయాలు సేకరిస్తున్నారు. వీరి కృషి దేవేంద్ర సత్యార్థి మొదలైన ప్రముఖ గేయసంకలనకర్తల ప్రశంస లందుకొన్నది.

వీరి సంకలనంలో బాల సారస్వతము, స్త్రీసారస్వతము, ఉత్సవములు, భక్తి సారస్వతము, గృహజీవన సారస్వతము, శృంగార సారస్వతము, పాటకజనసారస్వతము, భజన సారస్వతము అని ఏడు విభాగాలున్నాయి.

ఆయా విభాగాలలో వీరు ప్రచురించిన గేయాలలో స్వచ్ఛమైన జానపద ధోరణి జాలువారుతున్నది.

జానపద గేయాలలో కృతక గేయాలు కూడా కొన్ని కలిసిపోయి జానపదగేయాలలాగే చెలామణీ అవుతున్నాయి. ఈ సంకలకర్త నిశితమైన వివేచనతో వ్యవహరించడంవల్ల ఉత్తమ గీతికలు సేకరించుకోగలిగారు.

మొత్తంమీద ఈ గేయసంపుటిలో స్త్రీల సారస్వతంలో సర్వోత్తమమైన గేయాలు కనిపిస్తున్నాయి.

ఈ గేయసంపుటికి శ్రీ బి. రామరాజుగారు వ్రాసిన ఉపోద్ఘాతం చక్కగా ఉంది. ఇది గేయసారస్వతాభిమానులందరు తప్పక పరిశీలించదగినది.

తెలంగాణా రచయితలసంఘంవారు ప్రచురించిన ఈ గేయసంపుటి ఈ ఉద్యమంలో కృషిచేసేవారికి మార్గదర్శకం కాగలదని ఆశిస్తున్నాము.

## దేశదేశాల కథలు

అనువాదం : గద్దె లింగయ్య. ప్రకాశకులు ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ. వెల ఒక రూపాయి.

ఇది చైనా, హంగరీ, జర్మనీ మొదలైన దేశాల కథలలోనించి అనువదించిన కథల సంపుటి.

ఈ రచయితలందరు ప్రఖ్యాత రచయితలే.

అనువాదంలో అక్కడక్కడ గ్రాంథిక వ్యావహారిక భాషా సాంకర్యము, చిన్న చిన్న శబ్దదోషాలు కనిపిస్తున్నాయి. రచయిత ముందు ప్రచురణలోనైనా ఈ దోషాలు సరిదిద్దుకోగలరని ఆశిస్తున్నాము.

## అక్షరసుందరి

ఎమ్. ఆర్. యస్. అయాచిత్. ప్రకాశకులు ఆంధ్ర విశ్వసాహిత్య పరిషత్, విజయవాడ. వెల పన్నెండణాలు.

ఇది ఇటీవలి అభ్యుదయానుసరణ మార్గంలో రచించిన గేయ ఖండకావ్యసంపుటి.

ఇందులో ఉన్నవన్నీ చాలావరకు మాత్రాచ్ఛందస్సులే. కొన్ని చోటులలో స్వేచ్ఛా ఛందో మార్గాలు కూడా కనిపిస్తున్నాయి.

ఈ కావ్యంలో చాలాచోట్ల అభ్యుదయ రచయితల అనుకరణలు కనిపిస్తున్నాయి. కొన్నిచోట్ల కేవలం నినాదాలే వినిపిస్తున్నాయి.

ఈరచయితలో కొంతఆవేశం ఉన్నది. క్రమంగా ఇది కవితారూపంలో ఆవిర్భవించగలదనీ రచయిత తమ స్వతంత్ర శక్తితో నూతన రచనలు సాగించగలరనీ ఆశిస్తున్నాను.

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.